# కాప్షన్ మీదే - 7



ఈనాడు కార్టూనిస్ట్, ప్రముఖ చిత్రకారుడు శ్రీధర్ వేసిన పై కార్టూన్‌కు
నవ్వొచ్చే కాప్షన్ రాయండి. శ్రీధర్ ఆటోగ్రాఫ్‌సహా చక్కని బహుమతి అందుకోండి!
బాగున్న మరో నాలుగు ఎంపిక చేసి పంపినవారి పేర్లను ప్రచురిస్తాం.

మీ కాప్షన్లు అందాల్సిన చివరి తేదీ ఈ నెల 16

చిరునామా: సంపాదకులు, చతుర, ఈనాడు కాంప్లెక్స్, సోమాజిగూడ, హైదరాబాద్- 082
e-mail : chatura@eenadu.net

---

ఉత్తమ వ్యాఖ్య :

**అయ్యో జాలరీ! నన్ను పడవలో వేసి
నువ్వు నీళ్ళలో పడిపోయావా..
రక్షిస్తానుండు!**

–డా॥ జయప్రద
స్విమ్స్ హాస్పిటల్, తిరుపతి



## కాప్షన్ మీదే - 6

బాగున్న మరికొన్ని కాప్షన్లు:

తిమింగలరావు గారికి మంత్రివర్గంలో
మత్స్యశాఖను కేటాయించారట
సి.యమ్‌గారు! అదీ సంబరం!!

–ఉమాబాల చుండూరు, హైదరాబాద్

ఎంత జలగండం ఉందని తెలిస్తే
మటుకు మరీ ఇంత విడ్డూరం
ఎక్కడా చూడలేదు

– పి.వెంకట నాగస్వరూపిణీ, హైదరాబాద్

గాలంవేస్తే కొత్త ఎమ్మెల్యేలు
దొరుకుతారో లేదో చూడాలి!!

– తోటపల్లి సుధీర,
తూపిలిపాలెం, నెల్లూరు జిల్లా

నేరం నాది కాదు ఆకలిది

–కె.ఆర్.వి.వి.రత్నకుమారి, హైదరాబాద్

# రచయితలకు సూచనలు



**నవ్యనవలా వేదిక 'చతుర'కు రచనలు పంపేవారు ఈ కింది సూచనల్ని గమనించాలి.**

★ చతురకు నవలలు పంపేవారు సామాజిక సమస్యలపై దృష్టి పెట్టాలి. హాస్య, వ్యంగ్య తదితర ఏ ఇతివృత్తమైనా ఎంచుకోవచ్చు. ఏ మాండలికమైనా రాయొచ్చు. వైవిధ్య కథా వస్తువులకు ప్రాధాన్యం ఉంటుంది. నవ్యతకే పెద్దపీట.

★ బొమ్మలు, వివిధ శీర్షికలు, ప్రకటనలు పోను 'చతుర' నవల అచ్చులో 80-85 పేజీలు ఉంటుంది. దీన్ని దృష్టిలో పెట్టుకుని రచయితలు తమ నవలల్ని అచ్చులో 85 పేజీలు మించకుండా రాసి పంపాలి.

★ ఒక పాత 'చతుర' సంచిక తీసుకుని అందులో ఉన్న నవలలో ఒకటి లేదా రెండు పూర్తి పేజీలను తమ దస్తూరితో రాసి చూసుకుని ఆ మేరకు తమ నవల రాతప్రతి ఎన్ని పేజీలలో రాయవచ్చో అంచనాకు రావడం సులభం. ఏదేమైనా అచ్చులో 80-85 పేజీలకు మించకుండా లేదా తక్కువ కాకుండా ప్లాన్ చేసుకుని పంపడం మంచి పద్ధతి.

★ ప్రచురణకు స్వీకరించని నవలలు/రచనలు తిప్పిపంపేందుకు వీలుగా స్టాంపులు అంటించిన సొంత చిరునామాగల కవరు జతపరచడం మరువకండి. రాతప్రతులు పోస్ట్‌లో పోతే 'చతుర' బాధ్యత వహించబోదు.

★ స్టాంపులు అంటించిన సొంత చిరునామాగల కవర్లు జతపరచని వారి రచనలు తిరస్కారానికి గురైతే ట్రాష్‌లోకి వెళ్లిపోతాయి. వాటి గురించి ఉత్తరప్రత్యుత్తరాలకు తావులేదు.

★ సాధారణంగా నవలలు కార్యాలయానికి అందిన 4 - 8 వారాలలోగా పరిశీలించి ప్రచురణార్హమైతే ఆ విషయం తెలియపరుస్తాం. కాకుంటే తిప్పిపంపడం జరుగుతుంది.

★ ప్రచురితమైన ప్రతి నవలకు రూ. 6000/- పారితోషికం ఉంటుంది. నవల ఏ నెలలో ప్రచురిస్తే ఆ నెల మొదటి వారంలోనే పై మొత్తానికి రచయితకు చెక్కు అందుతుంది.

★ 'కొత్తగాలి' శీర్షికకు చిరుకవితలు పంపేవారు నాలుగు/ఐదు పంక్తులు మించకుండా పంపాలి. స్పార్క్‌కే మార్కు అన్న విషయం గుర్తించాలి.

**చతుర**


**చిరునామా :**

**ఎడిటర్, చతుర, ఈనాడు కాంప్లెక్స్, సోమాజిగూడ, హైదరాబాద్-500082**

సంపుటి -32
సంచిక - 06
జులై 2009
378వ సంచిక

# చతుర





మంచి అమ్మాయికి,
సరైన అబ్బాయి సరిజోడి
కాకపోతే వచ్చే సమస్యలు
ఎలాంటివి?
తల్లిదండ్రులు చేసిన
పెళ్లి తనజీవితాన్ని
నరకంలా మార్చితే
ఆ అమ్మాయి భవిష్యత్తు
ఏమిటి?
కళంకితుడైన భర్తనుంచి
స్త్రీకి విముక్తి సాధ్యమా?
ఆద్యంతం
ఆసక్తికరంగా సాగే
**తనికెళ్ల కల్యాణి** నవల
**శ్రీకారం**
10 వ పేజీలో
బొమ్మలు: బాలు

## కథ వెనుక కథ



■ పతివాడ సూర్యనారాయణ

# 'విభజన' గాయానికి చికిత్స 'అపహృత స్త్రీ'

**హితం కోరేదే మతం. అది కంటి వెలుగుగా ఉండాలే కానీ, కాలాగ్నిలా దాపురించకూడదు. జనంమధ్య ఆత్మీయత పంచాలే తప్ప, హింసాద్వేషాలకు మూలం కారాదు. మతం వద్దు, గీతం వద్దు, మారణహోమం అసలే వద్దని బాధితులు హాహాకారాలు చేసే స్థితి.. ఎప్పుడూ దయనీయమే. అయినా దేశవిభజన తరుణంలో మతోన్మాదుల కారణంగా ఉత్తరాదిన జరిగిందదే. ఆ తీరుతెన్నుల్ని పత్రికల్లో చూసిన ప్రతిసారి ఎంతో చలించిపోయాడా కుర్రాడు! మదిలో వ్యథ మొలకనుంచి మ్రానులా ఎదిగింది.. ఫలితం ఆ రాజమండ్రి కుర్రాడితో ఒక నవలనే రాయించింది. అంతేకాదు.. పూజ్య బాపూజీ దివ్యస్మృతికి ఆ పుస్తకాన్ని అంకితం చేయించింది.**

ఇది సుమారు అరవైఏళ్ల కిందటి మాట!

ఆ నవలికే 'అపహృత స్త్రీ', అప్పటి ఆ యువ రచయిత మరెవరోకాదు.. పతివాడ సూర్యనారాయణ. అప్పటికి ఆయన వయసు కేవలం 18 ఏళ్లే!!

ప్రస్తుతం ఎనిమిది పదులు దాటిన పతివాడ 'అపహృత స్త్రీ' ప్రస్తావన రాగానే కదిలిపోయారు.. అలనాటి పరిస్థితుల్ని మననం చేసుకుని కలత చెందారు. నాడూ నేడూ ఏనాడూ జనహితమే సాహిత్య అభిమతమంటున్న ఆయన నవల 'కథ వెనుక కథ' ఇలా వివరించారు..

ఈ నవలికను ఎందుకు రాశాను? అని నన్ను నేనే ప్రశ్నించుకుంటే-ఒకటి కాదు.. రెండు సమాధానాలు నా ముందు నిలుస్తున్నాయి.

1. మంచిని పంచాల్సిన మతం ఆ రోజుల్లో రక్తపాతానికి కారణమైందన్న నిజం.

2. మతానికి మారుపేరు, మరోపేరు మానవతే అయితీరాలన్న నిశ్చిత అభిప్రాయం.

ఈ రెండూ ఇరువైపులా చేరి, చెరో చెయ్యీ నా భుజంమీద వేసి 'రాస్తావు కదూ' అంటుంటే రాశాను. మొదట కథగా, ఆ తర్వాత నవలికగా.

'ఆంధ్ర నేతాజీ' మద్దూరి అన్నపూర్ణయ్య గారి అంతేవాసిగా, విద్యార్థి రాజకీయాల్లోకి అడుగుపెట్టాను. సాహిత్య, సాంస్కృతిక కార్యక్రమాలూ సరేసరి. ఏ వృత్తిలో ఉన్నా, నా ప్రవృత్తి మాత్రం నిరంతర పుస్తక పఠనమే. ఇప్పటికీ అదే అలవాటు. ఎన్నో పుస్తకాలు సమీకరించి ఇంట్లో సొంత గ్రంథాలయం ఏర్పాటు చేసుకున్నాను. చదవడం, రాయడం.. మొదటినుంచీ ఈ రెండే నా అలవాట్లు. ఏకబిగిన రాసిన తర్వాతే మరోసారి సవరణలు చేసుకుంటా.

ఆ రోజుల్లోని చాలామంది యువకుల్లాగే మొదటి నుంచీ దేశాభిమానం జాస్తి. జాతీయవాదమంటే ప్రాణం (కాకతాళీయమే అయినా, నా పుట్టినరోజుకూడా ఆగస్టు పదిహేను). నాడు దేశ విభజన, మత కల్లోలాలు, ఫలితంగా.. సంఘ వ్యతిరేకుల దుష్కృత్యాలు పత్రికల్లో చదువుతుంటే ఒళ్లు గగుర్పొడిచేది. నా స్వస్థలం రాజమండ్రి ప్రాంతంలో హిందూ-ముస్లిం ఐక్యత కొనసాగుతున్నా ఇతర రాష్ట్రాల్లో, ప్రదేశాల్లో మతహింస చెలరేగడం కలవరపెట్టింది. 'ఏమిటిదంతా?' అనుకుంటూ మథనపడేవాడిని. వర్ణాంతర, మతాంతర

## గాంధీజీకి అంకితం



**న**వలను గాంధీకే అంకితం చేసిన నన్ను మద్దూరి భుజం తట్టారు. ఆ స్పర్శ, మాటల్లో కొండంత అభిమానం. అంతటి అదృష్టవంతుడిని నేను. మద్దూరి వారే అన్నట్లు- మతోన్మాదానికి బలైన బాపూజీకి ఈ నవలని అంకితమిచ్చి, నేను ధన్యుడినయ్యా. ఇంకా మద్దూరి మాటల్లోనే చెప్పాలంటే.. సోషలిస్టు సమాజం ఏర్పడినపుడే మతోన్మాదం అంతరిస్తుంది. ఆ వైనాన్ని చూపుతూ గ్రంథాన్ని ముగించడం ఔచిత్యాన్ని సూచిస్తోంది. 'భావోద్వేగానికి సుందరశైలిని జోడించి రచనను రసవంతంగా నడిపించా'నని మద్దూరి అన్నారు. అవే, ఆ అభినందనలే నాకు అక్షర లక్షలు.

## 'జై భారత్'లో ప్రచురణ

**'అ**పహృత స్త్రీ' రచనకు స్ఫూర్తి కారకులు మద్దూరి అన్నపూర్ణయ్యగారే. నా రాత- కూత అంతా ఆయన చలవే. స్వాతంత్ర్య యోధుడిగా ఆయన ప్రసిద్ధుడు. ఆ రోజుల్లోనే విద్యార్థి మహాసభను నిర్వహించి, జాతీయవాదానికి ప్రచారం కల్పించిన మేటి. తను సంపాదకుడిగా ఉన్న 'కాంగ్రెస్' పత్రికలో విప్లవవీరుల త్యాగకథనాలెన్నో ప్రచురించారు. ఫలితంగా కారాగారవాసం! తిరిగి రాగానే కాంగ్రెస్ సోషలిస్ట్ పార్టీలో చేరారు. తర్వాత నేతాజీ నాయకత్వంలోని ఫార్వర్డ్‌బ్లాక్‌లో ఉండి, మళ్లీ నిర్బంధానికి గురయ్యారు. విడుదలయ్యాక జైభారత్, నవశక్తి పత్రికల్ని నడిపారాయన. ఒకటా రెండా.. ఏకంగా 15 ఏళ్లపాటు కారాగారవాసం!!

ఆనాడు రాజకీయ రంగంలో ఉత్తమ విలువలకు ప్రతీకగా నిలిచారు. రచనలతో పత్రికారంగానికి వన్నె తెచ్చిన ఘనతా సంపాదించారు. తను 'జై భారత్' వారపత్రికకు సంపాదకుడిగా ఉన్నపుడే, 1948లో నా నవలను ప్రచురించారు. ఎస్ఎస్ఎల్‌సీ అనంతరం వేసవి సెలవుల్లో నేను చేసిన రచన అది.


మద్దూరి అన్నపూర్ణయ్య

బాపూజీ మరణం, అప్పటి స్థితిగతులకు చలించి ఓ పాట కూడా రాశాను. దాన్నీ పత్రికకెక్కించారు మద్దూరి.

## పది ప్రకరణాలు



నవలలో పది ప్రకరణాలు ఉన్నాయి. 'మత మనే పేరుతో మతోన్మాదులు బాహాటంగా మత యుద్ధాలు గావించే రోజులవి..' అంటూ రచన మొదలవుతుంది.

'ఆనాటినుండే ఆ ఆదర్శ వివాహితులు కుల మత విద్వేషాలు లేని సర్వ మానవ సమత్వమయిన సోషలిస్టు రాజ్యస్థాపనకు నడుం కట్టారంటూ పూర్తవుతుంది.

సమయ సందర్భాలకు అనువుగా మతపిశాచం పేరుతో చివర్లో ఒక గేయం. 'లేవోయి రావోయి భావిభారత వీర/ యెదలోని బాధేమి, మొగమేల దిగవేయనని ప్రశ్న వేసితివ/ వినవోయి వినవోయి' అంటూనే తుదికంటా ఉద్వేగంగా కొనసాగుతుంది.



వివాహాలే శాంతి సామరస్య సాధనాలని బలంగా నమ్మేవాడిని. ఈ అంతర్మథనమే 'అపహృత స్త్రీ' రచనకు బీజం వేసింది.

ముందు కథ రాయాలి అనుకున్నా ఏడాది గడిచేసరికి నవలికగా రూపొందింది. ఆ తరహా తెలుగు రచన అప్పట్లో అదే మొదటిది. ప్రేరణ కలిగించిన ముఖ్యుల్లో నా భార్య విజయలక్ష్మి (తనూ, నేనూ సహాధ్యాయులం కూడా) ఒకరు. ముందుమాట రాసింది మరెవరో కాదు, మద్దూరిగారే. పుస్తకం అచ్చులోకి వచ్చేసరికి 70 పేజీలు దాటింది.

**ఇదీ కథ**

అపహృత హిందూ స్త్రీని ఓ ముస్లిం యువకుడు పెళ్లిచేసుకుంటాడు. అటువంటి ముస్లిం యువతినే ఒక హిందూ యువకుడు పెళ్లాడతాడు. అప్పట్లో విభజన పేరిట కొందరు పెద్దలు తెచ్చిపెట్టిన సమస్యకి.. ఆ యువత చూపిన పరిష్కారమే అది.

ఉత్తర హిందూస్థానంలోని ఓ కుగ్రామం. ఆ గ్రామంలో ఓ చిన్న కుటుంబం.. గోవిందు, రాధ, వారి పిల్లలు భగవాన్, అంజలి. ఊళ్లో మతహింస పెచ్చరిల్లి గూండాల దండు గోవిందు తల నరుకుతారు. యౌవనంలో ఉన్న అంజలిని ఎత్తుకుపోతారు. మత కల్లోలాలతో పాడుపడిన మరో గ్రామ శివారులోని ఓ పాత ఇంట్లో ఆమెను ఉంచి అత్యాచారం చేస్తారు. తర్వాత బానిసగా అమ్మేస్తారు.

అంజలికోసం వెదుకుతున్న తల్లి రాధ, సోదరుడు భగవాన్‌కి దారిలో పొదల

## నార్ల ప్రోత్సాహం

మతోన్మాదులు దుండగాలకు పాల్పడటం, యువతులను అపహరించుకుపోవటం, అక్రమంగా నిర్బంధించి విక్రయించడం.. పత్రికల్లో కథనాలుగా వచ్చేవి. 'అపహృత' అనే పదం వాటిలోంచి తీసుకున్నదే. నా మనోవేదన, స్పందన స్వభావం గమనించి రచనరీత్యా ముందుకు నడిపించింది నాటి పాత్రికేయ ప్రముఖుడు నార్లవారే. ఆ మాట (అపహృత) నాలో స్ఫురించడానికి ఆద్యులు, బాధ్యులు ఆయనే మరి.

మధ్య నూర్జహాన్ మరో బాధిత యువతి కనిపిస్తుంది. వారు ఆమెను పట్నం చేర్చి ఓ ఇంట్లో ఉంచి కాపాడతారు. నూర్జ హాన్- భగవాన్‌లు పరస్పరం దగ్గరవు తారు.

అయితే అంజలిని కొన్న వ్యక్తి ఆమెపై అత్యాచారం చేయబోతుంటే అహమద్ అనే యువకుడు వచ్చి రక్షిస్తాడు. ఆమెని మరో రక్షణ కేంద్రంలో ఉంచుతాడు. అత నిదీ బాధిత కుటుంబమే. నిజానికి భగ వాన్ కాపాడిన నూర్జహాన్ అతని చెల్లెలే!

అంజలి ఉన్న రక్షణ కేంద్రంలో ఓ రోజున రోదనలు వినిపిస్తాయి. అక్కడో మహిళ శవం వద్ద విలపిస్తూ ఉంటాడొక యువకుడు. ఆ శవం రాధది. రోదించే యువకుడు ఆమె బిడ్డ భగవాన్. ఆ సమ యానికి అహమద్ అక్కడికి రావడంతో నూర్జహాన్ కనబడుతుంది. మతోన్మాదా నికి తన వారంతా బలైపోయారనుకున్న అతను.. అక్కడ సోదరిని చూడగానే చకితుడవుతాడు. అలాగే భగవాన్ సోదరి అంజలి కూడా అక్కడే ఉందని చెబు తాడు. అటు తర్వాత అహమద్- అంజలి నూర్జహాన్- భగవాన్‌లు పెళ్లిచేసుకోవ డంతో కథ సుఖాంతం అవుతుంది.

రత్నంలాంటి పిల్ల తెల్లగా మెరిసేది మోహన స్వరూపమంటూ.. వర్ణించి.. అంజలిని పరులకు విక్రయించే దుష్ట త్వాన్ని పతివాడ నవలలో పదునుగా చిత్రించారు. ఉన్మాదుల ధనాపేక్ష, కామ తృష్ణలను అడుగడుగునా నిరసించేలా సంభాషణలు. త్యాగధనుల ధీర చరితలనీ రచయిత అక్షరబద్ధంచేశారు.

## పెద్ద పెద్ద ఆశ

ఎప్పుడూ చెదరని చిరునవ్వుతో కని పించే ఎనిమిది పదులు దాటిన పతి వాడ.. చెప్పేదొక్కటే. యువత.. గతాన్ని అవగతం చేసుకోవాలి, ప్రస్తుతంలో సమ ర్థంగా నడవాలి, భవితమీద ఆశల్ని పెంచుకోవాలి. మాత్సర్యం కలిగించే మత వాదం నుంచి బయటపడితే, సాటిమను షుల్ని దరికి చేర్చుకోగలిగితే.. భావి భారతం బంగారమే.

సేకరణ: జంధ్యాల శరత్‌బాబు

## ప్రశంసలు

నవలిక వెలువడ్డాక నా తెలుగు గురువులు మెచ్చుకున్నారు. రచనా శైలి బాగుందంటూ ఆశీస్సులందించారు. కళాశాలలో చక్కటి పేరొచ్చింది. కాలక్రమంలో హిందూ-మహమ్మదీయ ఐక్యతే ధ్యేయంగా మరిన్ని కథలొచ్చాయి, నాటకాలు వెలువడ్డాయి, సినిమాలు విడుదల య్యాయి.

## అమృత వాక్కులు

★ అన్ని మతస్థుల్లో ఉత్తములున్నారు.

★ మనసులొకటైతే, మతాల ప్రసక్తి దేనికి?

★ పశ్చాత్తాపం మానవుల్లో పరివర్తన తెస్తుంది.

★ అనాథ రక్షణకంటే అవసరమయిన పనేముంది?

ఇవన్నీ 'అపహృత స్త్రీ'లోని సంభాషణలు. అప్పటికి విద్యార్థి దశలో ఉన్నా. అంతకు ముందే కొన్ని కథలు, వ్యాసాలు, పద్యాలు, గేయాలు రాశాను.

## కళ్లకు కట్టిన రాక్షసత్వం

స్త్రీల వలువలు వలిచే దుశ్శాసనులు, మాన భంగంచేసే మాయ రాక్షసులు, కత్తులు చూపి కన్నెలనెత్తుకుపోయే కిరాతకులు ఉన్న రోజులవి. కుటుంబాలతో కళకళలాడే భవనాల్ని కాల్చి శ్మశానాలు చేసే మసి రోజులవి. మత రాక్షసి మన భరతభూమిలో ముఖ్యంగా ఉత్తర దిశన ఇనుప కాళ్లతో విరుచుకుపడి తైతక్కలాడిన పరిస్థితులవి. దుండగుల ఘోర హింసలు, కత్తులూ కటార్లతో వాళ్లు చేసిన అకృత్యాలు, ఇంటింటా దోపిడీలు- వాడవాడలా గృహదహనాలు.. అన్నింటినీ అక్షరసాక్ష్యంగా కళ్లముందు నిలిపారు రచయిత.

ప్రాణ స్నేహితురాళ్లయిన రమ, హిమ తమ జీవితాలను అందంగా మలచుకోవాలని, హుందాగా బతకాలని చిన్నప్పటి నుంచి రంగురంగుల కలలుగన్నారు. చదువుకునే రోజుల్లో జరిగిన ఓ సంఘటనవల్ల హిమకు అసలు పెళ్లంటేనే అయిష్టం. ఇక రమకు తల్లిదండ్రులు మంచి సంబంధం చూసి పెళ్లిచేశారు. రమ వైవాహిక జీవితం కొద్దిరోజులు సజావుగా సాగినట్లే సాగి తర్వాత గాడి తప్పింది.. ఆమెకు ఎదురైన అనుభవాలు ఎలాంటివి? సంప్రదాయాన్ని ఆమె ఎలా ఎదిరించింది? పెళ్లంటే అసహ్యించుకునే హిమ జీవితం ఎలాంటి మలుపులు తిరిగింది? ఆద్యంతం ఆసక్తిని రేకెత్తించే తనికెళ్ల కల్యాణి నవల **శ్రీకారం** ఈ నెల చతుర కానుక!



"రమ ఇంకా రాలేదు" అంటున్న హిమబిందు భుజాల పైనుండి, రెండుచేతులు ముందుకొచ్చాయి.

తన వెనుక నుండి వచ్చిన ఆ చేతుల్ని హిమబిందు తన చేతులతో పట్టుకుంది.

గోరింటాకు పెట్టుకున్న ఆ చేతులు చూడముచ్చటగా ఉన్నాయి. తెల్లటి ఆకాశపు పట్టుచీర మీద ఎర్రటి చుక్కలు మెరుస్తున్నట్లుగా ఒక చేతికి చుక్కలు అందంగా ఉంటే, మరొక చేతికి సన్నటి లతలు... మధ్యలో 'హిమ' అని అక్షరాలు.

హిమ ఆ రెండు చేతుల్నీ వడిసి పట్టి, రమను తన ముందుకు లాక్కుని ఆమె కళ్ళల్లో చూసింది.

"అమ్మాయిగారు నిన్న రాత్రంతా ఫోను చెయ్యకుండా చేసిన పని ఇదన్నమాట" చిరుకోపంతో అంది హిమ.

రమ చేతులు విడిపించుకుని హిమ ప్రక్కన కూర్చుంది. మిగిలిన పిల్లలు మాట లాపి వాళ్లిద్దరి వంకే చూస్తున్నారు.

"సాయంత్రం ఇంటికి రమ్మంటే రాలేదు కదా"! రమ నెమ్మదిగా బదులిచ్చింది.

"మూడు గంటల సేపు చేతులు కట్టేసుకుని కూర్చుంటే ఎలా చెప్పు? కంప్యూటర్ వర్క్ ఉండిపోయింది"

రమ బదులివ్వకపోయేసరికి హిమ నవ్వుతూ అనేసింది.

"అరే! కాస్త నవ్వు తల్లీ! ఇప్పుడు అమ్మచేత పెట్టించుకొంటాను"

రమ తృప్తిగా నవ్వింది.

గోంగూర పచ్చడి రుబ్బుతున్న జానకమ్మ పిల్లలను చూసి "మీరందరూ వచ్చారంటే ఇక అట్లతద్ది వచ్చేసినట్లే" అంది నవ్వుతూ.

"చూడమ్మా! గోరింటాకు పెట్టించుకునేందుకు రమ్మంటే ఎలా గునుస్తోందో? " రమ ఫిర్యాదుగా అంది తల్లివైపు చూసి.

"అది గునుస్తున్నా, మొరాయించినా నువ్వు వదలవు. నీకోసం అది ఎలాగో పెట్టించుకుంటుంది. ఇది ఎప్పుడూ జరిగే తంతే కదా? " అంటూ ఆవిడ అవునా అన్నట్లు హిమ వైపు చూసింది.

హిమ కనురెప్పలు అంతేనన్నట్లు వాల్చింది. జానకమ్మ పచ్చడి పని పూర్తి చేసి, గోరింటాకు ముద్ద పట్టుకొని వాళ్ళ దగ్గరకు వచ్చింది.

"అమ్మా! నా చేతిలో ఎలా పెట్టాలో తెలుసుకదా!" హిమ నవ్వుతూ అడిగితే, ఆవిడ కూడా నవ్వుతూ తల ఊపింది తెలుసన్నట్టు.

హిమవైపు చూస్తూ రమ అంది "నువ్వు పెట్టుకొనేది ఒక చేతికి. దానికి నా పేరు రాయించడం ఎందుకు? "

హిమ జవాబు చెప్పకపోవడంతో రమ మరింత ఉడుక్కుని తల్లితో ఫిర్యాదుగా అంది "నువ్వు దీనికి అసలు పెట్టకమ్మా!"

"అంత సీను ఈ ఇంట్లో లేదు. కావాలంటే అమ్మ నీకు మానేస్తుంది, కానీ నాకు మానదు." ధీమాగా అంటున్న హిమ మాటలకు అప్పుడే వచ్చిన రాఘవరావు కూడ వత్తాసు పలికాడు.

హిమ అంటే వాళ్ళందరికీ ప్రాణం. కూతురు ఫ్రెండ్‌ను కూతురుకంటే మిన్నగా చూస్తారు వాళ్లు.

ఎక్కడనుండి వచ్చాడో సంజయ్ జానకమ్మను చుట్టేశాడు.

"అమ్మా! నాకూ పెట్టాలి" అంటూ తన చేతిని ముందుకు చాపాడు.

"లా చదువుతున్న పిల్లవాడు గోరింటాకు పెట్టుకుంటే కాలేజీలో నవ్వుతారు" జానకమ్మ నవ్వుతూ అంది.

"మేమంతా ఇక్కడున్నామని ఎలా తెలిసిందిరా"? హిమ తమ్ముడిని అడిగింది.

"ఇదొక పెద్దసిటీ. మీ జాడ తెలుసుకోలేకపోవడానికి" తేలిగ్గా అన్నాడు సంజయ్.

"ఏయ్ సంజూ! మమ్మల్ని అను. ఒప్పు

కుంటాను. మన ఊరినంటే ఒప్పుకోను" రమ చిరుకోపంతో అంది.

రాఘవరావు బట్టలు మార్చుకుని పిల్లల దగ్గర కూర్చుంటూ అన్నాడు "మా అమ్మాయి ఎదురుగా ఈ ఊరుని అంటే ఒప్పుకుంటుందా? "

అక్కకి పెళ్లిచేసి పంపేసినప్పుడు ఈ ఊరును కూడా పట్టుకెళుతుందా? " కొంటెగా అడిగాడు వాడు.

"ఏయ్. నా పెళ్లి విషయం ఎత్తావో చూడు" రమ తర్జనితో బెదిరించింది.

"బావుంది. అయితే నాన్నగారూ! అక్కకి మన ఊరిలోనే సంబంధం చూడండి. ఎవరికి ఇద్దాం? " సంజయ్ బుగ్గన చెయ్యిపెట్టుకుని ఆలోచన అభినయించాడు.

"ఎప్పుడూ వీడికి మా పెళ్ళిగొడవే" రమ మందలిస్తూ అంది.

జానకమ్మ నవ్వేసింది.

హిమ తమ్ముడి చెవి పట్టుకుని "ఆపుతావా? లేదా? " అనడిగింది.

వాడు వేళాకోళంగా అన్నాడు "ఆపను. పెళ్ళి త్వరగా... జరగాలని, మంచి భర్త రావాలని కాకపోతే ఈ అట్లతదియ నోములు నోచడం ఎందుకు? ఈ గోరింట పెట్టుకోవడం ఎందుకు? "

రమ రెండు చేతులూ జోడించింది.

★ ★ ★

పిల్లలందరూ ఏటి ఒడ్డున చేరారు. "నా చెయ్యి ఎలా పండిందో చూడు అని ఒకరంటే, తాంబూలంతో ఎరుపెక్కిన నాలుక చూపి "నా నోరు బాగా పండిందా? " అని అడిగే వారు మరొకరు, ఒకటే సందడి... సజీవ చైతన్యం... సంస్కృతీ ప్రవాహం.

కొంతసేపు దాగుడు మూతలు, కొంతసేపు ఏటి ఒడ్డున పరుగులు మరికొంతసేపు ఉయ్యాలలు, ఇంకొంత సేపు అంత్యాక్షరి.. ఇలాగ వారు ఆడని ఆటలు లేవు.

చివరగా అలిసిపోయి అందరూ ఇసుకలో కూలబడ్డారు. రమ అలసటగా హిమ ఒడిలో వాలింది.

తెల్లవారుతోందనడానికి చిహ్నంగా తూరుపు దిశ ఎరుపురంగు పులుముకొంటోంది. ఏటిగాలి చల్లగా తాకుతోంది.

హిమకి ఆ వేకువలో తన ఒడిలో ఒదిగిపోయిన రమను చూస్తే వాత్సల్యం పెల్లుబికింది. నుదిటిపై ముంగురులను సవరిస్తూ ప్రేమగా "రమా!" అని పిలిచింది.

రమకి తాదాత్మ్యం నుండి ఇవతలకి రావాలని లేదు. పదిమందీ కలిసి ఒక ప్రాణంలా బ్రతికారు. రేపటి బ్రతుకులెలా ఉంటాయో!

హిమ, తను హైస్కూలు చదువు నుండి కలిశారు. హిమ తండ్రి హైస్కూలుకి హెడ్ మాష్టరుగా రావడంతో తమ పరిచయం ప్రారంభమైంది. తమ స్నేహం కుటుంబాలకి కూడా ప్రాకింది.

హిమ మళ్ళీ పిలవడంతో అటు చూసింది. దేహం చామనచాయ రంగయినా, హిమ కళ్ళు ఆకర్షణీయంగా ఉంటాయి. హరివిల్లులా వంగిన పెదిమ క్రింద చిన్న పుట్టుమచ్చ, వత్తుగా, బలంగా పెరిగిన కేశ సంపద. ఎంత అణిచి దువ్వినా, ఆ జుట్టుని బంధించడం కష్టం.

"రమా! మన జీవితంలో ఈ రోజులు శాశ్వతం కదూ! అందరం ప్రతి ఏడాదీ ఇలాగే ఇక్కడ కలుద్దాం"

రమ ఏదో ఆలోచిస్తున్న దానిలా బదులు ఈయలేదు. హిమ తన మాటలు మార్చి చెప్పింది.

"హిమా! మీరందరూ ఉంటే నాకు ఏ ఆలోచనలు రావు. లేకపోతే ఎంత భయం వేస్తుందో!"

హిమ పెద్దదానిలాగ రమ తల నిమిరింది. "నేను నిన్ను వదలను. జీవితమంతా మన స్నేహం ఇలాగే ఉంటుంది" దృఢంగా పలికిందామె





## కొత్తగాలి...



**కనిపించని దేవుడికి..**
**దణ్ణంపెట్టు..**
**కనిపించే మనిషికి..**
**అన్నం పెట్టు!**

*–లోగిశం లక్ష్మీనాయుడు, సింహాచలం*

"మీరిద్దరే కాదు మనమందరం కూడా ఈ స్నేహం వదలుకోకూడదు" గిరిజ ఆరిందాలాగా అంది.

వసుధ దిగులుగా అంది "ఎలా గిరిజా? మనం మగవాళ్ళంగా పుట్టలేదు. రేపు ఎలాంటి వాడు భర్తగా వస్తాడో? మన అభిరుచులకి ఎంత ప్రాధాన్యమిస్తాడో? "

అందరూ ఆ విషయం యథార్థమన్నట్టు మౌనంగా ఉండిపోయారు.

గిరిజ తెప్పరిల్లింది.

"ఎప్పుడో కాలం ఎలా ఉంటుందో అని ఇప్పుడు ఆనందం పాడుచేసుకొంటామా? పదండి. తెల్లవారుతోంది ఇళ్ళకు పోదాం" అంది లేస్తూ.

రమ, హిమ ఒకరి చేతులు ఒకరు పట్టుకుని కబుర్లాడుతూ నడుస్తున్నారు. సంజయ్ వారి వెనుకగా వస్తున్నాడు.

"హిమక్కా? " ఒక మాటచెప్పనా? మీరు కలకాలం ఒకటిగా ఉండాలంటే ఏం చేయాలో తెలుసా? "

వాళ్ళు పట్టించుకోనట్టు చూశారు. అయినా అతడు ఊరుకొంటే కదా!

"...ఇద్దరూ కలిసి ఒకరినే పెళ్ళి చేసుకోండి. ఇక విడిపోయే ప్రశ్నేలేదు. కాకపోతే మీ ఇద్దరితో పడలేక అతనుమాత్రం సన్యాసుల్లో కలవవచ్చు" అన్నాడు కిసుక్కున నవ్వుతూ.

రమ బాధగా చూసింది. పరిహాసమైనా కరుకుగా ఉంటే భరించలేదు.

హిమ వాడిని పట్టుకోవడానికి పరుగెట్టింది. కానీ దొరికితేనా?

ఆయాసపడుతూ "నీ పని ఇంటికి వచ్చాక చెపుతాను" అంటూ వచ్చి రోడ్డు పక్కనున్న సిమెంటు బెంచీ మీద కూలబడింది హిమ. రమ కూడా కూర్చుంది. వాళ్ళను చూసి నవ్వుకొంటూ సంజయ్ వెనక్కి వచ్చాడు.

అతడిని చూసి వీడికి వయసు పెరుగుతోంది కానీ బుద్ధి పెరగటం లేదు సుమా అనుకుంది హిమబిందు.

"అరె చిన్నూ! నాన్న చెప్పులు సరిపోతాయని చంకలు గుద్దుకోవడం కాదురా, ఎదుటివారు బాధపడకుండా మాట్లాడాలి" హిమ తమ్ముడిని ఎగతాళిచేస్తూ, బుద్ధి చెప్పింది.

వారికి అందనంత దూరంలో నిలబడిన సంజయ్ నవ్వాడు. "మీరు కూడా అమ్మ చీరలు సరిపోయేటంత అయ్యామని మురిసిపోకండి. చెప్పిన విషయంలో వాస్తవం గ్రహించండి.

"అదిగో మళ్ళీ"... హిమ తర్జని చూపిండంతో అతడు ఆగాడు. హిమ తలతిప్పి రమ వైపు చూసింది.

రమ రోడ్డుకు ఆ వైపు చూస్తోంది. ఎదురుగా కొద్ది దూరంలో శివాలయం. శివాలయపు ధ్వజస్తంభం, ఆకాశదీపం అక్కడికి కన్పిస్తున్నాయి.

కోవెలలోని గంటలు గణగణమంటున్నాయి. ఆ గంటల ధ్వని, ఆ ప్రశాంత వాతావరణం, ఆ ఏటి గలగలలు, పెద్దగా పాతకుపోయిన రావిచెట్టు ఎంత అందమైన పరిసరాలు? తమ బ్రతుకులో ఎంత సందడి నింపాయి? అని ఆలోచిస్తుంది.

★ ★ ★

హిమ, సంజయ్‌లు ఇంటికి రావడం చూసి శాంత అడిగింది "అయ్యాయా సంచారాలు"?

"ప్రస్తుతానికి ఒక విరామం..." అంటూ

కూర తరుక్కొంటున్న తల్లి ప్రక్కన హిమ కూర్చుంది.

పసుపురంగు పరికిణీ జాకెట్టు, నల్లటి ఓణీలో అందంగా కన్పిస్తున్న కూతురిని ఆవిడ తృప్తిగా చూసింది.

"చూశావా! ఎప్పుడూ ఇలాగ ఉండవచ్చు కదా! ఆ డ్రెస్‌లు జీన్స్ ప్యాంటులతో ఎందుకు మమ్మల్ని చంపుతావు? " ఆవిడ ధైర్యంగా అనేసింది.

"బావుంది. ఎప్పుడూ ఇలాగే ఉంటే ఆ డ్రెస్‌ల వాళ్ళకి అమ్మకాలు తగ్గవా? " హిమ సరదాగా అంది.

"ఔనులే! రమ పుణ్యమా అని ఏదో నాల్గయిదు ఇలాంటివి ఉంచావుకానీ మా కోసమా? " ఆవిడ దీర్ఘం తీసింది.

హిమ తన బట్టలవైపు చూసుకుంది. తను ఇలాగ ఉంటే రమకి ఎంతో ఇష్టం.

"అమ్మా! దుస్తులు మన సౌకర్యం ప్రకారం ఉండాలి. స్కూటర్ లాంటివి నడపాలంటే వీటితో కష్టం కదా!" అంది.

"దాన్ని ఎందుకే ఎప్పుడూ దేనికోదానికి సతాయిస్తావు" ఆనందరావు భార్యతో అన్నాడు.

"బావుంది. మీరు పంచె, లాల్చీ వేసుకొని తెలుగుతనం ఉట్టిపడుతూ తిరుగుతారు. మీ పిల్లని అలాగ పిచ్చి పిచ్చి బట్టల్లో ఎందుకు తిరగనిస్తున్నారు? " ఆవిడ కోపం భర్త మీదికి మళ్ళింది.

"పిల్లలకి ఫ్రీడమ్ ఇవ్వాలి. అన్ని విషయాల్లో మనకి నచ్చినట్లు ఉండమని బలవంతం చెయ్యకూడదు" ఆయన హితబోధ చేశారు.

హిమ తండ్రి మెడచుట్టూ చేతులు వేసి కౌగిలించుకుంది.

"మా మంచి నాన్నగారు. నాన్న అమ్మని కాస్త మీ అధునాతన మాటలతో మార్చండి" అంది.

ఆయన భార్యవైపు ఓరగా చూస్తూ అడిగారు, "నీకు కూడా నాలుగు డ్రెస్‌లు కొని

## కొత్తగాలి...

**మట్టిలో విత్తనం**
**మొలవగానే మానౌతుందా!**
**ఎదగాలంటే సమయం పడుతుంది**
**సహనం కావాలి**

– పెరుకరాజు, నర్సింగాపూర్, కరీంనగర్

తెమ్మన్నావా? అప్పుడు కూతురితో వాదనకి దిగవు"

భర్త వేళాకోళానికి ఆవిడ ఉడికిపోయింది.

"సిగ్గులేకపోతే సరి. డ్రెస్‌లు కొంటారుట డ్రెస్‌లు"

ఆయన నవ్వేశారు. "అందులో తప్పు ఏం ఉంది? నాకు కూడా నిన్ను వాటిలో చూడాలని ఉంది తెలుసా? "

ఆవిడ చిరాగ్గా చూసింది.

"నాకు కూడా మిమ్మల్ని ప్యాంటు, షర్టుల్లో చూడాలని ఉంది. మారతారా? "

"వైనాట్? అలాగే మారుతాను. సాయంత్రం వెళ్ళి కొనుక్కొందామా ఇద్దరం" ఆయన అంటూంటే హిమ ఒకటే నవ్వు

"ఎందుకు నాన్నా మీరు శ్రమపడటం. నేను వెళ్ళి మీకిద్దరికీ తెస్తాను" అని ఆమె అంటుంటే తల్లి ఓ మొట్టికాయ వేసింది.

"మీ ఫ్రెండుకి సంబంధాలు చూస్తున్నారు. మరి నీ సంగతి చెప్పమ్మా! నేను కూడా చూడనా? " తండ్రి అడుగుతుంటే హిమ చేతి వేళ్ళవైపు చూసుకుంటూ మౌనంగా ఉండిపోయింది.

ఎర్రగా పండిన చేతితో, గాజుల సందడితో పరికిణి జాకెట్టులో కూతురు నిజంగా ఆనందరావుకి కొత్తగా అన్పించింది.

తలంటుకున్న జుట్టు క్లిప్ పెట్టి వదలడంతో వెనుక గాలికి కురులు ఎగురుతున్నాయి. నుదుటిపై దోసగింజ ఆకారంలో



స్టిక్కర్, సన్నగా కంటికి కన్పిస్తున్న కాటుక రేఖలు కూతుర్ని అలాగ చూస్తూంటే ఆయనకి పెళ్ళి చేయాలన్పించింది.

హిమబిందు స్థిరంగా అంది.

"నాన్నగారూ! ఎంసీఏ పూర్తయ్యాక జాబ్ చేస్తాను"

శాంత భర్త వైపు చూసింది.

"ఏమిటండీ? ఇది ఇప్పుడు ఉద్యోగం చేసి ఏం చెయ్యాలి? హాయిగా దాని పెళ్ళి చేస్తే మనకి బాధ్యత తీరుతుంది. ఇప్పటికే ఆలస్యం అయింది."

"ఇది అన్యాయం. నా విషయంలో నా మాట వినవద్దని, సాటి ఆడదానివి, తల్లివైన నువ్వే చెప్పడం క్షమించరాని, భరించరాని విషయం."

సంజయ్ వచ్చి అక్క వీపు రాశాడు. "అంత భారీ డైలాగులు ఎందుకే? ఆవేశపడకు. అమ్మకి కూడా నాలాగే పెళ్ళి లడ్డూలు, మినప సున్నుండలు తినాలన్పించిందేమో! అవునా అమ్మా!" అంటున్న కొడుకుని శాంత మింగేసేటట్లు చూసింది.

"నాన్నగారూ! నాకు కొన్ని ఆశలున్నాయి. లక్ష్యం ఉంది. పెళ్ళి పేరుతో వాటిని పాడు చేయవద్దు" హిమ గట్టిగా చెప్పింది.

"ఇంతవరకూ దానిమాట విని చదివించారు. ఇప్పుడు చదువు పూర్తవుతుంది కనుక పెళ్ళి చేయండి. వచ్చే భర్తకి ఇష్టమైతే అప్పుడు ఉద్యోగం చేస్తుంది" అంది శాంత కూడా అంతే గట్టిగా.

హిమ నవ్వింది. "బావుంది ఎక్కడివాడో వచ్చి నా ఆశ నెరవేరుస్తాడు. పెంచి, పెద్ద చేసి, విద్యాబుద్ధులు నేర్పించిన మీకే నా ఆశయాలు అర్థమవనపుడు, బయటివాడికి ఎలా అర్థమవుతాయి? ఏది ఏమైనా నాకు ఉద్యోగం చెయ్యాలని ఉంది. నాదంటూ బ్రతుకు ఏర్పరచుకోవాలి. అంతవరకూ పెళ్ళిమాట వద్దు" అంటూ తీర్మానించింది.

ఆనందరావు మౌనం వహించాడు.

రమ ఇంట్లో కూడా ఇదే పరిస్థితి. పగలంతా ఆడి, ఉపవాసం చేసి, సాయంత్రం పూజ చేసి పడుకున్న కూతురిని రాఘవరావు అభిమానంగా చూశాడు.

ఒక తెల్ల గులాబీ వడిలినట్లుగా ఉంది రమ. సంతానం లేని తమకి ఎన్నాళ్ళకో పుట్టిన రమంటే ఆయనకి ప్రాణం.

శ్రావణ శుక్రవారం నాడు పుట్టిందని "రమాదేవి" అని పేరు పెట్టాడు. మునుపు ఐదు ఎకరాలు ఉన్న పొలం రమ పుట్టాక ముప్పై ఎకరాలవడంతో మోతుబరి రైతు అయ్యాడతను.

సంపద పెరిగింది. మంచివాడు. ఉపకారమే తప్ప అపకారం చేయడం తెలియని ఆయనంటే ఉన్న అభిమానంతో ఊరి ప్రజలు ఆయన్ని గెలిపించారు సర్పంచిగా.

రాజకీయాలలోకి రాకుండానే ఉండాలి. వచ్చాక వెనక్కి వెళ్ళడం జరగని పని. ఆ తర్వాత మండలాధ్యక్షునిగా నిలబడటం తనకిష్టం లేకపోయినా తప్పలేదు. స్నేహితుల గొడవ, పార్టీ గొడవ. అయితే రాజకీయాలను కూడా ఆయన క్రమబద్ధంగా నిర్వహించడం అలవాటు చేసుకొన్నాడు.

జానకి కూతురి గదిలో మంచినీళ్ళు పెట్టడానికి వచ్చింది.

"ఏమిటలా చూస్తున్నారు?" అని అడిగింది.

"అమ్మాయికి ఈ ఏడాది పెళ్ళి చేయాలనుకొంటున్నాను. కానీ ఈ తల్లి వెళ్ళిపోతే ఉండగలమా అని బెంగగా ఉంది." గదిలో నుండి ఇవతలకి వస్తూ దిగులుగా అన్నారాయన.

"దగ్గర సంబంధాలైతే మన అభిప్రాయాలు అర్థమవుతాయి. మీరేమో నా మాట వినరు" ఆవిడ కినుకగా అడిగింది.

ఆయన భార్యవైపు విసుగ్గా చూశారు.

"నావైపు బంధువులవి రెండు సంబంధాలు, నీవైపున్నది ఒకటి. వాటిలో చూడమంటావు. ఒకడు చూస్తే పొట్టుబస్తాలాగలావు. మరొకడు బి.యిడి మేష్టరు, మరొకడు డిగ్రీతో ఆపి, ఏదో కంపెనీలో ఉద్యోగి. ఇవే కదా నువ్వు అనుకొంటున్న సంబంధాలు."

ఆయన అంత కరుగ్గా మాట్లాడుతూంటే ఆవిడ ఏమనగలదు?

"మీరు అంతే ఆలోచిస్తున్నారు. మన మాట చెల్లే చోట పిల్లనిచ్చుకుంటే అమ్మాయి, భర్త వస్తూ, వెళుతూ ఉంటారు. ఉద్యోగం పురుష లక్షణమేగానీ మన ఆస్తి ఎవరు తినాలి చెప్పండి?"

ఆవిడ కంఠం బరువుగా, బెంగగా విన్పిస్తోంటే ఆయన మౌనం వహించారు.

భగవంతుడు తనకు అపురూపమైన బిడ్డనిచ్చాడు. జీవితంలో ఏ అశాంతీ తన చిట్టి తల్లికి ఉండరాదు. అందుకే ఇంతగా ఆలోచించడం? అనుకొన్నారాయన.

జానకమ్మకి భర్త అలాగ ఆలోచించడం నచ్చలేదు "చదువుదేముంది? తమ కోరిక చెపితే వాళ్ళు ప్రైవేటుగా చదివిస్తారేమో"

ఆయన నవ్వాడామె ఆలోచనకి. "వాళ్ళ బద్ధకం నాకు తెలియదా? జీవితంలో వాళ్ళకి ఎక్కడలేని తృప్తీ" అన్నారు.

"ఎవరికైనా తృప్తి లేకపోతే బాధపడాలి. ఉంటే బాధపడటం ఎందుకు?" అందామె వెంటనే.

ఆయనేం మాట్లాడక పోవడంతో మళ్ళీ తనే- "తృప్తిగా బ్రతకని వాళ్ళని చూసి జాలిపడాలి. పడేవారిని గౌరవించాలి. అలాంటివాళ్ళకి పిల్లనిచ్చినా బెంగుండదు. నిశ్చింతే" అంది.

ఆయన ఒప్పుకోలేదు.

"అమ్మలు పెళ్ళి విషయం నాకు వదిలెయ్యి. అపురూపమైన వ్యక్తిని, అందమైన వాడిని, అంతస్తుగలవాడిని తెస్తాను. సరేనా? నా బంగారు తల్లి ప్రక్కన సామాన్యులను ఉంచగలనా"

ఆయన మాటలకు ఆవిడ మౌనం వహించింది. ఏనాడూ వివాహమయ్యాక భేదాభిప్రాయం అన్నది ఆ దంపతులకి లేదు. కాని పాప విషయంలో ఇద్దరి ఆలోచనలూ చెరోవైపు వెళుతున్నాయి.




ఇద్దరి మధ్యా నిశ్శబ్దం. పరీక్షలు దగ్గరలోనున్నాయి. చదువు విషయంలో బెంగ లేదు. టాప్ మార్కులు ఎలాగూ వస్తాయి.

హిమ ఫైనల్‌గా అనేసింది.

"లాభం లేదు రమా! నువ్వలాగ నోట్లో బెల్లంముక్క పెట్టుకుని కూర్చుంటే ఎలా? పెళ్ళి ఇప్పుడే వద్దని, జాబ్ చేస్తానని నిర్భయంగా చెప్పు."

రమ భీతావహంగా చూసింది. తను చెప్పడమా? అసలు అమ్మానాన్నా తన పై చదువుకి మొదటే అభ్యంతరం చెప్పారు. అప్పుడు హిమ ఎలాగో వాళ్లకు నచ్చచెప్పి ఒప్పించింది.

దాంతో అప్పుడే వాళ్లు తమ నిర్ణయాన్నీ చెప్పారు. ఈ చదువు పూర్తవగానే పెళ్ళి చేసుకోవాలని. ఉన్న ఒక్కపిల్లకి వైభవంగా పెళ్ళి చేయాలని, కూతురు, అల్లుడూ ఇద్దరూ చిలకాగోరింకల్లాగ తిరుగుతుంటే చూడాలని వాళ్ళ ఆశ.



ఇప్పుడు అదే విషయం రమను ఆలోచింపచేస్తోంది. హిమ తేలికగా అనేసింది. "మనమేమైనా ప్రేమా, దోమ అంటూ వేషాలు వేయడం లేదు. కేరీర్ బాగా ఉంచుకోవాలని ఆశపడుతున్నాం. అది తప్పా? "

రమకి తెలుసు. అదంతా నిజమే. కానీ పరిస్థితులు గమనించాలి కదా!

హిమ చిరుకోపంతో అంది.

"నువ్వు మాట్లాడటం లేదు. చూస్తే నీకే త్వరగా పెళ్ళిచేసుకొని, పాపాయిని కనాలని ఉన్నట్లుంది."

రమ హిమ భుజం మీద చిన్నగా కొట్టింది. "ఏయ్. ఏమిటా మాటలు? నామనసు అక్కడికి కాచి ఒడబోసిన దానిలాగ. ఉత్తినే ఎందుకు వాదనలు? ముందు వాళ్ళను నొప్పించడం ఎందుకు? దగ్గర సంబంధాలవైపు నాన్న మొగ్గు చూపడం లేదని అమ్మ బాధపడుతోంది. పై సంబంధం రావాలి, కుదరాలి, పెళ్ళి జరగాలి అప్పుడుకదా విషయం గురించి మనం మాట్లాడాలి."

హిమ గుబులుగా అంది.

"సంబంధం చూశాక పెళ్ళిచూపులు ఆపగలమా? పెళ్ళి చూపులు జరిగాక వద్దని మానేయగలమా? ఏమో? రమా! ఈ పెళ్ళి మన ఇద్దరినీ విడదీసేలా కన్పిస్తోంది."

రమ వెంటనే హిమ చెయ్యిపట్టుకుని అంది. ..."అలా ఎప్పుడూ అవదు. దేహాలు వేరైనా మన ప్రాణం ఒకటే."

హిమబిందు అప్పటికి కుదుటపడింది. అయినా ఇద్దరి మనసులో ఏవో భయాలు...

ఇంటికి వచ్చిన పిల్లలిద్దరికీ జానకి మినపసున్ని, జంతికలు తెచ్చి పెట్టింది.

హిమ మినపసున్ని ఉండ తింటూ తాదాత్మ్యంగా కళ్లు మూసుకుంది.

"అమ్మా! మీ చేతిలో అమృతం ఉంది. ఎన్నిచోట్ల ఇవి తిన్నా వీటి రుచి మాత్రం వేరు" అంది.

జానకి నవ్వుతూ "మరొకటి ఇవ్వనా? " అని అడిగింది. రమ పక్కుమని నవ్వింది.

హిమ కినుకగా అడిగింది "అంటే నేను భత్రాజులాగ, తిండిపోతులాగ కన్పిస్తున్నానా? అమ్మా.. చెప్పు"

రమ మొహం పక్కకి త్రిప్పుకుంది.

"చూశావా అమ్మా! మీరు ఇది అమాయకురాలంటారు. కాని చాలా మేధావి. తను పెదవి విప్పి అనదు. అభినయంతోనే అన్నీ బయటపడతాయి" హిమ మాటలకి నవ్వుతూ జానకి నిజంగానే మరొకటి తెచ్చి వేసింది.

"మీరిద్దరూ ఇక్కడే ఉన్నారా? థాంక్ గాడ్" మన పద్మ సూసైడ్ చేసుకొంది. అందరూ అక్కడే ఉన్నారు. మీ కోసం నేను వచ్చాను" గిరిజ రొప్పుతూ చెప్పింది.

పద్మ.. ఎప్పుడూ నవ్వుతూ బొంగరంలా తమ మధ్య తిరిగిన పద్మ.. ఇకలేదా?

"ఎందుకు... ఎందుకు? " హిమ గొంతు వణికింది.

"వేణుకి పెళ్లి కుదిరిందని తెలిసి సూసైడ్ చేసికొంది. ఈ నెలలోనే అతడి పెళ్లిట" గిరిజ చెప్పింది వెక్కుతూ.

హిమ గిరిజతో బయలుదేరింది. జానకి రమను వద్దంది. రమ మనసు అసలే సున్నితం. తట్టుకోలేదు. తను వెళ్లి చూడాలన్నా రమ దగ్గర ఎవరో ఒకరుండాలి. ఆవిడ హిమను త్వరగా రమ్మంది.

రమ చేష్టలు లేనిదానిలాగ కూర్చుంది. నిన్ననే తామంతా పద్మను చూశారు. మనిషి సరదాగా లేదు. ఏదో దిగులుగా కన్పించింది. ఆ దిగులు ఇదా? ...

చాలా సేపటి తర్వాత హిమబిందు వచ్చింది. వస్తూనే రమను కావలించుకుని ఏడ్చింది.

పద్మ.. కుక్కపిల్ల కాలికి దెబ్బ తగిలితే ఎంతో బాధ పడిపోయే పద్మ, గొంగళి పురుగుని చూస్తే చాలు భయపడి పోయే పద్మ, చిన్న తలనొప్పి వస్తే ఓర్చుకోలేని పద్మ.. స్లీపింగ్ పిల్స్ ఎక్కువ మోతాదులో తిని మరణించింది.

హిమ వెక్కుతూ అంది "వెధవ. వారం రోజుల క్రితం వరకూ దీని వెనకాల ప్రేమా దోమా అంటూ తిరిగాడు. దీన్ని పెళ్లాడుతానన్నాడు. ఇప్పుడు తండ్రి ఒప్పుకోవడం లేదని అక్క కూతురితో పెళ్లికి సిద్ధపడ్డాడు. ఛ.. అలాంటి వాడిని ఎందుకు ప్రేమించానా అని బాధపడాలి. కానీ ఇలాగ జీవితం చాలించుకోవడం ఏం బావుటుంది? "

రమ గొంతులో ఏడుపు సుడులు తిరుగుతోంది. పాపం, ఎంత వైరాగ్యం దానికి వచ్చిందో? ఆక్షణాలలో ఎంత ధైర్యం తెచ్చుకుందో! తన బ్రతుకు మీద తనకి ఎంత అసహ్యం అన్పించిందో?

"హిమా అది మానసికంగా ఎంత నలిగిపోతే ఆ నిర్ణయానికి వచ్చిందంటావు? బ్రతుకు మీద ఏ కోశానా తీపి లేనివారే అలా చెయ్యగలుగుతారు"

హిమబిందు త్రాచుపాములాగ బుసలు కొడుతూ తలఎత్తి అంది, "దీని వలన ఎవరికి నష్టం? వాడికేం...? హాయిగా అన్నీ మరిచి పది రోజులలో పెళ్లి కొడుకుగా పీటల మీద కూర్చుంటాడు. మరి మన పద్మో.. బ్రతుకే చాలించుకుంది. ఆ తల్లిదండ్రుల కడుపులో ఆరని చిచ్చు పెట్టింది. పచ్చని నూరేళ్ల బ్రతుకు బుగ్గి చేసుకొంది. ఛీ... అలాంటిది మన ఫ్రెండంటే ఎంత సిగ్గుచేటు? "

"ప్లీజ్ హిమా! అలా అనకు. అది మన పద్మ. దాని సున్నిత హృదయం ఎంత ముక్కలవకపోతే అలాంటి నిర్ణయం తీసుకొంటుంది? " రమ స్వరం కంపించింది.

రమ ఏడుపుచూసి హిమ తగ్గింది.

"అందరం ఎంత బాగా, అరమరికలు లేకుండా కలిసిపోయాం. నవ్వులతో, చదువుతో, కబుర్లతో కాలం ఎంతబాగా గడిపాం? ఇప్పుడు... మనకి...తన కష్టం చెప్పుకోకుండా, ఇలాగ వెళ్లిపోయిందంటే నా గుండె పిండినట్లవుతోంది"

రమ మాటలకు బిందు కళ్లు వర్షించాయి, "మనతో లీలగానైనా చెప్పి ఉంటే ధైర్యం చెప్పేవాళ్లం. లేదా అతడిని బ్రతిమాలి పెళ్లికి ఒప్పించేవాళ్ళం కదూ? " కన్నీళ్ళ మధ్య అడిగింది.

హిమకి ఆవేశం వచ్చింది. "ప్రేమ ఒక పెద్ద ట్రాష్. యువతీయువకులు ఎందుకు ఈ ఊబిలో పడి మతులు పోగొట్టుకొంటారో నాకు అర్థమవదు".

## గాలిబ్ చతురోక్తులు



భారతీయ మహాకవులలో నిర్మకుట చక్రవర్తి అయిన గాలిబ్ 1795లో ఆగ్రాలో జన్మించాడు. తర్వాత ఢిల్లీలోనే ఆమరణాంతం నివసించాడు. అసమాన ప్రతిభా సంపన్నుడైన ఆయన ఉర్దూ, పార్శీలో కవితలు రాశాడు. వివిధ సందర్భాల్లో వెలిబుచ్చిన సరస, హాస్య చతురోక్తులు కొన్ని...

### ఏ లింగం?



రథ శబ్దాన్ని కొందరు స్త్రీలింగంగాను, కొందరు పుంలింగ శబ్దంగాను వాడతారు. ఏది సరైనదో తెలుసుకుందామని కొంత మంది గాలిబ్‌ను అడిగారు. దానికి ఆయన హాస్యంగా చెప్పిన సమాధానం- ఆడవాళ్లెక్కిన రథం స్త్రీలింగం, మగవాళ్లెక్కిన రథం పుంలింగం. అంతే..!



రమ కిటికీలోనుండి బయటకు చూస్తూ అంది, “అంతే బిందూ! ‘ప్రేమ’ పెద్ద ఆకర్షణ. దాని ముందు ప్రేమికులకి జీవితమే ఏమీ కాదనిపిస్తుంది. ప్రేమ, పెళ్లి ఇవి మన భవితకి, విద్యాభివృద్ధికి అవరోధాలని వారు గ్రహించుకోరు. ఒకవేళ గ్రహించినా దాని ప్రభావానికి ఎదురీదలేరేమో? ”

హిమబిందు శపథం చేసినట్లు అంది. “నా జీవితంలో ఈ ‘ప్రేమ’ పదానికి స్థానం లేదు. నా చదువు, నా అభివృద్ధి, ఉద్యోగం ఇవే నన్ను ఆకర్షించేవి, నడిపించేది. ఎవరైనా ప్రేమా, దోమా అంటూ వెంటపడ్డారా? వాళ్ళను చంపేస్తాను”

రమ విరక్తిగా అంది.

“చావడానికి, చంపడానికి ఒకటే కారణం కదా! ఆలోచనా శూన్యం, అవగాహనా రాహిత్యం”?

హిమబిందు రమవైపు విస్మయంగా చూసింది.

రమ భారంగా మనసులో అనుకొంది. దిగేవరకూ ప్రేమలోతు తెలుసుకోరు. ప్రేమలో పడ్డాక అదే సర్వస్వం అంటారు. పెంచిన తల్లితండ్రులు, చదువు, భవిష్యత్తు ఇవేవీ వారిని ఆపవు? వాటన్నింటికంటే బలమైన విషయమా ప్రేమ?

ఎంతోమంది యువత దీని మాయలో పడి భవిష్యత్తు పాడు చేసుకొంటున్నారు? ఎందరు తమ తల్లితండ్రులకు, అన్నదమ్ములకు నైరాశ్యాన్ని మిగులుస్తున్నారు?

ఎందరు వాస్తవాన్ని జీర్ణించుకోక ఎండమావులవెంట పరుగులు పెడుతున్నారు? ఒకవ్యక్తి బలవన్మరణం పాలైతే ఆ వ్యక్తి కుటుంబంలో ఎంత శూన్యత? ఎంత నైరాశ్యం? ఎంత ఉదాసీనత? వాళ్లు చావలేక, బ్రతకలేక జీవచ్ఛవాల్లాగ కాలం దొర్లిస్తారు. అంతేకదా? ఇవన్నీ ఆలోచిస్తే మనిషి ‘ప్రేమ’ వైపు అడుగు వేయడేమో?

రమ ఆలోచనలు అలా సాగుతున్నాయి. హిమబిందు ఆలోచనలు వేరుగా ఉన్నాయి.

‘ప్రేమ’ గొప్పదా? అది ‘జీవితం’ కంటే గొప్పదా? తల్లిదండ్రుల ప్రేమ కంటే గొప్పదా? విద్యాకర్షణ కంటే గొప్ప ఆకర్షణా ప్రేమ? ఒక విధంగా చూస్తే స్త్రీ పురుషుల పరస్పర అవసరాన్ని ప్రేమగా తీసుకొంటున్నారా? ఎలాగ ఆలోచిస్తున్నారు? ఎందుకలాగ పరుగులు తీస్తున్నారు?

ఎప్పుడూ తమ ఆలోచనలు దానివైపు వెళ్లలేదు ‘స్నేహ మాధుర్యం’లో మనసులు పరవశిస్తున్నాయి. చదువు, స్నేహం, కుటుంబం వీటిని దాటి ఈ వేళ పద్మ వలన ఈ కొత్త కోణం వైపు తమ ఆలోచనలు వెళ్లవలసి వచ్చింది. ఇంత విషాదకర పరిస్థితికి తమలో ఒక భాగం తెగిపోయినట్లు బాధగా ఉంది.




**రా**ఘవరావుని స్నేహితుడు భార్గవ ఆనందంతో కౌగిలించుకొన్నాడు. రానన్నా వినకుండా బలవంతంగా ఇంటికి తీసికెళ్లాడు.

“ఒరేయి నువ్విలాగ పనిమీద రాజమండ్రి రావడం నాకు చాలా ఆనందంగా ఉంది. ఎన్నాళ్లకి కలిశాంరా” అంటూ చిన్ననాటి హైస్కూల్ చదువు రోజులన్నీ నెమరు వేశాడు.

రాఘవరావుకి కూడా సంతోషమన్పించింది.

ఇద్దరూ టిఫిన్ తిని లోకాభిరామాయణంలో పడ్డారు. మాటలలో రమకి మంచి సంబంధాలుంటే చెప్పమన్నాడు.

భార్గవ ఏమీ కడుపులో దాచుకోడు. వెంటనే గుంటూరులో ఉన్న తన స్నేహితుడి కొడుకు గురించి చెప్పాడు. "ధర్మారావు చాలా మంచివాడు. మేమిద్దరం కలిసి డిగ్రీ చదువుకున్నాం. మాయామర్మం లేని మనిషి. ఒక కూతురు. ఇద్దరు కొడుకులు. పెద్దవాడు స్టేట్స్‌లో డాక్టర్‌గా ఉన్నాడు. అమ్మాయికి పెళ్లయింది. చివరివాడికి పెళ్లవలేదు. కంప్యూటర్స్ చదివాడు. బెంగుళూరులో పని చేస్తున్నాడు. మంచి సంబంధం"

రాఘవరావు ఆలోచనలో పడ్డాడు. సంబంధం వివరాలు వింటే మంచిదిగానే ఉంది.

"వరుడిని నువ్వు చూశావా?" ఆయన అడిగారు.

"అబ్బే. లేదు. వినడమే. ఆ అబ్బాయిని నేను కలవడం జరగలేదు. ఈ విషయంలో నాకు ఇంట్రస్టు ఒకటే. ధర్మారావు గుమస్తా ఉద్యోగం చేసి, పిల్లల్ని ఇంత అభివృద్ధిలోకి తెచ్చాడు. జీతం రాళ్లు తప్ప పైసంపాదన ఇష్టం ఉండదు. అతడిలోని నీతి, కుటుంబం పట్ల అంకిత భావం నన్ను ఆకర్షించాయి"

భోజనాలు అయ్యాక రాఘవరావు బయలుదేరి వెళుతుంటే భార్గవ ధర్మారావు వాళ్లకి ఫోను చేసి సంబంధం వివరాలు సేకరిస్తానని మాట ఇచ్చాడు.

రాఘవరావు దారి పొడవునా ఆలోచనలో పడ్డాడు. బయటి సంబంధం చేసుకోవాలంటే జంకుగానే ఉంది. ఒక్క పిల్ల. తామూ ఆ పిల్లను విడిచి ఉండలేదు. తమ రాకపోకలకి ఇబ్బంది లేని సంబంధం చూసుకోవాలి.

## కొత్తగాలి... 

**రాత్రి ఆకాశం**
**పెళ్లి పందిరి**
**తారలు, చంద్రుడు**
**వెలుగుల సందడి!**

– పాయనం సుబ్రహ్మణ్య మహర్షి,
గాయత్రి నగర్, నెల్లూరు

చదువు, అందం ఉన్న వరుడిని తేవాలని తన పట్టుదల. బంధువుల సంబంధం చేద్దామని భార్య గొడవ. వారైతే బిడ్డ రాకపోకలకి ఇబ్బంది కలగదని ఆమె ఆలోచన.

రాఘవరావుకి అన్పించింది లోకంలో అందరూ తమ బిడ్డలకు ఎలా పెళ్లిళ్లు చేస్తున్నారా అని. తమలాగ ఎవ్వరూ వెయ్యి ఆలోచనలు చెయ్యరేమో అని.

డబ్బు విషయంలో తమకు లోటులేదు. తన ఆస్తి తన బిడ్డదే కదా! జీవితంలో ఆమె సంతోషంగా ఉంటే చాలు.

★ ★ ★

పరీక్షలు దగ్గరకి వచ్చాయని ప్రిపరేషన్ హాలిడేస్ ఇచ్చారు. రమ, హిమ, మిగిలిన వారు పోటా పోటీగా చదువుతున్నారు.

హిమబిందు ఎక్కువగా రమ ఇంట్లోనే ఉండి చదువుకుంటోంది. జానకికి హిమంటే ఎంతో ప్రేమ.

రాఘవరావుగారు ఇంటికి రావడమే రమ గురించి అడిగారు.

"పిల్లలిద్దరూ కలిసి చదువుకున్నారు ఇంతవరకూ. మేడమీదికి వెళ్లారేమో?" అంటూ ఆవిడ వాళ్లను పిలిచింది.

కూతురు రాగానే ఆయన తాను తెచ్చిన స్వీట్లు అందించారు. కూతురు అప్పుడే పెళ్లయి అత్తవారింటికి వెళ్లిపోతున్నట్లు ఆయనకి అన్పిస్తోంది.

ఆయన భార్యతో సంబంధం వివరాలు చెప్పారు.







"కుటుంబం బావుంది. పిల్ల, పిల్లవాడు ఓ.కే. అనుకుంటే మిగతా విషయాలదే ముంది? అబ్బాయి బావుంటాడట. సాఫ్ట్‌వేర్ ఇంజనీర్."

ఆయన ఉత్సాహంగా చెప్పారు. హిమబిందు "బాపురే! రమా! నీ పెళ్లి గురించా ఈ ప్రయత్నాలు?" అంది.

రమ మొహం కాంతి తగ్గింది.

"నాన్నగారూ! పరీక్షలు హడావుడిలో ఈ గొడవ ఎందుకు?" అని అడిగింది.

ఆయన హాయిగా నవ్వారు.

"అనుకోగానే పెళ్లి అయిపోతుందా తల్లీ? వాళ్ల వివరాలే పూర్తిగా రాలేదు. మనం ఫోటో, జాతకం పంపాలి. అటు నుండి రావాలి. జాతకాలు కలవాలి. ఇద్దరూ నచ్చుకోవాలి. అప్పుడు కదా పెళ్లి విషయం ఆలోచించాలి. ఇంత ప్రోసెస్ ఉంటే కంగారు ఎందుకమ్మా? నిశ్చింతగా పరీక్షలు వ్రాయి" అనునయంగా చెప్పి జానకితో కల్సి లోనికి వెళ్లారు.

ఎప్పుడూ లేనిది హిమబిందు మౌనం వహించింది. రమ హిమ చెయ్యి తన చేతిలోకి తీసుకుని తనలో తాను అనుకొన్నట్లు అంది. "ఉద్యోగం చెయ్యాలని, నా కాళ్లపై నేను నిలబడాలని ఉంది. కానీ అమ్మ, నాన్న వద్దంటారు. వాళ్లకి నా పెళ్లి చూడాలని కోరిక, ఒక్క పిల్లగా పుట్టడం కూడా దురదృష్టమేమో?"

హిమ చప్పున వచ్చి రమ నోరు మూసింది. "అలా అనవద్దు. నేను భరించలేను. మీ నాన్నగారితో మనం మాట్లాడదాం. కనీసం ఒక ఏడాదైనా కలిసి ఉద్యోగం చేద్దాం. ప్రతీ దానికి భర్త మీద ఆధారపడటం మనకి నచ్చదు."

నాలుగు రోజులు గడిచాయో లేదో భార్గవ నుండి ఫోటో, జాతకం పంపమని ఫోను. వాళ్లనుండి తీసుకొన్న ఫోటో కొరియర్‌లో పంపానని చెప్పాడు.

జానకి అంతా వింటూనే ఉంది. అవతలి కూతురి గదిలో లైటు. పిల్లలు పరీక్షలు గొడవలో మునిగి తేలుతున్నారు.

"అమ్మాయి పరీక్షలు అవకుండా పెళ్లి చూపులు వద్దు. అది బాధపడితే నేను చూడలేను" ఆవిడ ధైర్యంగా చెప్పింది.

ఆ మాటే భార్గవతో అంటే అతడు నవ్వాడు. "పరీక్షలు అయ్యాకే పెళ్లిచూపులకి వస్తారు. ముందు ఫోటో, జాతకం పంపండి" అన్నాడు.

అలాగే చివరికి ఇవతల పరీక్షలు, అవతల ఫోటోలు, జాతకాలు పంపడాలు తీసుకోవడాలు జరిగాయి.

పరీక్షలు అవడమేమిటి పిల్లలందరూ పొలోమంటూ సినిమాకి పారిపోయారు.

అందరిలో అనుకొన్నట్లుగా నిశ్చింతగా పరీక్షలు వ్రాశారన్న ఆనందం. మళ్లీ అందరూ కలుస్తారో లేదోనన్న బెంగ. భవిష్యత్తు గురించి ఆందోళన. నవ్వులతో, కబుర్లతో సందడిగా గడిపేశారు.

ఇంటికి తిరిగి వస్తుంటే హిమ అంది. "రమా! నేను హైదరాబాద్ వెళ్లి కొన్ని కంప్యూటర్ కోర్సులు నేర్చుకుందామనుకొంటున్నాను. రిజల్ట్సు రాగానే జాబ్‌లో చేరవచ్చు"

రమ మౌనం వహించింది. ఇంతవరకూ ఇద్దరూ కలిసి నడిచారు. ఇప్పుడు దారులు వేరవుతాయా?

రమ నిశ్శబ్దంతో హిమకి నీరసం ఆవహించింది. "మీ వాళ్లతో మనం మాట్లాడుదాం. వాళ్లు ఎప్పుడు రమ్మంటే అప్పుడు వస్తామని చెపుదాం. నువ్వుకూడా వస్తే ఇద్దరం గది అద్దెకు తీసికొని కోర్సులు చేద్దాం" అంది హిమ.

ఆమె మాటలతో రమలో ధైర్యం వచ్చింది. ఔను, గోళ్లు గిల్లుకుని కూర్చునే బదులు వెళితే సరి అనుకుంది.

★ ★ ★

ప్రభాత్ పెళ్ళికూతురి ఫోటో చూస్తున్నాడు. ఎంత అద్భుతంగా ఉంది? ఎంత సరళంగా, సుకుమారంగా కన్పిస్తోంది. ఎవరో దేవకన్య తనకోసం దివినుండి భువికి దిగివచ్చిన భావన కలుగుతోంది.

ఎలాగో మనసు మరల్చుకుని చూశాడు తండ్రి వ్రాసిన ఉత్తరంవైపు. "వీళ్ళు మనకి స్నేహితులు. ఒకే అమ్మాయని గారాబంగా పెంచారు. ఈ సంబంధం చేసుకొంటే ఒక మంచి కుటుంబానికి దగ్గరవుతాం. వాళ్ళు అమ్మాయిని చూడకుండా ఉండలేరు. వాళ్ళతో సన్నిహితంగా బ్రతుకగలిగితేనే ఈ సంబంధం చూస్తాను. అటువంటి అమ్మాయిని చేసుకోవడానికి కూడా పెట్టిపుట్టాలేమో? "





## కొత్తగాలి...

**మనీ కోసమేనా**
**రోజంతా ఆరాటం**
**మానవత్వంకోసం**
**మరెప్పుడు**

– పెరుకరాజు, నర్సింగాపూర్, కరీంనగర్

తండ్రికి ఆ అమ్మాయి ఎంతో అభిమాన పాత్రురాలు. ప్రభాత్‌కి ఆత్రంగా ఉంది. మరెవరైనా ఈ సంబంధం తన్నుకునిపో తారేమో?

"అస్తమానూ పెళ్ళి చూపులకి రమ్మంటూ నా ప్రాణం తీయవద్దు. నాకు వర్క్ ఎక్కువగా ఉంది" ఈ మాటలు తను తల్లితో తండ్రి వింటూండగా చెప్పాడు.

పదిరోజుల క్రితం తను ఏమన్నా కలగ న్నాడా? తండ్రి పుట్టినరోజని వెళితే, ఇద్దరూ కలిసి నాటకమాడి పెళ్ళిచూపులకి తీసికెళ్ళారు. ఇంకా రెండు సంబంధాలు న్నాయంటే తను అలాగ మాట్లాడాడు.

ఇప్పుడు రమ ఫోటో చూశాక అమాంతం పెళ్ళి చేసుకోవాలనుంది. వెంటనే ఫోనులో తల్లితో మాట్లాడాడు.

"అమ్మా మీరు ఎప్పుడు రమ్మంటే అప్పుడు వస్తాను. నాన్నగారి మాటకి విలువ ఇవ్వాలికదా? " మహా వినయంగా తల్లితో చెప్పాడు.

"అది కాదురా! సంబంధం మంచిదే. కాని బావమరదులు లేరు. బావమరిది బాగు కోరతాడంటారు. రేపు ముద్దు ముచ్చటలు చేసేది అతనే కదా! పెద్దవాళ్ళ బాధ్యత కూడా నీ మీద ఉండవచ్చు. మీ నాన్నగారు నా మాట వినడం లేదు. మరొక మంచి సంబంధం వస్తుంది. దీన్ని వదిలేద్దాం. ఏమంటావు? " ఆవిడ తన మనసులో మాట చెప్పింది.

అందం, చదువు, ఆస్తికన్నా మిగిలిన విషయాలు ముఖ్యమని ఆవిడ ఉద్దేశ్యం. కానీ ప్రభాత్ ఆమె ఆశని వమ్ము చేశాడు.

"ఏమిటమ్మా! నువ్వు ఏ యుగంలో నుండి మాట్లాడుతున్నావు? కాలంతో పాటు మనం కూడా మారాలమ్మా! చాదస్తాలు వదిలి ముందడుగు వేయాలి" ఉత్సాహంగా చెప్పాడు.

ధర్మారావు కొడుకు అభిప్రాయం గ్రహించి, అమ్మాయిని చూసుకుందుకు వస్తున్నామని ఫోను చేశాడు.

పెళ్ళివారు తనను చూడటానికి వస్తు న్నారని తెలియగానే రమ మనసు ఉదాసీ నమై పోయింది.

హిమ కంప్యూటర్ కోర్సులంటూ హైద రాబాద్ బయలుదేరుతోంది. పెళ్ళిచూపు లయ్యే వరకూ హిమ ఉంటే బావుండున నిపించింది.

రమకి ఎలాగ హిమను ఆపాలో తెలి యలేదు. హిమ ఆలోచన వేరు. రమకి పెళ్ళి సంబంధం చూడటమే ఇష్టంలేదు తనకి.

"రమా! నువ్వు సుఖంగా, సంతోషంగా ఉండాలి. అతడు నీకు బాగా నచ్చితేనే చేసుకొంటానని చెప్పు. లేనప్పుడు వద్దని చెప్పు. దిగులు ఎందుకు? " అనునయంగా అంది హిమ.

రమ కళ్ళు పైకెత్తింది. ఆ కళ్ళు వర్షించ డానికి సిద్ధంగా ఉన్నాయి.

"నువ్వు పెళ్ళి చూపులు అయ్యేవరకూ వెళ్ళవద్దు. నిర్ణయం తీసుకోవడం నాకు సరిగ్గా తెలియదు. నువ్వుంటే ధైర్యం. దయచేసి నీ ప్రయాణం వాయిదా వెయ్యి" అర్థించింది.

హిమ రమ మొహం చూస్తూ ఉండిపో యింది. స్థిరంగా, తన అభిప్రాయం చెప్పింది, "నువ్వు మీ అమ్మగారు, నాన్న గారు చెప్పినట్లు నడుచుకొంటావు. ఇప్ప

టికే నా అభిప్రాయాలు నీ మీద రుద్దుతు న్నానేమోనని అనుమానం నాకు. అఫ్ కోర్సు నా అభిప్రాయాలు సరైనవని, ఇప్పటి యువతులందరికీ మంచివని నా నమ్మకం. అయితే ఎవరూ రిస్క్ తీసికోవ డానికి ఇష్టపడరు. తల్లిదండ్రుల అభిప్రా యాలకు విలువనిచ్చి వారు నిర్ణయించిన మార్గంలో నడిస్తే, జీవితంలో ఎదురయ్యే సంఘటనలకి వాళ్ళ సహకారం, సాను భూతి ఉంటాయని మనవాళ్ళ ఉద్దేశ్యం. నామటుకు నాకిష్టంలేని పని ఏదీ చెయ్యా లన్పించదు"

రమ నిట్టూర్చింది. మొత్తానికి హిమ ప్రయాణం వాయిదా పడింది.

పెళ్ళివారు రానూ వచ్చారు. వెళ్ళనూ వెళ్ళారు. మగపెళ్ళి వారమన్న భేషజం ధర్మారావులో కన్పించనందుకు రాఘవ రావు సంతోషించాడు. ప్రభాత్ తల్లి బింకంగా ఉంది. అయినా అమ్మాయి ఆవి డకి బాగా నచ్చింది.

ధర్మారావు మనస్ఫూర్తిగా అనుకొన్నాడు "పిల్లను చూస్తే కడుపు నిండిపోతోంది. కుటుంబం, సాంప్రదాయం, మర్యాద, మన్నన, విద్య, ఐశ్వర్యం అన్నీ పోటీ పడు తున్నట్లున్నాయి" ఈ సంబంధానికి న్యాయంగా తాము సరితూగరనుకొన్నాడు. చిదిమి పిల్లను దీపం పెట్టవచ్చుననుకొ న్నాడు.

ప్రభాత్ తండ్రిని ఇవతలకు తీసికొని వచ్చి తమకు నచ్చిందని చెప్పమన్నాడు. అతడి తొందర అతడిది.

పెళ్ళి చూపుల్లో హిమను చూసి కూడా అతడి మతిపోయింది. రమను చూశాక రెప్పవేయడం కూడా మరచిపోయాడు.

"ఒక వయసు పిల్లలు. హిమను ఇంటికి పంపేద్దాం. పెద్దవాళ్ళం. మనమందరం ఉన్నాం కదా? " అన్నారు శాంత ఆనంద రావులు.

రాఘవరావు నవ్వుతూ ఇద్దరికీ బదులు చెప్పాడు "హిమ ఉండటం వలన నష్టం లేదు. ఒకవేళ వాళ్ళు హిమను ఇష్టపడ్డారా, ఆ పిల్లా నా రెండో కూతురని సంతో షంగా అంగీకరిస్తాను. నాకు మాత్రం తను, మీరు తప్ప ఎవరున్నారు? "

హిమ మనసు గగుర్పొడిచింది. తనపై ఎంత సదభిప్రాయం? ఎంత నమ్మకం? ఆయన చెప్పినట్లు తాను ఆయనకి రెండో కూతురే. వాళ్ళ కష్ట సుఖాలు తనవే. ఆ క్షణంలో ఆమె గట్టిగా నిర్ణయించుకుంది.

ప్రభాత్ అందగాడు. మంచి పొడగరి. విద్యావంతుడు. సంప్రదాయ కుటుంబం నుంచి వచ్చినవాడు.

ముప్పైవేలు జీతం. అందరి దృష్టిలో అది మంచి సంబంధమే.

రమ పెళ్ళిచూపుల నాటి సంఘటనలను గుర్తుతెచ్చుకొంటోంది. అబ్బాయి బాగు న్నాడు. ఏ అమ్మాయి మనసు అయినా చూరగొనేలాగున్నాడు. కానీ తన మనస్సు ఎందుకో భయపడుతోంది.

అతడు స్నేహంగానే ప్రవర్తించాడు. పిచ్చి ప్రశ్నలు వెయ్యలేదు. అలాగని మౌనంగా ఊరుకోలేదు. తనతో మాట్లాడా లనే తపన అతడిలో ఎక్కువగానే కనబ డింది.

హిమ ఏం చెపుతుంది? అతడు మాట్లా డిన మాటలు, పద్ధతి, చూసి అది ఎప్పుడో ఒక నిర్ణయానికి వచ్చి ఉంటుంది.

రమ తల్లిని కేకేసింది. "అమ్మా! నేను హిమ ఇంటికి వెళుతున్నాను"

జానకి వెళుతున్న కూతురివైపు చూసింది. ఉదయం నుండి హిమబిందు రాలేదు. పెళ్ళిసంబంధం విషయంలో ఫ్రెండ్ అభిప్రాయం అడగడానికి రమ వెళుతోందని ఆవిడ గ్రహించింది.

హిమ పుస్తకాల అలమరా సర్దుతోంది. రమని చూసి ఆనందంగా ఆహ్వానించింది.



రమ తానూ సాయం చేస్తానన్నా వినలేదు. పనిమనిషికి అప్పజెప్పి, ఇద్దరూ ప్రశాంతంగా డాబా ఎక్కారు.

హిమ మౌనంగా పరిసరాలు పరికించ సాగింది. దూరంగా కన్పిస్తున్న దేవాలయం, ధ్వజస్తంభం, చల్లటిగాలి, అటూ ఇటూ నడుస్తున్న వీధిలోని జనం.

రమ హిమను చూసింది. చేతులు కట్టుకుని మౌనంగా పరిసరాలు గమనిస్తున్న హిమ కొత్తవ్యక్తిలాగ అన్పించింది.

రమ తనని తానే నిలువరించుకుంది. తన మనసులోని విషయం క్రొత్తది. ఆ భావన హిమకు కూడా ఆపాదింపబడుతోందా?

రమ స్నేహంగా, ఆత్మీయంగా హిమ భుజం మీద చెయ్యి వేసింది. ఆ స్పర్శకే హిమబిందు ఉలిక్కిపడింది.

ఆ ఉలికిపాటును రమ గమనించింది.

మామూలుగానే నవ్వుతూ అడిగింది, "నాన్నగారు రాత్రో రేపో నా అభిప్రాయం అడుగుతారు. మొదట అతడి గురించి నీ అభిప్రాయం చెప్పు"

హిమ నవ్వుతూ విషయం రమ నుండి రాబట్టదలచింది. "పెళ్ళిచూపులు నీకు. వరుడు ఏకాంతంలో మాట్లాడింది నీతో. మరి నీ అభిప్రాయం తెలియచేయకుండా నాది అడగడం వేళాకోళమా? "

రమ నవ్వలేదు. "నావైపు నుండి ఫ్రెండువైనా, అక్కవైనా, చెల్లివైనా నువ్వే. ఒంటరిగా పుట్టాననే భావన నీ వల్ల నా నుండి దూరమైంది. మరి ఇప్పుడు చెప్పు. నీ అభిప్రాయానికి విలువ ఉందా? లేదా? "

హిమకి గుండె గొంతుకలోకి వచ్చింది. రమ చేతిని స్నేహంగా పట్టుకుంది.

"రమా! మొదట ఈ విషయం చెప్పు. అతడు నీతో ఏంకాంతంగా ఏం మాట్లాడాడు? "

రమ కొద్ది క్షణాలు మౌనం వహించింది. నిన్న జరిగింది ఆమె కళ్లముందు మెదిలింది. "మన వివాహం జరుగుతుందంటారా? " అని అడిగాడు. నేను అప్పుడు "పెద్దలు ఆమోదిస్తే జరుగుతుందన్నాను".

అతడు మౌనం వహించాడు కొద్ది నిముషాలు. అతడి మొహం కొంత కళావిహీనమైంది.

"కేవలం పెద్దల ఆలోచనలేనా? మన ఆలోచన అవసరం లేదా? నా మీద ఎటువంటి అభిప్రాయంవుందో చెప్పగలరా? "

అతడు అలాగ సూటిగా అడుగుతాడని అనుకోలేదు. అయినా స్థిరంగా చెప్పాను, "నా తల్లిదండ్రుల నిర్ణయమే నాది. తల్లిదండ్రుల తర్వాత స్థానం హిమబిందుది. మా ఇద్దరి శరీరాలు వేరు కాని మనసు ఒకటే. మీ గురించి ఎవరికైనా సదాభిప్రాయమే ఉంటుంది"

"మిమ్మల్ని పెళ్ళి చేసికోవాలని నా మనసు తహతహలాడుతోంది. మీకు అలాగ అన్పించడం లేదా? రమా! సమాధానం చెప్పండి" ప్రభాత్ అభ్యర్థించాడు.

"నాకు నా తల్లిదండ్రులను గౌరవించే వ్యక్తి కావాలి. నాకు ప్రేమకంటే, ఆకర్షణ కంటే మంచితనం మీద ఆరాధన"

ప్రభాత్ తేలికపడిన మనసుతో నవ్వాడు, "మా వాళ్ళందరూ నేను మంచి వాడిననే అంటారు"

రమ తన మాటలు పెంచింది. "మీరు ఏమీ అనుకోకపోతే ఒక్క ప్రశ్న"

"అయ్యో నేను మిమ్మల్ని అడగడం లేదా? మీరూ అడగండి. నాది చాలా విశాలమైన దృక్పథం"

"నా తల్లిదండ్రులకి నేను ఒక్కదాన్నే అమ్మాయిని. వాళ్ళ ఆశలు కోరికలు, అన్నీ నేనే"

ప్రభాత్ వంత పాడాడు, "ఔనౌను, మా అంకుల్ చెప్పారు, మిమ్మల్ని చాలా గారా

బంగా పెంచారని"

రమ తటపటాయించినా చెప్పేసింది, "అమ్మాయి ఒక్కర్తే అయినపుడు తల్లిదం డ్రుల బాధ్యత ఆమెదే కదా! మీరు ఈ విషయానికి ఏకీభవిస్తారా? వ్యతిరేకిస్తారా? "

ప్రభాత్‌కి ఆమె చెప్పిన విషయం బాగానే అర్థమైంది. కానీ బయటపడలేదు.

"మన భారతదేశంలో తల్లిదండ్రులు అమ్మాయిల మీద బాధ్యత మోపరు. ఒక రింటికిచ్చిన పిల్ల గురించి ఆశపడరు. అఫ్ కోర్సు బాధ్యత విషయంలో మన మనస్తత్వాన్ని బట్టి ఉంటుంది"

★ ★ ★

రమ చిన్నగా నిట్టూర్చింది. "అతడు తన మనసును పూర్తిగా బహిర్గత పరచలేదు. అలాగని సంకుచితంగా మాట్లాడలేదు. అతడి వ్యక్తిత్వం నా అంచనాకు అందడం లేదు. సినిమాల గురించి, జీవితం గురించి, భార్య బాధ్యత గురించి ఏవేవో అడిగాడు. నాకు తెలిసింది చెప్పాననుకో!" అంది.

హిమ సాలోచనగా వింటోంది. అతడు తెలివైనవాడు. దేనికీ దొరక్కుండా సంభాషణ నడిపించాడు.

"హిమా! నువ్వు ఎలాగ అనుకొంటున్నావో చెప్పు"

హిమ రమవైపు చూసింది, "ఒక అర గంట పెళ్ళి చూపులతో లేదా ఒక గంట పెళ్ళి చూపులతో వధూవరులు ఒకరి గురించి ఒకరు ఏం తెలుసుకోగలుగుతారు చెప్పు? "

హిమ ప్రశ్నకి రమ అదిరిపడింది.

"మరి... పెళ్ళి చూపులు, మధ్యవర్తి తప్ప మనకి వరుడి గురించి ఎలా తెలుస్తుంది? "

హిమ అర్థవంతంగా నవ్వింది.

"అమ్మాయి అబ్బాయి గురించి క్షుణ్ణంగా తెలుసుకోవాలి. తనంతట తాను బెస్ట్.

## కొత్తగాలి...

**యుక్త వయసు**
**వలపు తలపులు-**
**పెద్దలు వేస్తారు**
**హద్దుల తలుపులు!**

– కె.లక్ష్మీ కాంతమ్మ, నెల్లూరు

లేదా తనవాళ్ళ ద్వారా, ఇంకా అయితే డిటెక్టివ్ ఏజెన్సీ ద్వారా. అబ్బాయి ఫ్రెండ్స్ ఎవరూ నిజం చెప్పరు. అందుకు మనమే రంగంలోకి దిగి పరీక్షించాలి."

రమ చేతులు జోడించింది.

"నువ్వయితే ధైర్యస్థురాలివి. నీ విషయంలో సాధ్యమే ఇవన్నీ! నాలాంటి వాళ్ళకి నీ సలహాయే చాలు".

హిమకు సంతోషమన్పించింది. అలా దారిలోకి రా! అన్నట్లు చూసింది.

"నన్ను అబ్బాయి ఉద్యోగం చేస్తున్న బెంగళూర్ వెళ్ళి అన్ని విషయాలూ తెలిసికొని రమ్మంటావా? " అని అడిగింది.

"అప్పుడు గాని నాన్నగారు నన్ను ఇంట్లో నుండి బయటికి నెట్టరు", రమ స్థిరంగా అన్న తీరుకి హిమ నవ్వింది.

"ముందు అబ్బాయి గురించి నీకు ఏమన్పించిందో చెప్పు తల్లీ!" బతిమాలింది రమ.

హిమ సూటిగా చూసింది, "రమా! అతడి కళ్ళల్లో అందం పట్ల ఆరాధన నాకు కన్పించలేదు. అతడి కళ్ళల్లో ఆకలి కన్పించింది. అతడు నిన్ను చూస్తుంటే నేను పరిశీలనగానే చూశాను. అలాగే స్త్రీ పట్ల గౌరవం కన్పించలేదు.

అతడు చెప్పిన సమాధానాలు విశాలమైన మనసుని, దృక్పథాన్ని చాటలేదు. ఏదో ఒకటి చెప్పాలని వెంటనే చెప్పినా, అతడి మనస్తత్వం కొద్దిగా కన్పిస్తోంది.

తల్లిదండ్రుల అభిప్రాయం అడగలేదు.

## కొత్తగాలి...

**సెల్‌ఫోన్**
**చేతిలో ఉంటే**
**సగం సంసారం**
**రోడ్డుమీదే!**

– మోకా రత్నరాజు, విశాఖ

తనదే చెప్పి, మీకు చెప్పమన్నాడు. ప్రక్క గది వద్దనున్న నాకు వాళ్ళమాటలు విన్పించాయి. డోర్ కర్టెన్ ఉంది కనుక వాళ్ళు నన్ను గుర్తించలేదు. ఒకవేళ గుర్తించినా ఏ మంచినీళ్ళో ఇవ్వడానికి వచ్చానంటాను.

నన్ను ఇదే మొదటిసారి చూశాడు కదా! ఆ కుళ్ళు జోకులు ఏమిటి? "

రమకి అప్పటి విషయం గుర్తు వచ్చింది అతడితో ఫ్రెండ్ వచ్చారు. ప్రభాత్ నవ్వుతూ అన్నాడు, "మా ఫ్రెండ్ బి.టెక్ చదివాడు. నా దగ్గరే పని చేస్తున్నాడు- ఈ ఏడాది వీడికి కూడా పెళ్ళి చేద్దామనుకొంటున్నారు. సినిమాల్లో చూశారా పెళ్ళికొడుకు ఫ్రెండ్, పెళ్ళి కూతురి ఫ్రెండ్ ప్రేమించుకొంటారు. అలాగ మీరిద్దరూ ఎడ్వాన్స్ అయితే నాకు అభ్యంతరం లేదు."

హిమ గురించి అతడు అలా చనువు తీసికొని మాట్లాడతాడని రమ ఊహించలేదు.

ఆనందరావు నవ్వుతూ అన్నారు, "బాబూ! ముందు మీరు తెమలండి. మా అమ్మాయి జాబ్ చేస్తుంది. ఇప్పుడు ఆ విషయం అప్రస్తుతం".

హిమ ఎగతాళిగా నవ్వి, అంది. "వచ్చిన పని మరిచిపోయి, లేని బాధ్యత భుజాల మీద వేసికొనే వాళ్ళంటే నాకు విసుగు. మీరు పెళ్ళిళ్ళ పేరయ్య కాదు కదా? "

ప్రభాత్ చిన్న బుచ్చుకొంటాడనుకొంది. అతడి ఫ్రెండ్ మాత్రం వారించాడు.

"ఊరుకోరా! ఏది పడితే అది మాట్లాడితే ఎలా? " అన్నాడు.

ప్రభాత్‌కి హిమతో ఏదో ఒక రకంగా మాట్లాడాలన్పించింది.

"బావుంది. పెళ్ళిళ్ళ పేరయ్యలే సంబంధాలు చెపుతారా? మనవాళ్ళనుకొంటే చెపుతాం. అయినా మీ ఫ్రెండ్, మీరు ఒకరినే కట్టుకోవాలనే శపథాలు ఏమైనా చేసుకొన్నారా? అందరూ మీరు విడిపోని జంట అంటున్నారని అడుగుతున్నాను" హిమను నవ్వుతూ చూస్తూ అన్నాడు. అతని కళ్ళల్లో కొంటెతనం వద్దన్నా కన్పిస్తోంది.

హిమ పెంకిగా అంది. "మా రమ ఏ అడ్డ గాడిదనైనా భరిస్తుంది భర్తగా! నాకంత పేషెన్స్ లేదు."

పెళ్ళివారి మొహాలు మాడిపోయాయి. ఆనందరావు గారు నవ్వుతూ మాట మార్చకపోతే, ప్రభాత్ పని అయ్యేది. దానితో హిమ జోలికి మరి రాలేదు.

కొందరు అంతే. ఆడపిల్లలు కనబడే సరికి ఒళ్ళు మరిచిపోతారు. ఔచిత్యం మరిచిపోతారు. వాళ్ళని అల్లరి చేయబోయి, తామే అల్లరిపాలవుతారు.

"రమా! అతడు ఏదో అన్నాడు. నేనూ కోపం పట్టలేక అన్నాను. కాలేజ్‌లో ప్రవర్తించినట్లు ప్రవర్తించాను. తర్వాత బాధపడ్డాను."

రమ హిమను వారించింది. "ఇందులో నీ తప్పేం ఉంది? మాటలు అనవసరంగా జారారు. తప్పుగా మాట్లాడితే ఎవరు ఊరుకొంటారు? "

హిమ గుండె భారం దిగింది. "అమ్మయ్య! నీకు కోపం రాలేదు కదా! నేను నాన్నగారు బాధపడ్డారేమోనని సిగ్గుపడ్డాను" నిజాయితీగా అంది.

రమ తేలిగ్గా అంది "నాన్నగారు అలాంటివి ఇష్టపడరు."

ఇద్దరూ సంబంధం మంచి చెడ్డలు బేరీజు వేసికొన్నారు.

రమ చివరగా అంది "నాన్నగారు ఇప్పు డిప్పుడే కదా పెళ్ళి సంబంధాలు చూస్తు న్నారు. మరొకటి చూడవచ్చునంటాను." హిమకు అలాగే అన్పించింది.

ఏమంత చెప్పులు అరిగిపోయేలాగ తిరి గారు కనుక బాధపడాలి. ఇంతకన్నా మంచి సంబంధం వస్తుందేమో?




**హి**మకి మంచి కంపెనీ నుండి జాబ్ ఆఫర్ వచ్చింది. ఎంసిఎ 80 శాతం మార్కులతో పాసైనందుకు అభినందనలు కూడా పంపారు. రమ, మిగిలిన ఫ్రెండ్స్ కూడా మంచి మార్కులతో పాసయ్యారు. ఇంక వారి సంబరానికి అంతులేదు. రమకీ ఓ ఆఫర్ వచ్చినా తల్లిదండ్రులు వద్ద న్నారు.

హిమ హైదరాబాద్ వెళ్ళిపోతుంటే రమ, ఫ్రెండ్స్ ఏడ్చేశారు. హిమకీ బాధ గానే ఉంది. ఏడుపు వచ్చేసింది. కానీ వెళ్ళవలసిన గమ్యం ఆకర్షిస్తోంది.

రమను హత్తుకునిపోయి అంది, "ఈ రోజుల్లో దూరమన్న మాటలేదు. ఫోన్లు, ఇంటర్‌నెట్‌లు అన్ని మనల్ని క్షణాలలో కలుపుతాయి. ఎప్పుడు కావాలంటే అప్పుడు వచ్చేస్తా! బెంగవద్దు."

హిమ వెళ్ళిపోయాక రమకి తిండి కూడా తినాలన్పించలేదు. ఫోను రింగ యితే హిమ ఏమో అనుకొని తీసింది. కాదు ప్రభాత్...

"ప్లీజ్ ఫోను కట్ చేయకండి. నన్ను పెళ్ళి చేసికోవడం మీకు ఇష్టం లేదా?" సూటిగా అడిగాడతను.

రమకి ఏం చెప్పాలో తోచలేదు. అతడు అలాగ ఫోనుచేసి, మాట్లాడతాడని అనుకో లేదు.

"మాకు మీరు నచ్చారని అక్కడే చెప్పాం. మీ నాన్నగారు భార్గవరావు అంకుల్‌తో ఇప్పట్లో పెళ్ళిచేసే ఉద్దేశ్యం మార్చుకొన్నామని అన్నారట. ఎందుకు ఇలాంటి నిర్ణయం తీసికొన్నారు. మీ ఫొటో చూసి, ఎంతో మనసుపడ్డాను. దయచేసి నన్ను నిరాశ పరచవద్దు."

రమకి అంతా అయోమయంగా ఉంది. తండ్రి, తల్లి తనతో మాట్లాడినపుడు ఈ సంబంధం వద్దని, తన మనసు పెళ్ళికి సిద్ధపడటంలేదని తను చెప్పింది.

తల్లికి కూడా ఈ సంబంధం ఎడల ఇష్టం కలగలేదు. పెళ్ళి చూపులకి వచ్చిన వాళ్ళు, పెళ్ళి కుదిరినట్లే చనువు తీసికో వడం ఆవిడకి అసలు నచ్చలేదు.

పిల్ల నిన్న, మొన్నటి వరకు చదువంటూ కష్టపడింది. కొన్నాళ్ళు విశ్రాంతి తీసికొ న్నాక, సంబంధం చూస్తే సరి. రాఘవ రావు భార్య, కూతురు చెప్పిన విషయం అర్థం చేసుకొన్నారు. అందుకే ఇప్పట్లో పెళ్ళి చేసే ఉద్దేశ్యం లేదని చెప్పారు.

ప్రభాత్ తండ్రి, భార్గవ, రాఘవరావుని తమ సంబంధం వదలవద్దని ఫోన్లు చేయ సాగారు. "అబ్బాయికి, మాకు మీ అమ్మాయి ఎంతో నచ్చింది. మన కుటుం బాలు ముందుకు కలిసి నడిస్తే బావుం టుంది." అరిగి పోయిన గ్రామఫోను రికా ర్డులాగ వాళ్ళు ఇదే చెప్పసాగారు.

ఏనాడూ రాఘవరావు ఇలాంటి పరిస్థితి







ఎదుర్కోలేదు. తాము వాళ్ళను ప్రాధేయపడాలి. కానీ వాళ్ళే తమ వెంటపడుతున్నారు.

రమకి వరుసగా అతడి నుండి ఫోన్లు. "మనమిద్దరం కలిసి బ్రతికే రోజుల కోసం నేను ఎంతగా ఎదురుచూస్తున్నానో మీకు తెలియదు. నా మనసు నా దగ్గర లేదు. అది మీ దగ్గరే ఉంది. మీ మనసుతో మమేకం అయింది. దయచేసి మీ అభిప్రాయం మీ నాన్నగారికి చెప్పండి" ఫోన్ల లోని సారాంశమిదే.

రమ హిమకి ఫోను చేసి విషయం వివరించింది. "ప్రభాత్ భల్లూకపట్టు వాడై ఉంటాడు. అతడికి నిజంగా అంతప్రేమ నీమీద ఉంటే మంచిదే. కానీ ఊసరవెల్లిలా రంగులు మారిస్తే కష్టం. కొద్దికాలం వాయిదా వేసి, అతడి గురించి తెలుసుకోండి" అని సలహా ఇచ్చింది.

సగం రాత్రి వేళ దాహం వేసి రమ లేచింది. మంచినీళ్ళు త్రాగి పడుకోబోతున్న ఆమెకి తల్లిదండ్రుల మాటలు విన్పించాయి "అమ్మాయి విషయంలో ఏం చేయడానికీ పాలుపోవడం లేదు. అబ్బాయి, తల్లిదండ్రులు ఫోన్లమీద ఫోన్లు సంబంధం విషయం మరోమారు ఆలోచించమని. ఏం చేద్దాం? " అడిగారు రాఘవరావు.

"వీళ్లు ఈ విషయంలోనే ఇలాగున్నారంటే మిగిలిన విషయాల్లోనూ ఇదే మంకుపట్టుగా ప్రవర్తిస్తారేమో? " జానకి సందేహపడింది.

"అబ్బాయి అమ్మాయిని బాగా ఇష్టపడుతున్నాడు. వాళ్ళకీ సంబంధాలు వస్తాయి కదా! మన సంబంధం బావుందని మొగ్గు చూపుతున్నారేమో? భగవంతుడు వాళ్ళిద్దరికీ వ్రాసి ఉంచితే మనం మానగలమా? " ఆయన మాటలలో వేదాంత ధోరణి.

రమకి తల్లిదండ్రుల మీద ప్రేమ పొంగి పొర్లింది. నిద్రకూడా పోకుండా తన గురించే ఆలోచిస్తున్నారు. ఇటువంటి మంచి తల్లిదండ్రులను ప్రసాదించినందుకు భగవంతునికి కృతజ్ఞతలు.

మర్నాడు రమ అతడు ఫోను చేసినపుడు సీరియస్‌గానే అన్ని విషయాలూ అడిగింది. ప్రభాత్‌కి సంతోషం కలిగింది. వాళ్ళ కుటుంబంలోని వారు తన గురించి ఆలోచిస్తున్నారు. అది చాలు తనకి. రూపవంతురాలు, గుణవంతురాలు ముఖ్యంగా ధనవంతురాలు అయిన భార్య చెయ్యిదాటి పోతుందనుకొన్నాడు. అందుకే అంతగా వెంటపడడం!

తన అన్న అమెరికా వెళ్ళి హాయిగా సంపాదిస్తున్నాడు. తను కూడా కుటుంబంలో మంచి పొజిషన్‌లో ఉండాలి.

మగపెళ్ళి వారి బలవంతంతో అంతగా ఇష్టపడుతున్నారు కనుక కూతురు కాపురానికి ఢోకా ఉండదన్న నమ్మకంతో ఎట్టకేలకు పెళ్ళికి అంగీకరించాడు రాఘవరావు.

ప్రభాత్ ఆనందానికి అంతులేదు. ఫోను చేసి థాంక్స్ చెప్పాడు. మావగారికి, అత్తగారికి, రమకి ఫోన్లు చేస్తూనే ఉన్నాడు. కాబోయే అల్లుడి. కలుపుగోలు ప్రవర్తనకి అందరూ ఎంతో సంతోషించారు.

ధర్మారావుకి మాత్రం ప్రభాత్ ప్రవర్తన చిరాగ్గా అన్పించింది. వాళ్ళు వద్దనుకొన్నప్పుడు, అంతగా ఎందుకు వెంటపడాలి? తన కొడుక్కి డబ్బు యావ ఉందని ఆయనకి తెలుసును. రమమీద ఇష్టంతో తన కొడుకు పట్టుపడితే ఫర్వాలేదు. డబ్బు మీద కన్ను వేసి, సిద్ధపడితే మాత్రం తప్పే. బంగారం లాంటి పిల్ల వీడి వలన బాధపడకూడదు. ఈ విషయమే కొడుక్కి, భార్యకి గట్టిగా చెప్పాడు.

రమ పెళ్ళి శుభలేఖలు ప్రింటయ్యాయి. పెళ్ళి పనులు అతి ఘనంగా, వేడుకగా జరుగుతున్నాయి. రాఘవరావు ఇచ్చిన

## కర్ణాటక సంగీతం తెలుగులోనా?

మైసూరు వాసుదేవాచార్య గత శతాబ్దిలో ప్రముఖ కర్ణాటక సంగీత వాగ్గేయకారుడు. మైసూరు రాజుగారి ఆస్థాన విద్వాంసుడు. మాతృభాష కన్నడం అయినా ఆయన రాసిన కృతులు ఎక్కువ తెలుగులోనివే. సంస్కృతంలో కూడా కొన్ని ఉన్నాయి. దీనిపై ఆయన విరోధులు మైసూరు మహారాజుగారికి చాడీలు చెప్పడంతో రాజుగారు ఆయనను పిలిపించి కన్నడంలో కృతులు రచించమని ఆదేశించారు. ఆచార్యులు తనకది కష్టసాధ్యమన్నారట. కన్నడ భాష సంగీతానికి సరిపోదని అభిప్రాయమా అన్న రాజుగారి ప్రశ్నకు, "సంగీత శారదను ఏభాషా పుష్పంతో పూజిస్తే ఏం? కర్ణాటక సంగీత పితామహుడు పురందరదాసుగారు కన్నడిగుడే కదా? ఏ భాష వారైనా సంగీతాభ్యాసం చేసేటప్పుడు, 'లంబోదర లకుమికర'తో ప్రారంభించాలి కదా? " ఇది ఆచార్యుల సమాధానం. "కన్నడ దేశంలో పుట్టి, కన్నడ భాషలో కీర్తనలను మీరు రచించక పోవడం కన్నడ భాషకు అపచారం కాదా? " అని రాజుగారంటే, "నేను చదివింది సంస్కృతం. కర్ణాటక సంగీతం సంప్రదాయంగా తెలుగులో అభివృద్ధి చెందుతోంది. నేనూ ఆ దోవలోనివాడినే!" అని చెప్పారు. ఆస్థాన విద్వాంసుడి గౌరవం వదులుకోవలసి వస్తుందని రాజుగారు హెచ్చరిస్తే, తనకు తన పురోభివృద్ధికన్న కళోపాసన ముఖ్యం అన్నారు. రాజుగారు పదవినుంచి తొలగించినా ఆచార్యులు మారలేదు.



మూడు లక్షల కట్నంతో ప్రభాత్ తల్లి యమున మొహం చాటంతయింది. రాఘవరావు ఆడపడుచు లాంఛనమని, వియ్యపురాలి లాంఛనమని మరొక ఏభైవేలు ముట్ట చెప్పాడు. మధ్యవర్తిగా భార్గవ రెండు లక్షలే ఇమ్మన్నాడు. రాఘవరావు అవతలివాళ్ళు అసంతృప్తి పడకూడదని, తమకి ఉన్నది రమ ఒక్కత్తే, ఆమె పెళ్ళి వైభవంగా చెయ్యాలని అనుకొన్నాడు.

ప్రభాత్‌కి ఏనుగెక్కినంత సంబరంగా ఉంది. బట్టలు తీయడానికి కలిసినపుడు, నగలు కొన్నవేళ రమ ఇష్టానికే పెద్దపీట వేయడం, ఒకటికి రెండుసార్లు తరచి తరచి అడగడం రాఘవరావు దంపతులకు తృప్తినిచ్చింది.

హిమకి క్రొత్త ఉద్యోగం. ఎలాగో వాళ్ళు రెండు రోజులు సెలవు మంజూరు చేస్తే, తను ఆరు రోజులు లాస్ ఆఫ్ పే లీవు పెట్టి పెళ్ళి పనులకి వచ్చేసింది.

హిమబిందు వచ్చాక రమకి సగం బెంగ తీరింది. సంజయ్ చిలిపి తగాదాలతో, హిమబిందు అల్లరితో పెళ్ళి వైభవంగా జరిగింది.

హిమబిందుకి ఆ ఇంట్లో ఎంత ప్రాధాన్యత ఉందో ప్రభాత్‌కి, పెళ్ళివారికి బాగా అర్థమైంది. ప్రభాత్ కూడా ఆమెను చీటికీ, మాటికీ పిలిచి తమకు కావలసినవి అడుగుతూనే ఉన్నాడు.

వివాహ వేదిక మీద వధూవరులను చూస్తూంటే ప్రజలు కళ్ళు తిప్పుకోలేకపోయారు. పెళ్ళికూతురు, పెళ్ళికొడుకు రతీ మన్మధుల్లా కన్పిస్తున్నారు.

"బ్యూటీ ఈజ్ గాడ్" అంటారు. రమ అందం అందరికీ కనువిందు చేసింది. సర



దాలతో, వేళాకోళాలతో, ఆనందంతో పెళ్ళి ఎంతో వైభవంగా జరిగింది.

రాఘవరావు పెళ్ళికి ముందే వియ్యాల వారితో చెప్పాడు "నాకు రమ ఒక్కగా నొక్క పిల్ల. ఆ పిల్లను విడిచి ఉండలేము. మాకు చూడాలన్పించినా, తనకి చూడాల న్పించినా వెంటనే పంపాలి. ఇది షరతు అనుకొన్నా ఫర్వాలేదు. ఈ విషయం తేలాకనే నేను ఈ పెళ్ళి సంబంధం అంగీ కరిస్తాను."

ఆయన మాటలు అంత ఖచ్చితంగా ఉన్నాయంటే ఈ విషయానికి వాళ్ళు ఎంత ప్రాధాన్యతనిస్తున్నారో అర్థమైంది.

ప్రభాత్ చిరునవ్వుతో చెప్పాడు. "రమే కాదు నేను కూడా వస్తాను. మీరు కూడా వస్తూ, వెళుతూ ఉండాలి."

మాంగల్యధారణ జరుగుతూంటే వాళ్ళ గుండెలు బరువెక్కాయి. రమకి ఎందుకో భయం వేసింది. అయిపోయింది. ఇక నుండి తను మరొకరి సొత్తు అయిపో యింది. అసంకల్పితంగా తల్లిదండ్రుల వైపు చూసింది.

ఇన్నేళ్ళ జీవితంలో చిన్న కన్నీరుకానీ కష్టంగానీ తనకి తెలియనీయకుండా పెంచారు తల్లిదండ్రులు. ఏమిస్తే వారి రుణం తీరుతుంది? మనసు భారమైంది. అప్పగింతల సమయంలో మరి నిగ్రహిం చుకోవడం రాఘవరావు, జానకిల వశం కాలేదు. రమ అయితే మరి చెప్పనక్కర లేదు. హిమ, సంజయ్‌లు వెక్కి వెక్కి ఏడుస్తుంటే రాఘవరావే ఓదార్చవలసి వచ్చింది.

ఆడబిడ్డలను కనడంలో ఎంత కష్ట ముంది? అల్లారు ముద్దుగా పెంచిన చిన్న తల్లులను, ముక్కుమొహం తెలియని వాడికి అప్పచెప్పడం, శేష జీవితమంతా అతడితో బ్రతకమని శాసించడం కష్ట మైనా, సుఖమైన బ్రతుకు అక్కడే అని నిర్దేశించడం. అంతా ఆలోచిస్తున్న ఆనంద రావుకు గుండె పిండినట్లయింది.

దూరంలో రమను ఆనుకుని కూర్చుని ఏడుస్తున్న హిమను చూశాడు. రేపు నా బిడ్డకూ పెళ్ళి చేయాలి కదా! ఈ బాధ తానూ అనుభవించాలి అనుకొన్నాడు.

ఎవరో ముత్తయిదువ హిమతో అంటోంది, "రేపు నువ్వుకూడా నచ్చిన అబ్బాయిని పెళ్ళిచేసికొని వెళ్ళిపోయేదా నివే! ఆడదాని బతుకే అంత. ఏడవ కమ్మా!"

ప్రభాత్ వాళ్ళను చూస్తూ అన్నాడు, "మావయ్యగారూ! మీరందరూ ఇలా ఏడిస్తే, వివాహం నా జీవితంలో మధుర ఘట్టం ఎలా అవుతుంది? మీరు నిగ్ర హంగా ఉంటే రమ కూడా నిగ్రహం చూపుతుంది."

హిమ అతడి మాటలకు చివ్వున తలె త్తింది. "గృహస్థ జీవితం గడపని, మహా మునివంటి కణ్వుడికే ఈ దుఃఖం తప్ప లేదు. శకుంతలను పంపిస్తూ ఆక్రోశిం చాడు. పుత్రికా వియోగం భరింపరానిద న్నాడు. మరి మావాళ్ళ బాధ మీరు అర్థం చేసుకోవాలి" అంది. హిమ మాటలకు అతడు సమాధానం చెప్పలేకపోయాడు.

"ఒరేయ్! ఏమీ తెలియకుండా మాట్లా డకు. ఈ దుఃఖంతో ఏ తల్లిదండ్రులైనా ఇలాగే పరితపిస్తారు" అన్న అవహేళన ఆ మాటలలో ఉంది.

కొల్టన్ అన్నట్లు "వివేకవంతుడు ఎప్పుడూ నిన్నటికంటే, రేపటి కంటే నేడు తెలివిగా మసులుకొంటాడు" అన్న సూక్తి బాగా ఒంటపట్టినవాడు ప్రభాత్.

"చూడండి హిమా! రమ ఎక్కడికీ వెళ్ళడం లేదు. తన కుటుంబంలోకి మరొక వ్యక్తిని అంటే నన్ను తీసికొని వచ్చింది. అందుకని మావయ్యగారిని, అత్త య్యగారిని ఏడవ వద్దంటున్నాను.

న్యాయంగా చూస్తే అబ్బాయిలను కని, అమ్మాయిలకు వదిలేస్తున్న మా తల్లిదండ్రులు ఏడవాలి." ప్రభాత్ మాటలకు అక్కడున్న అందరూ నవ్వారు.

రమకు శరీరం మాటిమాటికి తగిలిస్తూ, ఏమీ ఎరగని వాడిలాగ ప్రవర్తిస్తూ ప్రభాత్ అక్కడున్న ఆడవాళ్ళ హృదయాలను చూరగొన్నాడు.

రమకి అతడలా తాకుతుంటే సిగ్గుగా, వింత అనుభవంగా ఉంది. తల్లిదండ్రులను, ప్రాణ మిత్రురాలిని విడిచి వెళుతున్నాననే బెంగ ఓపక్క నిలవనీయకుండా ఉంది.

హిమబిందు ఒకే రకమైన రెండు గొలుసులు చేయించింది. రమ, హిమల ఫోటోలు వాటిలో పెట్టింది. హిమ ఉన్న చైను రమ మెడలో వేసింది. రమ ఉన్నది తను ధరించింది.

"రమా! నేను నీ దగ్గరే నీ గుండెల్లోనే ఉంటాను" అంటూ కౌగిలించుకుంది. ఆ గొలుసులు ఎంతో బావున్నాయి. హృదయాకారంలో అమర్చిన లాకెట్ లో ఫోటోలు ఇంకా బాగున్నాయి. కొత్త డిజైనుతో చైన్లు చూసేవారి మనసుని దోచుకొంటున్నాయి.

సంజయ్ గెంతుతూ వచ్చాడు. వాడి కాలు ఎప్పుడూ అంతే. "రమక్కా! నా చైన్ చూడు" చూపించాడు.

వాడి గొలుసులో కొత్త లాకెట్. రమ, హిమ కలిపి తీయించుకున్న ఫోటో ఉంది. ఇద్దరూ నవ్వుతూ, లోకంలోని ఆనందమంతా తమదేనన్నట్లున్నారు.

రమ కళ్ళు నీటితో నిండాయి.

"సంజూ!" అంటూ దగ్గరకు తీసికొని, వాడి తలను వంచి ముద్దు పెట్టుకుంది.

"ఈ ఫోటో వద్దురా కన్నా! మనము గ్గురం కలిపి తీయించుకొన్నది నా ఆల్బంలో ఉంది. దాన్ని పెట్టుకో!" అంది.

"అక్కా! నన్ను మరిచిపోకు" అంటూ

**కొత్తగాలి...**

**రేషన్‌షాపు తల**
**ముగ్గుబుట్టయింది**
**ఇప్పుడు తెల్లకార్డు**
**దొంగవెంట్రుకల్ని**
**ఏరిపారెయ్యాలి**

– బద్ది నాగేశ్వరరావు, అనకాపల్లి

వాడు ఆమె భుజం ఒంపులో ఒదిగాడు.

రమ వాడి తల నిమిరింది. వాడు సన్నగా కంపిస్తున్నాడు. అక్కడున్న అందరూ వాడు ఏడుపుని ఎలా నిలువరించుకుంటున్నాడో చూసి, కళ్ళలో నీళ్ళు నింపుకున్నారు.

"సంజూ! బావగారికి గడ్డం క్రింద బెల్లం ముక్క పెట్టావు. కానీ వెళ్ళకుండా ఆపి, నాకు అప్పచెప్పావు. నా ముద్దుల తమ్ముడిని నేను ఎలా మరిచి పోతాను. నాన్నగారింటి తర్వాత నీ యిల్లే నా పుట్టిల్లు." ఆ మాటలంటున్నప్పుడు రమ గొంతు వణికింది.

రక్తసంబంధం కన్నా, ప్రేమబంధం కన్నా, స్నేహబంధం ఎంత గొప్పది. నిస్వార్థమైన చెలిమితో ఏది సరితూగగలదు? హిమ డైరీ తెచ్చి అందించింది.

మొదటి పేజీలో హిమ ఫోటో ఒక ప్రక్కనుంది. అందంగా ఆ పేజీలో ఇలాగ వ్రాసింది.

Friendship is a great Network.
That needs...
No, Recharge!
No, Roaming!
No Validity Limit!
No Activation!
No Signal Problem!
Don't Switch off your heart.

మనసు పొరలు చిట్లాయా? స్నేహ







మధురిమలు పాతాళగంగలాగ పెల్లుబి కిందా? శరీరం స్నేహవత్సరాలను తలచుకుని, రోమాంచితమైందా? ఏటిఒడ్డున ఆడిన ఆటలు, మట్టిచెట్టు కింద పంచుకున్న అనుభవాలు, శివాలయపు అరుగు మీద చెప్పుకున్న కబుర్లు నరనరాన్ని కుదిపేసిందా?

"తాను" అన్నది మిధ్యయై, లోకమంతా స్నేహపు వెన్నెలై ఆర్ద్రతతో హృదయం మూగబోయిందా? రమకి ఏమీ తెలియలేదు. తెలిసింది ఎదురుగా నున్న బహిః ప్రాణం. లోకమంతా ఆమే అయింది. ఆమే లోకమైంది. హిమ ఒడిలో ఒరిగిపోయింది.

"హిమా! హిమా! ఎందుకే నా హృదయాన్ని ఇంతలా కదిలిస్తున్నావు! ఇది నా హృదయం కాదు, నీది. నీవు కొలువున్నది. నీతో నిండిపోయింది. మనసంతా ఆక్రమించిన నువ్వు, నాతో ఉన్నావనే ఈ వివాహానికి సిద్ధమయ్యానే!" రమ మనసులోని భావపరంపరలు హిమ హృదిని చేరాయి. ఇద్దరూ ఒకరి పరిష్వంగంలో ఒకరు సేద తీరారు.

ఒకరికి ఒకరు ధైర్యం చెప్పుకున్నారు. బాసటగా నిలుస్తామని ప్రమాణాలు చేసుకొన్నారు. అంతా మౌనభాషలోనే. ఆ రెండు హృదయాల లయ వారిని కన్నవారికే అర్థమైంది. ఎనిమిది కళ్ళూ సానుభూతిగా వాళ్ళను చూశాయి.

★ ★ ★

ప్రభాత్ ఆనందం అంబరాన్ని తాకింది. సన్నటి, తెల్లటి గ్లాస్కోపంచె, లాల్చీలో, నుదుటిపై చిన్నగా పెట్టిన తిలకంతో. కాటుక సన్నగా పెట్టిన కళ్ళతో అపర మన్మధుడిలాగున్నాడు. ఎప్పుడు రమ తన గదిలోకి వస్తుందా, ఎప్పుడు ఆ శుభఘడియలు సమీపిస్తాయా అని ఎదురు చూస్తున్నాడు.

అతనూహించినట్లే దేవకన్యలాగ రమ అతడి గదిలో ప్రవేశించింది. పరిసరాలు కొత్త. మనుష్యులు కొత్త. ఆమె అణువణువూ మరొక దశలోకి ప్రవేశించడానికి శక్తిని కూడగట్టుకుంటోంది.

ఇదే ఇక నుండి తన ఇల్లు. ఇతడే తన జీవన సహచరుడు. తాను కావాలని తపించి, తనను జీవితంలోకి ఆహ్వానించిన చెలికాడు. క్రొత్త స్నేహితుడు.

"రమా! అక్కడే నిలబడి పోయావేం?" అంటూ ప్రభాత్ పలకరిస్తూ, ఆమెను సమీపించడం, ఆమె, తన సుకుమారమైన మనసుని నిలువరించుకుని నిట్టూర్పు విడవడం, అతడు తన చేత్తో ఆమె చేతిని పట్టుకుని ముందుకు నడిపించడం వరుసగా జరిగిపోయాయి.

"రమా! నిన్ను పొందుతానా, లేనా అని పరితపించాను. ఈ అందాల భరిణె నా మనసు దోచింది. అయినా ఇంతవరకూ నేను అనుకొన్నది, ఏదీ జరగకుండా పోలేదు. థాంక్ గాడ్!" అతడు ఆత్రంగా మాట్లాడుతూ, ఆమె మొహాన్ని తన రెండు చేతులతో తీసికొని, పెదవులపై తన తీయటి ముద్ర వేశాడు. అంతే.. ఇన్నాళ్ళూ నిద్రపోయిన అతడి కోరికలు పడగవిప్పి నాట్యం చేశాయి. రమ లేత శరీరం అతడి దాడికి కంపించి పోయింది.

పెనుగాలికి కదిలిపోయిన సన్నజాజితీగలాగ, పెద్ద ఎత్తులో కెరటం వచ్చి ముంచెత్తితే, మౌనంగా తలవంచి, కదిలిపోయిన ఇసుక తిన్నెలాగ రమ నిస్తేజంగా, నిర్లిప్తంగా ఉండిపోయింది.

స్పందనకి ప్రతి స్పందన ఉందా, లేదా అన్న ఇంగితం లేదు. నూతన వధువు పరిస్థితి అర్థం చేసుకోవాలన్న జ్ఞానం లేదు. రగిలిన కోరికలను చల్లార్చుకోవడమే తెలుసుకాని ఎదుటి మగువలో కోరికను రగల్చడం తెలియలేదు.





ప్రభాత్ రమ మంగళ సూత్రాలను చూస్తూ అన్నాడు, "నా బ్రహ్మచర్యానికి, నా గది ఏకాంతానికి నీ రాకతో ముగింపు పలి కావు రమా! నువ్వు నాదానివంటే నా హృదయం పరవశిస్తోంది. ఆc.. అన్నట్లు మీ ఫ్రెండ్‌కి ఫోను చేస్తావా? నువ్వు పొందిన సరికొత్త అనుభవం చెప్తావా? " అతడు కొంటెగా నవ్వుతూ అడిగాడు.

రమ ఉలిక్కిపడింది.

"ఇది అనుభవమా? అలాగ లేదు! ఒక హోరువాన వచ్చి వెలిసినట్లు ఉంది. ఒక భూకంపం వచ్చి కదిల్చినట్లుంది. పైగా ఎంత సిగ్గులేకుండా ఈ సమయంలో హిమ ప్రస్తావన తెస్తున్నాడు.. ఛీ.. ఛీ.." రమ శరీరం వణికింది.

అతడు ఆమె చుబుకం ఎత్తి అన్నాడు.

"నీకూ నాకు మధ్య అడ్డుతెర పోయింది. కళ్ళు ఎత్తి ఇప్పటికైనా చూస్తావా? నా చెవులు నీ పెదవులు చెప్పే కబుర్లకోసం తహ తహ లాడుతు న్నాయి. నా దగ్గర సిగ్గెందుకు? "

రమ మనసు ముడుచుకుపోయింది. ఈ అనుభవం మొదటిరాత్రి మామూలే! కానీ ఒక స్నేహం తర్వాత, ఒక పలక రింపు తర్వాత, ఒకరి కొకరు సన్నిహిత మైన సంభాషణ తర్వాత జరగవలసిన తంతు, ఒక మధురమైన అనుభవం.. ఇలాగ జరగడం ఆమె మనసుని కలచివే సింది.

ఈయనకు నా మనసుతో పనిలేదా? అనుకుంది.

"రమా! నేను ఇన్ని మాట్లాడుతున్నాను. మాట్లాడవేం? నాకు ఇష్టం నువ్వంటే. నాకు కావలసిన రాత్రిలో, నా జీవితంలో హాయిగా ఉండు. నాకు మంచి ఉద్యోగం ఉంది. మంచి జీతం ఉంది. మా బంధు వులందరికంటే, నాకుటుంబ సభ్యుల కంటే ధనవంతుడినవ్వాలి. ఏ విషయంలోనైనా నేను ముందుండాలి. నా కోరికలు అర్థం చేసుకొంటావు కదూ!"

రమ తల ఊపింది. ఇక నుండి ఈ ప్రపంచం తనది. ఇందులో తను జీవిం

## చతుర ప్రోత్సాహమే...



తనికెళ్ల కల్యాణి

పుట్టింది ఏలూరు. పెరిగింది, చదువు కుంది రాజమండ్రి, విజయనగరంలో. ఇక నివాసం పార్వతీపురం. తల్లి వెన్నెలమ్మ మాణిక్యాంబ, తండ్రి మానాప్రగడ శేషసా యిల దిశానిర్దేశమే రచనా వ్యాసంగం చేపట్టేలా చేసింది. నా జీవిత భాగస్వామి తనికెళ్ల సూర్యనారాయణమూర్తి సహ కారం ప్రతి రచన వెనుక ఆలంబనగా నిలిచింది. 'క్షమ'తో ప్రారంభమైన నా నవలా రచనకు స్ఫూర్తిని, ప్రోత్సాహాన్ని అందించింది నాటి 'చతుర' సంపాదకులు చలసాని ప్రసాదరావుగారే. నా నవలలు అధికంగా చతుర, ఆంధ్రభూమిలలో ప్రచు రితమయ్యాయి. నా కథలు, వ్యాసాలు, విమర్శలు, కవితలు ప్రచురించి వివిధ పత్రికలు ప్రోత్సాహమిచ్చాయి. అధ్యాపకు రాలిగా, రచయిత్రిగా ఉత్తేజమైన జీవి తాన్ని గడుపుతున్నాను. నన్ను ఆదరిస్తున్న 'చతుర'కు కృతజ్ఞతలు.

చిరునామా:

శ్రీమతి తనికెళ్ల కల్యాణి,
కె.పి.యం. హైస్కూల్ వద్ద,
పెద్దవీధి, పార్వతీపురం,
విజయనగరం జిల్లా

## కొత్తగాలి...

**ఊపిరి పోస్తోంది**
**ఊడిగం చేస్తోంది**
**ఊయల ఊపుతోంది**
**ఉజ్వల భవిష్యత్తునిస్తోంది**
**స్త్రీ**

– మేడిచర్ల అనుపమ, రామరాజులంక, తూ. గో. జిల్లా

చాలి. ఇతడు, తను జీవితాంతం కలిసి ప్రయాణం చేయాలి.

"మీ ఫ్రెండ్ ఎప్పుడు పెళ్ళి చేసుకుంటుంది? నువ్వు మన విషయాలు చెప్పావంటే, ఇప్పుడే పెళ్ళికి సిద్ధపడుతుంది" గట్టిగా నవ్వాడతను.

రమకి కోపం వచ్చింది. అయినా నిగ్రహించుకుంది. పడకగదిలో తొలిరాత్రి, కొత్తగా పెళ్ళై వచ్చిన భార్యతో ఇలాంటి సరసాలా?

రమ స్థిరంగా చెప్పింది "ప్లీజ్, హిమ గురించి ఇలాంటి మాటలు మాట్లాడొద్దు"

అతడు ఒక్క క్షణం మాట్లాడలేక పోయాడు. భార్య మాట్లాడిన తొలిమాట అదవడం అతడి ఖర్మ. కొందరంతే! అనడానికీ సిగ్గుపడరు. అనిపించుకోవడానికీ సిగ్గుపడరు.

అతడు పడక మీద నుండి లేచి సిగరెట్ తీశాడు. ఆమె ఆశ్చర్యంగా చూసి అంది. "మీరు సిగరెట్లు కాలుస్తారా?"

అతడు మరింత ఆశ్చర్యంగా చూశాడు.

"బావుంది. దీనికింత ఆశ్చర్యం ఎందుకు? ఈ రోజుల్లో సిగరెట్లు, మందు కామన్. అయితే నాకు ప్రస్తుతం ఆ రెండో అలవాటు లేదు."

రమ ఇంకా ఆశ్చర్యం నుండి ఇవతల పడలేదు. ఆమెకి గతం గుర్తువస్తోంది.

తనకు, హిమకు సిగరెట్లు అంటే అయిష్టం. తమ ఫ్రెండ్ వసుధ అనేది "అంతగా సిగరెట్లని ద్వేషించకండే! ఈ రోజుల్లో మగవాళ్ళకి లేని అలవాటు లేదు. కొంపదీసి సిగరెట్టు కాల్చే భర్త వస్తే ఆనక ఏడవాలి."

పైన తథాస్తు దేవతలుండి ఉంటారు. ఆమె మాట తన విషయంలో నిజమైంది. తాను సిగరెట్లు కాల్చేవాడిని చేసుకోకూడదనుకుంది. రమ పెదవులపై పలుచటి నవ్వు వెలిసింది. ఆమెకు 'ఎడ్వర్డు కార్పెంట్' కొటేషన్ గుర్తు వచ్చింది "వివాహం పురుషుణ్ణి రాక్షసుణ్ణి చేస్తుంది. స్త్రీని బానిసను చేస్తుంది"

★ ★ ★

సెల్‌ఫోను మోగగానే రమ ఆత్రంగా ఎత్తింది. అటునుండి తండ్రి, తల్లి, హిమ.

రేపటికి గాని తాము తమ ఊరు బయలుదేరరు. మరొక 24 గంటలు. రమ గంటలు, నిముషాలు మనసులో లెక్క వేసుకుంటోంది.

"అమ్మలూ! హిమ మమ్మల్ని ఎంత బాగా చూస్తోందో? ఎన్ని కబుర్లు చెపుతోందో? నువు ఎలా ఉన్నావురా?" తండ్రి పలకరింపు.

"తల్లి! అత్తయ్య నీకు అన్నీ సమకూరుస్తోందా? మొహమాటం లేకుండా ఉండు. నీ మేనత్త ఇప్పుడు కాకపోతే ఎప్పుడు నీకు సేవచేస్తుంది. భయపడకు." తల్లి ధైర్యం నూరిపోస్తోంది.

"నాన్నగారూ! నేను మన ఊరు వచ్చేస్తున్నాను. అబ్బ. మూడు రోజులూ మూడు యుగాలుగా అనిపించింది."

రమ మాటలకు రాఘవరావు కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి. ఆయన సెల్ లౌడ్‌స్పీకర్‌లో జానకికి మాటలు వినిపిస్తున్నాయి. ఆవిడ భర్తవైపు చూసింది.

"మనపిల్ల మనల్ని విడిచి ఉండలేదు. మనం దాన్ని విడిచి ఉండలేము. అందుకే నేను దగ్గర సంబంధమన్నాను. వాళ్ళ

ఖితే మనకు సన్నిహితులు కనుక మన విషయాలు తెలిసిన వారు కనుక మనకు, అమ్మాయికి మధ్య ఎడబాటుండదు" అన్న సందేశం ఆ చూపులలో ఉంది.

ఆయన మొదటిసారిగా కళ్ళు దించుకు న్నారు. రమ అటు నుండి కబుర్లు చెపు తోంది. ఆయన వింటున్నారు.

ప్రభాత్ స్నానం చేస్తూ బాత్‌రూం నుండి రమను పిలిచాడు. రమ ఈ లోకంలో ఉంటే కదా!

అతడు స్నానం పూర్తి చేసుకొని వచ్చి, చూస్తే ఒళ్ళు మరిచి రమ, వాళ్ళతో కబుర్లు చెపుతోంది. అతడు విస్మయంగా చూశాడు.

"ఈ రెండు మూడు రోజులలో అన్ని కబుర్లేముంటాయి? "

పెదవులు దాటబోయిన మాటలను ఎలాగో అణచుకొన్నాడు. బట్టలు వేసుకొని చూచాడు. రమ పరిస్థితిలో మార్పులేదు.

"రమా! టిఫిన్ చేద్దాం రా!" పిలిచాడు.

"మీరు వెళ్ళి తినండి. నాకు ఆకలి లేదు" రమ మధ్యలో సమాధానం చెప్పి, మళ్ళీ అటు తిరిగి మాట్లాడసాగింది.

రమకి ఒళ్ళంతా జ్వరం వచ్చినట్లు సల పరంగా ఉంది. దానికి తోడు సన్నగా కడుపు నొప్పి. ఏమీ తినాలని లేదు.

హిమ అవతల నవ్వుతూ పలకరిం చింది. పలకరింపులు అయ్యాక హిమ మృదువుగా అడిగింది.

"రమా! ఆర్ యూ ఆల్ రైట్? "

ఆ ప్రశ్న రమ మనసుని తాకింది. వెంటనే సమాధానం చెప్పలేకపోయింది.

"రమా! ఆర్ యూ హేపీ? హౌ ఈజ్ యువర్ మేరీడ్ లైఫ్? "

రమ మృదువుగా అంది, "త్వరలో కలు స్తాంగా! అన్నీ మాట్లాడుకుందాం."

హిమ మౌనంగా ఉండిపోయింది.

ఇంటికి రావడంతోనే తండ్రిని, తల్లిని అల్లుకుపోయింది రమ.

"అమ్మా! ఏం టిఫిన్ చేశావు? త్వరగా పెట్టవా? " అంటూ చిన్న పిల్లలాగ వంటింట్లో చేరి అడిగింది.

జానకి అందరికీ టిఫిన్లు ఏర్పాటు చేసింది. హిమ సాయంత్రం వెళ్ళిపో తోంది. రమకి అమెను ఎలాగ ఉంచాలో అర్థమవలేదు.

హిమను తీసుకొని వెళ్ళి తన గదిలో కూర్చుంది. ఇద్దరూ కబుర్లలో పడ్డారు.

"మీ అత్తగారు సరదాగా ఉన్నారా? ఆడ పడుచు, తోడి కోడలు బాగా పరిచయమ య్యారా? ఆయన నీతో ఫ్రీగా ఉన్నారా" హిమ అడిగింది.

"బాపురే.. ఆగు తల్లీ! వరుసగా ఏమిటా ప్రశ్నలు? నువ్వనుకొన్నంత పరిచయాలు నాకు వారితో ఇంకా ఏర్పడలేదు. ఈ మూడు రోజులూ ఎప్పుడు ఇక్కడికి వచ్చే స్తానా అన్పించింది."

రమ మాటలకి హిమ నవ్వలేక నవ్వింది. "చూడు రమా! వాళ్లు మనవాళ్ల య్యారు. నీవు ఇక వాళ్ళతో కలిసి బత కాలి. మా రమ మంచి గృహిణిగా మారిం దని మేం సంతోషిస్తాం. నెమ్మదిగా ఆ వాతావరణానికి అలవాటు పడటం నేర్చుకో!"

హిమ మాటలకు రమ మొహం వాడి పోయింది.

"రమా! వైవాహిక జీవితం అద్భుతమై నది. అందులో నువ్వు పరిపూర్ణమైన ఆనందం పొందాలి? త్వరగా మంచి బాబును నాకు అందించాలి."

రమ కళ్ళలో నీళ్ళు గిర్రున తిరిగాయి.

"వైవాహిక జీవితం ఆనందమా? ఏ లోకంలో ఉన్నావు నువ్వు. మన మనసుకి భర్త ప్రాధాన్యమీయడు. మన శరీరమే అ తనికి కావలిసింది. కంటినిండా నిద్రలేదు. స్త్రీని వస్తువుగా ఎలా చూస్తారో నాకు అర్థ



మవదు."

ఈసారి హిమ తెల్లబోయింది. "ఈ సిని మాలలో, టీవీలలో శృంగారాన్ని అద్భుతంగా చూపించి, మన మనసులు చెడగొడుతున్నారు. అంతా అసత్యమా?"

రమ పెద్దదానిలాగ నవ్వింది.

"శృంగారం గొప్పదే. ఇరు మనసుల స్పందనా సరిగా ఉండాలి. ప్రేమ ఎలాగ వన్‌వే ట్రాఫిక్ కాకూడదో శృంగారం కూడా వన్‌వే ట్రాఫిక్ కాకూడదు. శరీరాల కలయిక కంటే మనసుల కలయిక ముఖ్యం."

హిమ ఎవరో కొత్త వ్యక్తిని చూసినట్లు రమను చూసింది.

★ ★ ★

ప్రభాత్ ద్వారం వైపు చూస్తున్నాడు. టిఫిన్ చేసినప్పుడు కనబడిన భార్యామణి మళ్ళీ కన్పించలేదు. రెండుసార్లు తనే పిలిచాడు.

భార్యను మళ్ళీ గట్టిగా పిలవాలంటే మొహమాటం వేసింది. నాన్సెన్స్... తన భార్యను పిలవడానికి తను జంకడం ఎందుకు? అతడు నోరు తెరవబోతుంటే సంజయ్ నవ్వుతూ వచ్చాడు.

"బావగారూ! లాభం లేదు. రమక్క ఇప్పుడు రాదు. వాళ్ళిద్దరూ కబుర్లలో పడితే అంతే! ఏం కావాలో చెప్పండి. ప్రస్తుతం వీడు ద్విపాత్రాభినయం చేస్తాడు. ఊ.. మంచినీళ్ళు కావాలా? పళ్ళు ఏవైనా తింటారా? లేక కాఫీ తెమ్మంటారా? ఇవి రమక్క ప్రశ్నలు. ఇక సంజయ్‌వి.. బయటికి వెళ్ళి వద్దామా? కేరమ్స్ ఆడదామా?"

ప్రభాత్ నవ్వాడు. సంజయ్ కలుపుగోలుగా ఉంటాడు. సంజయ్ కబుర్లు చెపుతుంటే, ఇద్దరూ బయటికి వెళ్ళి వచ్చారు.

మధ్యాహ్నం భోజనాలయ్యాక ప్రభాత్ నిద్రపోయాడు. రమ తండ్రిని తీసుకొని హిమను రైలు ఎక్కించడానికి స్టేషన్‌కి వెళ్ళింది. సంజయ్, హిమ తల్లిదండ్రులు వెంట వచ్చారు.

అక్కడకీ ఆనందరావు మొహమాటంగా అన్నాడు, "రమా! నువ్వెందుకమ్మా! అబ్బాయి ఇంట్లో ఉన్నారు కదా! ఏమనుకొంటారు?"

రమ నవ్వింది. "ఆయన కుంభకర్ణుడిలాగ నిద్రపోతున్నారు. అక్కడికీ లేపాను. మనం వెళ్ళేవరకూ లేవరు."

అందరూ హిమకి బోలెడు జాగ్రత్తలు చెప్పారు. "అబ్బబ్బ... నేను ఓ నెలలో వస్తాను! కొన్ని దాయండి. అప్పుడు మళ్ళీ చెప్పాలి కదా!" అంటూంటే అందరూ నవ్వారు.

హిమ రాఘవరావు చేతులు పట్టుకుని చెప్పింది "ఈ హిమ మీ కూతురే అనుకోండి. అమ్మా, మీరు నా దగ్గరికొచ్చి, హాయిగా ఓ వారం కేంప్ వేయండి."

రాఘవరావు, జానకి మాట్లాడలేకపోయారు.

రమ కన్నీళ్ళతో మొహం తిప్పుకుంది. ఆనందరావు అందుకొన్నాడు, "వాళ్ళను చూడటానికి మేము ఉన్నాం. తమరు ముందు జాగ్రత్తగా ఉండండి. ఎవరితో వాదనలు వద్దు."

శాంత అందుకుంది. "ఎవరైనా మన వాళ్ళ అబ్బాయి కన్పించినా, నీకు నచ్చినా మొహమాట పడక ఫోను చెయ్యి. మీ నాన్నగారు వచ్చి, మంచి చెడ్డ మాట్లాడతారు."

హిమ రెండు చేతులూ జోడించి తల్లికి నమస్కారం పెట్టింది.

"కూతురు ఉద్యోగ జీవితానికి వెళుతోందని, బాధ్యతగా ఉండమని చెప్పడం లేదు. ఉద్యోగ జీవితంలో కూడా పెళ్ళి సంబంధాన్ని దూరుస్తున్నావంటే నిన్ను ఏమనుకోవాలి తల్లీ! ఆడపిల్లలు ఎక్కడికి వెళ్ళినా



వరుడిని చూసి, నచ్చుకునేందుకు వెళ తారా? నథింగ్ డూయింగ్, నువ్వు ఆ మాట మరిచిపో! వాడు నేను ఒకటే!" అంది సంజయ్‌ను చూపిస్తూ.

"అక్కా, నేను ఒకటే కదమ్మా! నాకు పెళ్ళి చేసెయ్యి. ఒకపని అయిపోతుంది. నీకు ఇంటిపనికి ఒక మనిషి సాయం వస్తుంది. నాన్నగారికి అక్కలేని లోటు తీరుతుంది." సంజయ్ సిన్సియర్‌గా చెప్పాడు.

"ఊ.. 'లా' బాగా చదివి, ఫస్టుక్లాసులో పాసవకపోతే మీ నాన్నగారు ఎలాగూ పెళ్ళి చేస్తారు. అది తప్పదు" శాంత కొడుకు వైపు తిరిగి అంటూంటే అందరూ నవ్వారు.

సంజయ్ భుజాలు ఎగరవేసి "మీ కోసం చెప్పినా అర్థం చేసుకోకపోతే ఏం చేస్తాం? అంతే" అన్నాడు.

ట్రైన్ కదిలిపోతూంటే హిమ కన్నీళ్ళతో తమ్ముడి వైపు చూసి అంది "అందరినీ జాగ్రత్తగా చూసుకోరా!"

అతడు.. అంత సరదా మనిషి... అలాగేనన్నట్లు తల ఊపాడు తప్ప మాట్లా డలేకపోయాడు.

ట్రైన్ ముందుకు వెళుతుంటే అందరూ భారమైన మనసులతో వెనుదిరిగారు.

ఆనందరావు వాళ్ళు తమ ఇంటికి వెళ్ళ బోతుంటే, రమ వారించింది. "రాత్రి భోజ నాలయ్యాక వెళ్ళండి" అంటూ. వాళ్ళు రమ మాట కాదనలేకపోయారు.

రాత్రి భోజనాలయ్యాక తల్లి గదిలోకి వెళ్ళి పడుకుంది రమ. పనులు పూర్తి చేసుకొని, అందరికీ అమర్చి, తన గదిలో కూతురిని చూసి, జానకమ్మ ఆశ్చర్యపో యింది.

రాఘవరావు సోఫాలో కూర్చుని, టీవీ చూస్తున్నారు. ప్రభాత్ తమ గదిలోకి వెళ్ళిపోయాడు. అతడికి అప్పుడే నిద్ర రావడం లేదు. మధ్యాహ్నం కుంభకర్ణుడి లాగా నిద్రపోయాడు కదా!

మామగారి ఇల్లు, మర్యాదలు అతడికి చాలా నచ్చాయి. కానీ రమ ప్రవర్తన విసుగు తెప్పిస్తోంది. తను రాకపోయినా, హిమను దింపడానికి వెళ్ళిపోయింది. తను స్నానని ఆగుతుందనుకున్నాడు. తను వెళ్ళినా బావుండేది. బాధ్యతగా ప్రవర్తించా డనుకునేవారు. పాడు నిద్ర. మెలకువ వస్తే కదా!

"రమా! వెళ్ళు. అబ్బాయి నీకోసం చూస్తూ ఉంటాడు. నిద్రలే" జానకమ్మ కూతురిని నెమ్మదిగా లేపింది. రెండుసార్లు పిలిచినా, లేవలేదు.

"అమ్మా!" మూడోసారి మళ్ళీ గట్టిగా పిలిచింది. ఆవిడకి అంత మంచి నిద్రపో తున్న కూతురిని లేపాలన్పించలేదు. కానీ తప్పదు.

రమ నిద్ర కళ్ళతో తల్లిని చూసింది. ఆవిడ మాటలు సగం అర్థమయ్యాయి. సగం అర్థమవలేదు.

"అమ్మా! ప్లీజ్. నన్నులేపకు. వారం రోజులనుండి నిద్రలేదు." రమ కనురె ప్పలు విడకుండానే సమాధానం చెప్పి, పడుకుంది.

జానకి ఐదు నిముషాలు అలాగే నిలబ డిపోయింది. తర్వాత నెమ్మదిగా అంది. "అతడు నీకోసం చూస్తున్నాడు. ఏమను కొంటాడో? "

రమ విసుగ్గా నిద్రలోనే సమాధానమి చ్చింది, "అబ్బ.. ఇప్పుడు వెళితే తెల్లవారు ఝాము వరకూ నన్ను నిద్రపోనీయ డమ్మా! నా మనసు శరీరం రెండూ అల సిపోయాయి. నువ్వే ఏదో ఒకటి చెప్పు".

ప్రభాత్ అక్క జానకి దగ్గరికి వచ్చింది. ఆవిడ ఏం మాట్లాడటమా అని ఆలోచి స్తోంది.

"అత్తయ్యగారూ! తమ్ముడు అక్కడ రమ

కోసం చూస్తున్నాడు. ఇదేమిటి తను ఇక్కడ పడకేసింది? " అడిగింది.

ఆమె అలా నిలదీస్తుంటే, జానకికి ఒళ్ళు మండింది "చాలా అలసిపోయిందమ్మా! అదసలే సుకుమారంగా పెరిగింది. లేపినా లేవడం లేదు. మంచి నిద్రలో ఉంది. ఏం పోయింది. అక్కడ మూడు నిద్రలూ వరుసగా అయ్యాయి కదా!" అంది.

అంతేకాదు "మీ తమ్ముడికి నువ్వే వెళ్ళి చెప్పు" అంది. తల్లిగా ఆవిడ కూతురి దేహస్థితి, మానసిక స్థితి అర్థం చేసుకొంది.

ప్రభాత్ అక్క చెప్పిన మాటలతో ఉగ్రుడయ్యాడు. తన గురించి ఏమనుకొంటున్నారు?

"మీ ఆవిడ అలసి సొలసి నిద్రపోయింది. ఈ రోజు నువ్వు ఒంటరిగా గడపవలసిందే!" చేతులు తిప్పుతూ చెప్పి, అక్క తమకిచ్చిన గదిలోకి వెళ్ళిపోయింది.

ప్రభాత్ బయటకు వచ్చి చూశాడు. జానకి వంటింట్లో లైటు ఆర్పి తన గదిలోకి వెళుతూ క్రీగంట అల్లుడిని చూసింది. అతడు గది బయట తచ్చాడుతున్నాడు.

ఆవిడకు చిరుకోపం వచ్చింది. అయినా తమాయించుకుని అంది "రమ మంచి నిద్రలో ఉంది. మధ్యలో లేస్తే తనకి విపరీతమైన తలనొప్పి వస్తుంది."

ఆవిడ మంచి నీళ్ళతో తన గదిలోకి వెళ్ళిపోయింది. ప్రభాత్ చేసేదిలేక మౌనంగా గదిలోకి వెళ్ళిపోయాడు.

మర్నాడు రమ లేచేంత వరకూ జానకి లేపలేదు. రాత్రి నిద్ర బాగాపోవడంతో రమకి ప్రశాంతంగా అన్పించింది. కాలకృత్యాలు పూర్తయ్యాక భర్త గదివైపు నడిచింది.

ఆడపడుచు స్వరం విన్పిస్తోంది. "నువ్వు ఊరుకొంటే ఇంతేరా! అవ్వ! పిల్ల చిన్నది నిద్రపోయిందనుకో! మీ అత్తగారి పెద్దరికం ఏమైంది? పిల్లను కేకలేసి పంపవద్దూ? గాలి పీలిస్తే బిడ్డ అలిసిపోతుందన్నట్లుగా గారాబం చేశారు. పరిస్థితి మనకి తెలుస్తోంది కదా!"

బావగారు హాస్యంగా అన్నారు. "మీ తమ్ముడి దూకుడుకు మా చెల్లెలు కళ్ళెం వేసింది. అవునా బావా! ఎంత ఎంత ఎడమైతే అంత తీపి కలయిక అని మీరు వినలేదా పాట."

"రమ మంచిదేరా? వాళ్ళ అమ్మే ముద్దు చేసి, మళ్ళీ తగుదునమ్మ అంటూ ఎలా లేపుతాను. పిల్ల అలిసిపోయింది అంటూ వగలు నటించింది. అల్లుడి దగ్గర ఎలా ప్రవర్తించాలో వాళ్ళకి తెలిసినట్లు లేదు. నువ్వేమో పిల్ల అందం చూసి, డబ్బు చూసి, మాకంటే పెద్ద స్థితిలో బతకాలని ప్లాను వేశావు." ప్రభాత్ అక్క నీ సంగతి కూడా నాకు తెలుసురా అన్నట్లు మాట్లాడింది.

ఒక పక్క జరిగిన దానికి చిరాకు, తెల్లారినా తన విషయం చూడని భార్యపై కోపం, మరొకవైపు అక్కగారి దెప్పుళ్ళు, బావ పరిహాసాలు.. వెరశి అతడిని కవ్వించాయి. అంతవరకూ వచ్చి, కిటికీ దగ్గరున్నప్పుడు వాళ్ళ మాటలు విన్న రమ, మాట్లాడకుండా వెనక్కి వెళ్ళిపోయింది.

"ఏం చేయాలి? తన వలన తల్లి మాట పడింది. పాపం. అమ్మ తనని నిద్రలేపలేక, తన అలసట చూడలేక వాళ్ళకి సమాధానం చెప్పింది.

## కొత్తగాలి...

**ఎగిసిపడే తరంగం**
**ప్రేమ**
**ఎగిరిపడే పతంగం**
**స్వేచ్ఛ**

– మేడిచర్ల సూర్య ప్రకాశరావు,
రామరాజులంక, తూ.గో.జిల్లా



రమ తండ్రి దగ్గరకు నడిచింది, "నాన్న గారు! వాళ్ళని టిఫిన్‌కి పిలుద్దాం రండి" అంది. ఆయన అనుసరించారు.

రమ నవ్వుతూ అందరినీ టిఫిన్‌కి పిలిచింది. అవతల మామగారున్నారు. ఏమనగలడు?

రాఘవరావు "అమ్మా! మీరు మొహమాటం లేకుండా ఉండండి. ఈ రోజు ఏదైనా సినిమా చూస్తారా?" అంటూ వాళ్ళతో కలుపుగోలుగా మాట్లాడాడు.

రమ కావాలనే టిఫిన్ల తరువాత భర్తతో తన గదిలో కూర్చుంది. అతడు బింకంగా మేగేజైన్ చూస్తూ కూర్చున్నాడు. రమ డైరీ తీసుకొని వ్రాయసాగింది.

కాసేపు గడిచేసరికి, ఆ నిశ్శబ్దం భరించలేక ప్రభాత్ రమ వెనుకగా వచ్చి చూశాడు.

అది చదివి, అతడు ముగ్ధుడయ్యాడు. 'స్నేహం' మీద రాసిన ఒక అద్భుతమైన గేయం అది. నిజానికి ఆ గేయ కవిత చాలా బావుంది. అతడు దాన్ని చదివి అప్రతిభుడయ్యాడు.

అతడు మృదువుగా అడిగాడు "రమా! నువ్వు కవితలు రాస్తావా?" ఆమె గేయం వైపు చూస్తూ, నెమ్మదిగా అంది "నేను.. నేను రాయడమా? కాదు. హిమ స్నేహం నా చేత వ్రాయించింది. హిమ ఎంతో చక్కగా కవితలు, గేయాలు రాస్తుంది. అది కవయిత్రి, నేను పాఠకురాల్ని. అది గాయని, నేను శ్రోతను."

రమ నిట్టూర్చింది.

"స్నేహంలో ఎన్ని మధురిమలున్నాయో హిమ వలన తెలిశాయి. ప్రేమ పంచడంలో ఉన్న అనుభూతి తన వలన అర్థమైంది.

అతడు వచ్చి ఆమె పక్కన కూర్చున్నాడు. "నా భార్య మంచి రచయిత్రి అంటే నాకు ఎంతో గర్వకారణం. దీన్ని నేను వారపత్రికకు పంపిస్తాను. దాని వలన కీర్తికి కీర్తి, డబ్బుకు డబ్బు"

రమ తెల్లబోయింది. తన హృదయ స్పందనను అతడు ఈ విధంగా చూడగలిగాడా? దానికి ఈ విధంగా రూపం కల్పించదలిచాడా? !

ఆ రాత్రి రమ తనంతట తానే ప్రభాత్ గదిలోకి వెళ్ళింది. తన వలన తల్లి ఎందుకు మాటలు పడాలి? కన్నవారిని మాటలు అన్పించడానికి కాదు తను ఉన్నది. రమను చూసి ప్రభాత్ కినుకతో అడిగాడు "ఏం ఈ రోజు రాణీగారు అమ్మగారి పక్కలో పడుకోరా?"

రమ కొంచెం వేళాకోళంగా, సగం నిజాయితీగా అంది, "నేను అక్కడ పడుకోవడం ఎందుకు? మీ అక్క, మీరు మా వాళ్ళను తిట్టడం ఎందుకు? నాలుగు రోజుల క్రితం వరకు మీరు వేరుగా, నేను వేరుగా పడు

## నల్లవాడి జైలు తప్పలేదు!

జూదం ఆడిన వారిని శిక్షించాలని బ్రిటిష్ ప్రభుత్వం శాసనం చేసింది. ఒకనాడు రక్షక భటులు గాలిబ్ పాచికలు ఆడుతుండగా పట్టుకున్నారు. మూడునెలలు జైల్లో పెట్టారు. విడుదలయ్యాక అతడిని పలకరించేందుకు వచ్చిన ఓ మిత్రుడు, 'గాలిబ్ దేవుని దయవల్ల జైలునుంచి విడుదలైనావు, సంతోషం' అన్నాడు. దానికి గాలిబ్, 'జైలునుంచి విడుదలైన వెధవ ఎవడయ్యా! మొన్నటిదాకా తెల్లవాడి జైల్లో ఉన్నాను. ఇప్పుడు నల్లవాడి జైల్లో ఉన్నాను' అన్నాడు. జైలునుంచి బయటకు రాగానే కాలేమియా అనే మిత్రుని ఒత్తిడివల్ల అతడి ఇంట్లో కొన్నాళ్లు ఉన్నాడు. 'కాలా' అంటే నల్లవాడని అర్థం. తెల్లవాని జైలు తప్పిందిగానీ నల్లవాడింట్లో నిర్బంధంగా ఉంటున్నాను అని హాస్యోక్తి విసిరాడు.



కున్న వాళ్ళమే. అలసట వలన పడుకుంటే అంత రాద్ధాంతం చేయాలా? మన సంగతి విమర్శింపబడాలా? "

ప్రభాత్ సమాధానం చెప్పలేకపో యాడు. రమ తనే అంది. "నిద్రపోతే నన్ను మధ్యలో లేపకండి. నాకు తలనొప్పి వచ్చిందంటే వదలదు"

"క్రొత్త పెళ్ళికూతురు వంద కోరికలతో భర్తను సమీపించాలి, తెలుసా? " అన్నాడు జడలోని పూలను ఆఘ్రాణిస్తూ.

"సెక్స్ అన్నది మనిషికి అవసరమే. కానీ సెక్సే జీవితం కాదు. మన మధ్య మానసిక బంధం పెరగాలి" రమ తన మనసులోని విషయాలను చెప్పడం మొదలుపెట్టింది.

"రమా! పగలు ఎన్ని కబుర్లయినా చెప్పుకోవచ్చునులే, రాత్రి ఏ మగాడూ వృధా చేసుకోడు. బలంగా ఆమెను తనవైపుకు లాక్కొన్నాడతను.




**జా**నకి రాఘవరావు ఒడిలో పడుకుంది. "మీరు.. మీరు ఎంత మంచివారండీ! పెళ్ళైన కొత్తలో నన్ను చిన్నపిల్లలా బుజ్జగించారు. భయాలు పోగొట్టారు. ఒక తండ్రిలా, స్నేహితుడిలా నేను చెప్పే కబుర్లు విన్నారు. నా అంతట నేను భయం లేకుండా దగ్గరయ్యేవరకూ ఎదురు చూశారు" అంది.

రాఘవరావు జానకి తల నిమిరారు. ఆయనకు విషయం చూచాయగా అర్థమైంది. ఆ రోజులూ గుర్తు వచ్చాయి. రాత్రి అయితే చాలు జానకి ముడుచుకుపోయేది. భయపడేది. నెమ్మదిగా ఆమెలోని స్త్రీత్వాన్ని నిద్రలేపవలసి వచ్చేది.

"జానకీ! ఆ రోజుల్లో ఓర్పుపట్టాను కను కనే మంచి, అందాల బొమ్మలాంటి అమ్మాయిని కానుకగా ఇచ్చావు"

"అబ్బాయిని ఇవ్వలేదు కదా! వంశం నిలబెట్టలేదు కదా? " ఆవిడ చిన్నబోయిన మొహంతో అంది.

బావుంది. భగవంతుడు ఎవరిని ప్రసాదిస్తే అదే భాగ్యం అనుకోవాలి. మన అమ్మాయి వందమంది అబ్బాయిల కంటే ఉత్తమురాలు" ఆయన తృప్తిగా అన్నారు.

"మీతో ఒక విషయం చెప్పాలండి. అల్లుడిని కొంత దూకుడు తగ్గించుకోమని ఎవరి చేతనైనా చెప్పించండి. పిల్ల ఇబ్బంది పడుతోంది."

ఆయన మౌనంగా ఉండిపోయారు. సున్నితమైన ఇలాంటి విషయాలు ఎవరు మాత్రం ఎవరితో ఎలా మాట్లాడగలరు?

★ ★ ★

అందరూ భోజనాలు చేస్తున్నారు. జానకి ఓపికగా అన్నీ వడ్డిస్తోంది. ప్రభాత్‌కి ఒకటి ఆశ్చర్యంగా ఉంది. ఆ ఇంట్లో ముగ్గురూ ఒకరికొకరు సహకరించుకొంటారు. ఇంక హిమ తల్లిదండ్రులు ఏపనిలోనైనా మనస్ఫూర్తిగా సహకారమందిస్తారు.

"మామయ్యగారూ!" ప్రభాత్ పిలిచాడు.

ఆయన భోజనం చేయడం ఆపి, అల్లుడివైపు చూశారు.

"రమ, నేను హనీమూన్ వెళదామనుకొంటున్నాం. గోవా వెళ్ళాలని ప్రోగ్రాం."

రమ అర్థం కానిదానిలా భర్తవైపు చూసింది. "సరదాగా ఓ వారం రోజులు

## కొత్తగాలి...

**టెక్నాలజీ పెరిగింది**
**రంగు రంగుల రోజులొచ్చాయి**
**అయితేనేం?**
**వాసన పోగొట్టుకుంటున్నాయ్**

– అయినాల కనకరత్నాచారి,
కొరిశపాడు, ప్రకాశం జిల్లా

వెళ్ళి వద్దామని" అతడు చిరునవ్వుతో పొడిగించాడు.

ఆయన రమ వైపు చూశారు. రమకి సిగ్గనిపించింది. ఇప్పుడే అతడి నోటివెంట తను ఆ విషయం వింటోంది.

రాఘవరావుకి కూతురి మొహంలో భావాలు అర్థమయ్యాయి. అయినా అల్లుడు నోరు విప్పి అడుగుతున్నాడు..

ఆయన మృదువుగా అన్నారు. "దానికేముంది? వెళ్ళండి. ఇప్పుడు కాకపోతే ఎప్పుడు తిరుగుతారు? మీరు ఏర్పాట్లు చేసుకోండి, నేను డబ్బు ఇస్తాను"

ప్రభాత్ అక్క నవ్వుతూ అంది "అల్లుడినే పంపిస్తారా? మమ్మల్ని అందరినీ పంపిస్తారా? "

శాంత కల్పించుకొని నవ్వుతూ అంది "మనం పాతబడిపోయిన జంటలమమ్మా! ఇప్పుడు మనకి హనీమూన్ లేమిటి? " ఇంక ప్రభాత్ అక్క మాట్లాడలేకపోయింది.

"ఇప్పుడు గోవా ఎందుకండీ! హాయిగా అత్తయ్యగారి దగ్గర పది రోజులు, అమ్మా వాళ్ళ దగ్గర పదిరోజులూ ఉండి, మనం బెంగుళూర్ వెళితే బావుంటుంది కదా!" ఆ రాత్రి గదిలో రమ మృదువుగా చెప్పింది.

"మీ నాన్నకు డబ్బు ఖర్చని అంటున్నావా? మనం కొత్త దంపతులం. ఎప్పటి నుండో గోవా చూడాలని అనుకొంటున్నాను. అదీ జంటగా! నీవరుస చూస్తే పాలకొల్లు, ఆముదాలవలస వెళ్ళి మన చుట్టాలను కూడా చూసి వద్దామనేట్లున్నావు" అతడు సీరియస్‌గా చెప్పాడు.

"డబ్బు ఎవరిదన్నది కాదు. అనవసరంగా ఖర్చు ఎందుకు? పైగా నాకు అలాంటి ప్రదేశాలు చూడాలని ఉండదు. ఇద్దరం కలిసి వెళ్ళాలనుకొంటే తిరుపతి కెళ్ళాం. లేదంటే హిమ దగ్గరకి వెళ్ళవచ్చు. గోవాయే అవసరమా? "

భార్య మాటలకు అతడు రుసరుసలాడాడు. ఆ రోజు ఫ్రీగా ఎవరితో మాట్లాడలేదు. రమ కూడా ముభావంగా ఉండిపోయింది. పెళ్ళై వారం దాటకుండానే అభిప్రాయభేదాలా?

రాఘవరావు అల్లుడిని బుజ్జగించాడు "మాకు మీరు తప్ప ఎవరున్నారు? మీరు సరదాగా ఉండటమే కావాలి" అంటూ డబ్బు అందజేశాడు.

"వద్దులెండి మామయ్యగారూ! నేను రమ కోసం అన్నాను. తనకి కొత్త ప్రదేశాలు చూపించాలని ఆశపడ్డాను. మీతో ఉండటమే తనకి ఆనందమట" ప్రభాత్ నిరాసక్తంగా అన్నాడు.

అందరి బలవంతంతో కొత్త దంపతులు హనీమూన్ బయలుదేరారు. రమకి తల్లి దండ్రులను చూస్తే బాధగా అన్పించింది. వాళ్ల ఒంటరితనం ఎలా భరిస్తారో?

హిమ నుండి ఫోను.. "అన్నీ సర్దుకొంటాయి. హాయిగా వెళ్ళి రండి" అంటూ. రమకి జీవితమంటే మొదటిసారి భయం వేసింది.

★ ★ ★

అత్తవారింట్లో ఒకవారం రోజులున్నారు కొత్త దంపతులు హనీమూన్ నుండి వచ్చాక. రమ, ప్రభాత్‌ల కోసం ప్రభాత్ ఫ్రెండ్స్ బెంగుళూరులో ఇల్లు తీసుకొని ఉంచారట.

రమను దింపడానికి అటూ, ఇటూ పెద్దలు బయలుదేరారు. రాఘవరావు

కూతురికి సారె ఘనంగా పెట్టారు. తమ తల్లిదండ్రుల దగ్గరికి వెళ్ళకుండా ఇటు నుండి ఇలాగే వెళ్ళిపోవడం రమకు బాధగా ఉంది.

వాళ్ళు ఇక్కడికే వస్తారు కదా అని ప్రభాత్ అనడంతో వెళ్ళడం అవలేదు. ప్రభాత్ అందరికీ ట్రైన్ రిజర్వేషన్ చేయించాడు. అతడికి డబ్బు ఖర్చు చేయడం పెద్దగా ఇష్టం ఉండదు. అయితే సూది ఇచ్చి దబ్బనం లాగవచ్చునన్నచోట్ల ముందుకి వస్తాడు.

వారం రోజులు పిల్లల దగ్గరుండి, కావలసినవి వారికి సమకూర్చి, రెండు రోజులు చూడవలసినవి చూసి బయలుదేరారు పెద్దవాళ్లు.

బయలుదేరుతూంటే ప్రభాత్ వాళ్ళకి చెప్పాడు, "మావాళ్ళు మీరు నాదృష్టిలో సమానులే! హాయిగా వచ్చి వెళుతుండండి"

రాఘవరావు దంపతులు అల్లుడి సౌజన్యానికి పొంగిపోయారు. ఈ రోజుల్లో ఇంటువంటి మాటలు అల్లుడి నోటివెంట వినడం గొప్పేకదా!

ధర్మారావు కొడుకును చాటుగా తీసికెళ్ళి చెప్పాడు "వాళ్లు ఉత్తములు. ఏనాడూ వాళ్ళను నొప్పించకు. భగవంతుడు నీకు మంచి అవకాశం ఇచ్చాడు. స్వార్థంగా ప్రవర్తించకు. అమ్మాయిని ఏనాడు బాధపెట్టకు."

రమ అత్తమామలను అప్పుడే వెళ్ళవద్దని బతిమాలింది. వాళ్ళు వేరే ఎందుకు ఉండాలి? అందరం కలిసి ఉందామంది. రాఘవరావు చేతిలో పెరిగిన బిడ్డ ఇలాగే ఉదారంగా ఉంటుందని ధర్మారావు అనుకొన్నాడు.

యమునకి కొడుకు దగ్గర ఉండాలని ఉంది. అందుకే భర్తతో అంది, "వాళ్ళు ఒంటరిగా ఉండలేరు. మనమైనా కొన్నాళ్ళు ఉందాం! కోడలికి పని కొత్తకదా!"

భార్య మాటలకు ధర్మారావు నవ్వాడు. యమున అది చూసి ఉడుక్కుంది.

"మన పెళ్ళైనపుడు నువ్వు కూడా కొత్త కోడలివే! కొన్నాళ్ళు వాళ్ళని ఒంటరిగా, హాయిగా ఉండనిద్దాం. తర్వాత ఎప్పుడైనా మనం రావచ్చు, పోవచ్చు"

భర్త మాటలకు ఆవిడ అయిష్టంగానే బయలుదేరింది. రమ భర్తతో వెళ్లి పెద్దలందరికీ బట్టలు తెచ్చింది. ఆ అమ్మాయి ఖర్చుకు ప్రభాత్ గుండెలదిరాయి. బాగా డబ్బు ఖర్చు చేసి అందరికీ మంచివే కొనిపించింది.

"మన కాపురంలో మొదట వచ్చి, వెళుతన్నవారు మీకు, నాకు జన్మనిచ్చిన వాళ్ళు. మనం వాళ్లకు ఏది చేసినా తక్కువే" అంది. మొదటిసారి భార్య పెట్టే ఖర్చును అతడు కాదనలేకపోయాడు.

★ ★ ★

ప్రభాత్‌కి వడ్డన చేసి రమ ఆత్రుతగా చూస్తోంది. వంట తనకు కొత్త. బాగా చెయ్యాలనే కోరిక ఉన్నా, అనుభవం కావాలి కదా!

అన్నం కాస్త ముద్దయింది. వేపుడులో కొద్దిగా ఉప్పు ఎక్కువైంది.

ప్రభాత్ ఉదయం చేసిన వంటకాలు చూసి కనుబొమ్మలు ముడిచాడు.

"అదేమిటి? ఉదయం వేళ వేపుళ్ళు ఎవరూ చేసుకోరు. ముద్దకూరలు వండుకోవాలి. ఏ ఉల్లి కారంకూరో, అల్లం పచ్చిమిర్చి వేసిన కూరో వండితే బావుంటుంది. రాత్రిళ్ళు వేపుడు చేయవచ్చును. గడపదాటిన ఆడది, చిమిడిన అన్నం ఒకటే! విలువ లేనివి. అందం, చదువే కాదు వంటావార్పూ కూడా నేర్చుకోవాలి" అంటూ క్లాసు పీకాడు.

రమ చిన్నబుచ్చుకుంది. ఏమనడానికీ మనసు ఒప్పుకోలేదు.

"అయితే ఈ పూట అర్ధాకలి భోజనం







అన్నమాట. బావుంది. ఇలాగే వంట ఉంటే దానంతట అదే డైటింగ్" అంటూ లేచి చెయ్యి కడుగుకొన్నాడు.

రమ సాయంత్రం తల్లికి ఫోను చేసింది. కూతురు ఫోను చేసి వంకాయకూర, కాయ పళంగా వండటం గూర్చి అడుగుతూంటే జానకి మనసు చలించింది.

తల్లి నుండి రెస్పాన్స్ లేకపోయేటప్పటికి రమ తనే అంది "అమ్మా! భర్తకి అన్నం పెట్టే వేళలో తల్లిలాగ పెట్టాలని చెప్పావు. మరి రుచికరమైన వంటకాలతో భర్త కడుపునింపే బాధ్యత నీ పిల్లకి ఉంది కదా! ప్రపంచాన్ని చూపించిన మొదటి గురువు నువ్వు. నిన్ను అడగటానికి సిగ్గు పడటం లేదమ్మా!"

జానకి వెంటనే కంటినీరు తడుచుకుని, ఎలాగ చేయాలో చెప్పింది. ఆవిడ ఎంతబాగా చెప్పిందంటే ఎంతకూరకి ఎంత ఉప్పు, మిరపకాయలు, పసుపుపొడి, జీలకర్ర, ధనియాలు వేయాలో వివరంగా చెప్పినందువలన రమ అవలీలగా వంట చేయసాగింది.

అనేక రకాలుగా కూరలు వండటం, ప్రతిరోజు ఏదో ఒక పచ్చడి చేయడం అన్నీ బాగా వచ్చాయి.

పప్పు, కూర, పచ్చడి, చారు, సాంబారు చేసి వడ్డిస్తున్న భార్యను ప్రభాత్ గాబ రాగా చూశాడు.

"బాపురే! ఇన్ని ఐటెమ్సా? ఇల్లు గుల్ల యిపోదా? " సగం హాస్యంగా అన్నట్లు అన్నాడు.

"ఇవి మనం తినేందుకు వండుకొన్నవి. వంట నాకు కొత్త కనుక రెండు మూడు చేస్తే, ఒకటి పాడైనా ఫర్వాలేదు. అయినా మనం సంపాదించుకుంటున్నది కడుపు నిండా తినడానికి, కట్టుకోవడానికి కదా! ఇందులో గుల్లయిపోయేంత దుబారా ఏముంది? మీకు ఒకవేళ సంసారంలో సహాయం కావాలనుకుంటే నేనూ జాబ్ చేస్తాను" స్థిరంగా సమాధానం చెప్పింది రమ.

రమ మాటలకు ప్రభాత్ కంగారు పడ్డాడు. ఇంత అందమైన భార్య ఉద్యోగానికి వెళితే ఎలా? పదిమంది కళ్ళూ ఆమె మీదే ఉండవూ? అయినా ఉద్యోగం చేసే భార్య తన మాటకు గౌరవం ఇస్తుందా?

"అదికాదు రమా! మనకంటూ సంపాదన ఉన్నప్పుడు, దానిలోనే దాచుకోవాలి. పోనీ ఒక ఐటమ్ తగ్గించు. పప్పు, కూర, చారు ఒకరోజు, పచ్చడి, కూర, పులుసు ఒకరోజు.. ఇలాగ మూడుకి రా! అయినా ఆడవాళ్ళకి పొదుపు అతి సులభంగా వస్తుంది. నీచేత ఉద్యోగం చేయిస్తే మావగారు ఊరుకొంటారా" అన్నాడు.

అప్పటికి ఆ సందర్భం ముగిసినా, ప్రభాత్ తను చెప్పదలుచుకొన్నది ఎప్పుడో ఒకప్పుడు చెపుతూనే ఉంటాడు. రమకి చెప్పించుకోవడం విసుగు. మగవాడు అన్నింటిలో ఎందుకు వేలు పెట్టాలి?

నెల రోజులు గడిచే సరికి ప్రభాత్ బాగా రమకి అర్థమయ్యాడు. ఖర్చుకి అతడు ఇష్టపడడు. అలాగని తిండి ఇష్టమే. అది ఎవరైనా పెడితే ఎన్ని ఐటమ్స్ ఉన్నా ఫర్వాలేదు.

రమ రిజర్వుడుగా ఉంటోంది. అతడు ఇరుగు పొరుగులతో కలుపుగోలుగా ఉంటాడు. వారు ఏ పెరుగు గారెలో, పులిహోరో ఇస్తే ఎంతో గొప్పగా పొగుడుతాడు. వాళ్లు ఆ పొగడ్తలకి ఉబ్బి తబ్బిబ్బవుతారు. "అమ్మాయి ప్రభాత్‌కి ఈ చుక్క-కూర పచ్చడి రుచి చూపించు. తిన్నాక ఆంటీ ఎంత బాగా చేశారు అంటాడు" అని ఒకరు, "పలావ్ చేశాను అబ్బాయికి పెట్టి తిను" అంటూ మరొకరు తలుపుతట్టి ఇస్తారు.

రమకి ఇబ్బందిగా ఉంటోంది. అఫ్

కోర్సు, ఇరుగు పొరుగులతో స్నేహం అవసరమే. అలాగని వాళ్ళు ఎప్పుడూ ఇవ్వడం, మనం పుచ్చుకోవడం ఏం బావుంటుంది? వాళ్ళకి చేసి ఇచ్చేటంత నేర్పు వంటలో తనకి ఇంకా లేదు.

ప్రభాత్ ఉదయం పూట అపార్టుమెంట్‌ల వాళ్ళని ప్రత్యేకంగా పలకరిస్తాడు. అబ్బాయి కలుపుగోలు మనిషని వాళ్ళు పొంగిపోతారు. రమకి పెద్దవాళ్ళంటే గౌరవమే. ఎంతవరకు అవసరమో అంతవరకూ ఉంటుంది. తన ప్రపంచం తనదను కొంటుంది. ఒక్కొక్కసారి ఈ స్నేహాలు ఎంత తలనొప్పిగా మారతాయో రమకి తెలుసు.

మనకి నిద్ర వస్తుంది. వాళ్ళు వెళ్ళరు. వెళ్ళిపోమని చెప్పగలమా? మన పనులు మనకి ఉంటాయి. వాళ్ళతో ప్రతీ రోజు బాతాఖానీ వేయగలమా?

"రమా! వాళ్లందరి అవసరం నాకంటే నీకే ఎక్కువ కావాలి. నేను ఉదయం పది గంటలకు వెళితే రాత్రి పదివరకూ రాను. ఒక్కదానివే ఉండాలి. వాళ్ళతో కలిసి ఉంటే ఒంటరితనం ఉండదు. అన్నీ మనం వండుకోవడమూ ఉండదు. వాళ్ళే రుచి చూపిస్తారు." ప్రభాత్ గొప్పగా అన్నాడు.

"ఎదుటి వారి బలహీనతతో పబ్బంగడుపుకోవడం మంచిదా? మనం కూడా ఇదే స్థితిలో ఉన్నప్పుడే వాటికర్థం ఉంటుంది"

"నీవన్నీ వితండవాదాలు. స్నేహంలో ఇటువంటివి ఉండవు"అంటాడు.

దానికి రమ అంటుంది, "స్నేహాన్ని వ్యాపార దృష్టితో చూడరాదు"

రమ ఒకసారి మైదాపిండితో ఆలూ బజ్జీలు వేసింది. వేరుసెనగ పలుకులు చెట్నీ చేసింది. వాటిని తీసుకెళ్లి ఇరుగు, పొరుగులకు ఇచ్చింది. వాళ్ళు శెనగపిండి తోనే బజ్జీలు చేస్తారు. 'ఇవి కొత్తగా ఉన్నాయి. కరకరలాడుతున్నాయి' అంటూ రమను మెచ్చుకున్నారు.

సాయంత్రం ప్రభాత్ వచ్చాక పెట్టింది. అతడూ తింటూ మెచ్చుకున్నాడు.

రమ నవ్వుతూ అంది, "ఇవాళ మీ కోరిక తీర్చాను" అతడికి అర్థమవలేదు.

## మనమూ తంతామా?

గాలిబ్ 'బుర్హాన్ ఖాతే' నిఘంటువులోని లోపాలను చూపుతూ 'ఖాతే బుర్హాన్' అనే పుస్తకం రాశాడు. అతని పాండిత్యానికి జనులు ఆశ్చర్యపడ్డారు. ఇది సహించలేని ఒక తను 'ఖాతే ఖాతే' అనే పేరుతో గాలిబ్‌ను తీవ్రంగా ఖండిస్తూ పుస్తకం రాశాడు. అది చూసి మిత్రులు, 'అతనెవరో నిన్ను నోటికొచ్చినట్లు విమర్శిస్తుంటే ఊరుకుంటావేం? జవాబివ్వు' అన్నారు. అప్పుడు గాలిబ్ 'గాడిద మనల్ని తంతే మనమూ గాడిదను తంతామా? పోనిద్దురూ!' అని సరసంగా చెప్పాడు.



బజ్జీలు రుచిగా చేసి పెట్టాననుకొంటో ందనుకొన్నాడు. రమ అంది, "మన వాళ్ళందరికీ మన బజ్జీలు రుచి చూపించాను"

ప్రభాత్ బజ్జీలు తింటున్న వాడల్లా లేచి, నూనె టిన్ చూశాడు. అది చాలా తగ్గి ఉంది. అతడి గుండె గుభేలుమంది. నెల రోజులు రావలసిన నూనె ఖర్చయిపోయింది.

**కొత్తగాలి...**

**పెదవి అందితే**
**అమృత పాత్ర**
**పదవి అందితే**
**అక్షయ పాత్ర**

—వోలేటి శ్రీనివాసరావు, విజయనగరం

మర్నాడు ఇరుగు పొరుగు రమ బజ్జీలను అతడి దగ్గరే మెచ్చుకున్నారు. వాళ్ళు మాట్లాడుతున్నా అతడికి నూనె గుర్తు వచ్చింది.

రమకి అతడి పనులు ఇబ్బంది కలిగిస్తున్నాయి. వారం అయ్యేటప్పటికల్లా బియ్యం డబ్బా, సరుకుల డబ్బాలు చెక్ చేస్తాడు. అది ఆమెకు నచ్చదు. సరుకులు తనేమైనా పనిమనిషికి, ఇతరులకు అమ్మేస్తుందా?

ఒకసారి అనేసింది. "చూడండి. మీరలా చూడటం నాపై అనుమానంతోనా? అలాగైతే నాకు కష్టంగా ఉంటుంది".

అతను ఉలిక్కి పడ్డాడు. "బావుంది రమా! మనకు మనమే పెద్దలం. ఎక్కడ ఖర్చు పెరుగుతోందో, ఎలా తగ్గించుకోవాలో తెలుసుకోవాలి కదా!" అన్నాడు. దాని బదులు సరుకులు అయిపోతే నువ్వు ఇబ్బంది పడతావు. అందుకు తేవడానికి చూస్తున్నాను అంటే బావుంటుంది కదా!

హిమ ప్రతిరోజూ ఫోను చేస్తుంది. రమ మొదట్లో ఎక్కువగా చేసేది. కార్డు వేయించుకోవడం శ్రమ. అతడు ఒకసారి ఆశ్చర్యంగా అన్నాడు. "బాప్‌రే! నూట పన్నెండు రూపాయల కార్డు అప్పుడే అయిపోయిందా? అన్ని విషయాలు ఏముంటాయి? "

రమ చిరు కోపంతో అంది. "మేమిద్దరం విడిగా ఉండటమే విశేషం. అమ్మా, నాన్నలకు దూరంగా ఉండటం విశేషం."

రమకి సంబంధించిన విషయాలు అతడికి ఎప్పుడూ ఆశ్చర్యమే. అతడు తల్లిదండ్రులతో వారానికి ఒకసారి మాట్లాడతాడు. అన్నయ్య, అక్కలైతే వాళ్లే చేసి మాట్లాడాలి తప్ప అతడు అతి తక్కువగా చేస్తాడు. ఇంటర్‌నెట్‌లో అన్నతో మాట్లాడతాడు.

అన్ని సంబంధాలూ డబ్బుకి ముడి పెట్టడం అన్యాయమనుకొంటుంది రమ. ఆమె బయటకు వెళ్ళి కార్డు వేయించుకోవడం మొదలుపెట్టింది.

హిమతో మాటలలో ఒకసారి ఈ ప్రస్తావన వచ్చింది.

"హిమా! ఆయన గురించి ఎన్ని చెప్పమంటావు? పువ్వుల దగ్గర్నుండి, కిళ్ళీ దగ్గర్నుండీ, సెల్ రీచార్జి కార్డు నుండీ అన్నీ లెక్కగా ఉండాలంటారు. అనడం కాదు లెక్కగా ఉంచుతారు. పోనీ! డబ్బు ఇబ్బందా అంటే అదీ లేదు. బెంబేలు పడేలాగ కబుర్లు చెబుతారు. నేను ఉద్యోగం చేస్తానంటే వినరు. ఉద్యోగం చేసే ఆడది చెప్పిన మాట వినదని నమ్మకమేమో? "

రమ మాటలలో వ్యథ, అవమానం కనిపించాయి. హిమ నవ్వుతూ అంది. "అయితే ప్రభాత్‌గారు 'ఎదురింటి మొగుడు - పక్కింటి పెళ్లాం'లో రాజేంద్ర ప్రసాద్ టైపు అన్నమాట."

రమని బాధలో నుండి హాస్యంలోకి తేవాలనుకొంది. రమ అందుకుంది "అన్న మాట కాదు. ఉన్న మాటే".

హిమ నవ్వేసింది. "ఏయ్ బుద్ధూ! నేనున్నాను. అమ్మ, నాన్నగారు ఉన్నారు. ఊరికే దిగులు పడకు".

వారం రోజులు గడిచేసరికి హిమబిందు గ్రూప్ కనెక్షన్ ఆఫర్ తీసుకుంది. రమకు, తనకు, తన తల్లిదండ్రులకు, రమ తల్లిదండ్రులకు, సంజయ్‌కు కలిపి తీసుకుంది.

తర్వాత రమకు ఫోను చేసి విషయం

చెప్పింది. రమ కళ్లల్లో చిన్న కన్నీటి తెర.

ప్రభాత్ ఆఫీసు నుండి రాగానే వేడి నీళ్లతో స్నానం చేస్తాడు. తర్వాత భోజనం. భోజనంలో ఫ్రెష్‌గా కూర కావాలి. అన్నం, ఐటమ్స్ వేడిగా ఉండాలం టారు.

రమ అతడు వచ్చే అరగంట ముందు వండుతుంది. భోజనాలయ్యాక రమ కాసేపు హిమతో, తల్లిదండ్రులతో ఫోను మాట్లాడుతుంది. అతడు టీవీ చూస్తూ, రమ మొహంలో సంతోషం గమనిస్తూ ఉంటాడు. అతడు టీవీ ఆఫ్ చేశాడంటే, రమ ఫోను పెట్టేయాల్సిందే!

ఒకసారి జరిగిన గొడవ తలచుకొంటే రమ ఒళ్లు సిగ్గుతో చస్తుంది.

"ఎంతసేపు ఆ ఫోను మాట్లాడటం. నేను ఇటు వైపు కోరికతో రగిలిపోతూంటే అర్థమవదా? నీ అంతట నువ్వు దగ్గరికి రావు. నేను వచ్చానన్న ఆలోచనైనా ఉండదా? "

అతడు గట్టిగా మాట్లాడుతుంటే పక్క నున్న వాళ్లు వింటారు కదా అని బాధ పడింది.

కోరికకి అర్థం ఉందా? రోజూ అదొక దినచర్యలాగ అతడు ప్రవర్తించడం ఆమెకు కష్టంగా ఉంది. మధ్యాహ్న వేళ పడుకో అంటాడు. రాత్రి అంతసేపు మెలకువగా ఎందుకుండాలి? ఏదైనా 'అతి' పనికి రాదు. అతడైతే ఉదయం ఎనిమిది వరకూ లేవడు.

భర్త వలన రమలో సెక్స్ లైఫ్ అంటే ఏవగింపు, భయం కలుగుతోంది. సహ జంగా గడపవలసిన వైవాహిక జీవితం మొక్కుబడిలా ఉంటోంది.

"నిన్ను ఎవరికైనా డాక్టరుకి చూపిం చాలి. ఎప్పుడూ మందకొడిగా ఉంటావు. ఈ వయసులో ఉండవలసిన కోరికలు ఎందుకుండవు? పోనీ సిగ్గనుకొందాం. ఎన్ని రోజులు ఈ సిగ్గు? మా ఫ్రెండ్స్‌కి చెబితే నవ్వుతున్నారు" అతడు ఆరోపణగా అన్నాడు.

"మన పడక గది విషయాలు మీరు ఫ్రెండ్స్‌కి చెపుతారా? " ఆమె వివర్ణ వద నంతో అంది.

"ఇందులో వింత ఏముంది? నువ్వు మీ హిమకి చెప్పడం లేదా? " అతడు తేలికగా అన్నాడు.

"హిమ, మీ స్నేహితులు ఒకటేనా? ఇన్నాళ్లు సంసార జీవితంలో గమనించాను మీకు ప్రాణ స్నేహితులున్నారా? మీరు స్నేహం కూడా అవసరానికి చేస్తారు. ఏం చెప్పారు? నా పెళ్ళాం తనంతట తాను నన్ను ముద్దు పెట్టుకోదు. నన్ను కౌగలిం చుకోదు. నేను ఆడమన్నట్లు ఆడటానికి వెనుకాడుతుంది. ఇవన్నీ చెప్పడానికి మీకు అభిమానం అడ్డు రాలేదా? ఛీ.. ఛీ..."

అంటూ పక్కగదిలోకి వెళ్ళిపోయి పడుకుం దామె. ఆమెకు ఏడుపు వచ్చింది. ఏమిటి ఇతడి స్వభావం? మనసులో దాచుకోవల సిన మధురమైన కాపురాన్ని రట్టు చేస్తాడా?

ఎలా.. ఎలా తనలో స్పందన కలుగు తుంది? లోకమంతా పరుచుకొన్న తెల్లటి వెన్నెలను చూడడు. చల్లదనాన్ని కురిపించే జాబిలిని, దాని సోయగాన్ని పట్టించుకోనీ యడు. కాసేపు ఆరుబయట తిరగడానికి ఉండదు. సువాసనలు వెదజల్లే సన్నజా జుల అందం, సువాసన పరికించడు. పరి కించనీయడు.

ఉధృతమైన సమాగమమే కానీ చిరు స్పర్శలు, చిరు సంభాషణలు ఉండవు. జీవితం అంటే అనుభూతుల పూల గుచ్ఛం కాదా? చిరుజల్లుల్లాంటి ప్రేమ సన్నివేశాలు అనుబంధాన్ని పెంచవా?

అతడినీ, అతడి అలవాట్లని ప్రేమించడా నికే తనూ సిద్ధపడుతోంది. అది కూడా







అర్థం చేసుకోకపోతే ఎలా? కాసేపు తన ఫ్రెండ్స్ గురించో అతడి తల్లిదండ్రుల గురించో, తన తల్లి దండ్రుల గురించో మాట్లాడితే ఎంత బావుంటుంది. తన ఆలోచనలు పంచుకోడు. తనతో ఎంత సేపు పక్క పంచుకుంటాడు.

"కంపెనీలో మీరు చేసే వర్కు గురించి చెప్పండి" అంటే "ఇంట్లో కూడా ఉద్యోగ విషయమేనా? టీమ్ లీడర్‌గా పనులు నీకు తెలిసినవే కదా? " అంటారు.

భార్యా భర్తలిద్దరికీ కామన్ ఇంట్రస్టులు ఉండాలని రమకి మొదటిసారిగా అర్థమైంది.

ప్రభాత్ రెండు గంటలు గడిచేసరికి రమ పడుకున్న రూమ్‌కి వచ్చాడు.

"ఎంతసేపు అలాగ ఒంటరిగా పడుకుని బాధ పడతావు. నా ఫ్రెండ్స్ కూడా వాళ్ల విషయాలు మాట్లాడతారు. అదొక సరదా. ఈసారి నుండి మాట్లాడను కదా! రా! నాకు ఒంటరిగా పడుకోవడానికి చిరాకుగా ఉంది."

రమ మనసు అతడి మాటలను ఎండగడుతోంది. తను లేకపోతే నిద్ర రావడం లేదని వచ్చాడా? "నువ్వు బాధ పడితే చూడలేనురా!" అంటే తను ఆనందంగా వెళ్ళదా? ఏం మనిషి? అతడిది అహంకారమా? తెలియక పోవడమా?

★ ★ ★

రమ బేగ్స్ వెతుక్కుంటోంది. లోపల ఉంచిన ఎనిమిది వందల రూపాయలు కనబడలేదు. నిన్న ఉదయం ఉన్నాయి. పని మనిషి తీసిందా?

రమ బేగ్ లోని వస్తువులు బయట పెట్టి అన్ని అరలూ వెతకసాగింది.

"రమా! నాకు వేడి నీళ్లు పెట్టు" ప్రభాత్ పిలిచాడు.

"ఒకసారి ఉండండి! నా డబ్బులు కనబడటం లేదు. వెదుక్కొని పెడతాను" రమ చెప్పింది.

"ఏం డబ్బులు? " ప్రభాత్ అడిగాడు.

"ఐదు వందల రూపాయల నోటు, మూడు వంద రూపాయలు ఉండాలి. అవి కనబడటం లేదు. చిల్లర ఉంది" రమ చెప్పింది.

ప్రభాత్ ఒక్క క్షణం ఆగాడు. తర్వాత తాపీగా చెప్పాడు. "అవా... నేను తీశాను. పని మనిషికి జీతం ఇవ్వడానికి నా దగ్గర చిల్లర లేక తీశాను. తీసి ఇచ్చాను" చెప్పాడు.

నిన్ననగా డబ్బులు తీసిన మనిషి తనకి ఈ రోజుకి కూడా చెప్పలేదు. పైగా పని మనిషికి ఇచ్చారుట. ఇప్పుడు కూడా తను అడిగితే చెపుతున్నాడు. ఏం మనిషి?

డబ్బు తీసింది ఒకరైతే, అనుమానం మరొకరి మీద పడుతుంది. ఆ మాత్రం తెలియదా?

"మా ఇంట్లో ఎవరం ఒకరికి చెప్పకుండా ఒకరం డబ్బు తీయం. అమ్మ నా దగ్గర, నాన్నగారి దగ్గర అవసరమై తీసుకుంటే చెపుతుంది. నేనైనా నాన్నగారి జేబులోవి తీసుకోవాలంటే ముందుగా అడుగుతాను. అలాంటిది మీరిలా చెయ్యడమేమిటి? " రమ ఈసారి ఊరుకోలేదు.

"ఏమిటీ? నీ పనిమనిషికే జీతం ఇవ్వడానికి తీశాను. తప్పా? బట్టలైనా ఉతుక్కోవు. ఖాళీగా ఇంట్లో ఉండి ఏం చేస్తావు? పని చేస్తూ ఉంటే ఒళ్లు కూడా రాదు"

ప్రభాత్‌కి మాట్లాడటం తెలిదనుకోవాలా? లేక కావాలని అంటాడనుకోవాలా?

రమ సూటిగానే మాట్లాడింది. "అయితే నా కోసం పని చేస్తోంది కాబట్టి పనిమనిషి జీతం నేను ఇవ్వాలి. మరి నా కడుపు నిండటానికి అన్నం తింటున్నాను

కనుక బియ్యం సరుకులు కూడా నేనే వేయించాలా? మరి అంతదానికి ప్రభాత్‌గారు నన్ను ఎందుకు వివాహం చేసుకొన్నారో తెలుసుకోవచ్చునా?"

"అంత వెటకారం వద్దు. భార్య డబ్బు భర్త ముట్టుకోకూడదని నాకు తెలియదు. నన్ను డబ్బుకోసం అడగటమెందుకు? ఆయనే తీసి ఉంటారులే అనుకోవచ్చు కదా!" ప్రభాత్ కూడా ఏమీ తీసిపోలేదు.

రమ చెప్పింది "అలాగైతే భర్త డబ్బు కూడా భార్య తీయవచ్చును. రేపటినుండి జేబులో మీ డబ్బు తీసికొంటూ ఉంటాను గుర్తుంచుకోండి"

ప్రభాత్ విసురుగా వీధిలోకి వెళ్లిపోయాడు. చేసింది తప్పు పైగా కోపం ఛ... ఎటువంటి వ్యక్తికి భార్యనయ్యాను? రమ చిరాకు పడింది.

సాయంత్రం తండ్రి, తల్లి ఫోను చేశారు. రమ భోజనం చేయలేదు. నీరసంగా పడుకుని మేగజైన్ చదువుకుంటోంది.

రాఘవరావు కుశల ప్రశ్నలయ్యాక అసలు విషయం ఎత్తారు. ఆయనకి ప్రభాత్ ఫోన్ చేశాడట. భార్య స్వభావం అర్థమవడం లేదని, కాస్త మందలించమని చెప్పాడట. జానకి ఊరుకోలేదట. భర్త చేతిలోని సెల్ తీసికొని గట్టిగా చెప్పిందట "మా అమ్మాయి ఎప్పుడూ హుందాగానే ప్రవర్తిస్తుంది. ఏ మాటలతో, ఏ చేతలతో దాని మనసు నొప్పించారు? ఇన్నేళ్లు పెంచిన మా అమ్మాయి గురించి మాకు తెలియదా?" అని నిలదీసిందట.

రమకి తలవంచుకునే పరిస్థితి ఏర్పడింది. విషయం తల్లిదండ్రులకి చెప్పవలసి వచ్చింది.

"అమ్మా! వదిలేయమ్మా! నా గురించి ఇంక మీరు మాటలు పడవద్దు. నేను చూసుకుంటాను కదా!" అంది.

సంజయ్ నుండి ఫోన్లు వస్తున్నాయి. అతడి సరదా కబుర్లు వింటే ఎటువంటి బాధనైనా మరిచిపోవచ్చును.

ఎదురింటి ఆమె వచ్చి "మంచి పాట కచేరి ఉంది వస్తారా?" అడిగింది. రమ పక్కింటివాళ్లకు తాళమిచ్చి ఆమెతో వెళ్లింది. ఏదో మార్పు కావాలనిపిస్తోంది.

ప్రభాత్ ఇంటికి వచ్చి, ఎదురుగుండా తాళం కప్ప చూసి ఆశ్చర్యపోయాడు. పెళ్లైన ఇన్ని నెలలలో రమ ఎక్కడికి వెళ్ల లేదు. కొంపదీసి పుట్టింటికి వెళ్లిపోయిందా? చెప్పకుండా వెళుతుందా? ఏమో? ఉదయం గొడవపడ్డారు. దాని ప్రభావం ఏమో?

ఈలోపు పక్కింటి అబ్బాయి "అక్క తాళం ఇచ్చారు" అంటూ అందించాడు. రమ తొమ్మిదిగంటలైనా రాక పోయేసరికి అతడు వడ్డించుకొని తిన్నాడు.

పది గంటలుదాటాక రమ వచ్చింది. సభ చివరివరకూ ఉండి వాళ్లిద్దరూ రావడం వలన ఆ సమయమైంది. భర్త చక్కగా పెట్టుకుని తిన్నాడని గిన్నెలు చూస్తే తెలిసింది. రమ మౌనంగా భోంచేసి తనగదిలోకి వెళ్లి పడుకుంది.

ప్రభాత్ పళ్లు నూరుకున్నాడు. వచ్చి తనను పలకరించలేదు. బయటకి వెళ్లానని విషయాలు చెప్పలేదు. తను తిన్నాడో, లేదో చూడలేదు.

రమ పుట్టింటికి వెళదామని ఏటిఎంకి వెళ్లి చూస్తే తన ఎకౌంట్‌లో తండ్రి మళ్లీ డబ్బు వేశారు. తన ఎకౌంట్‌లో లక్షవ

## కొత్తగాలి...

'వయాగ్రా' సృష్టికర్త(92)
మరణించాడు
'వయోగ్రా' కనిపెడితే
వందేళ్లుండేవాడేమో!

–అయినాల కనకరత్నాచారి,
కొరిశపాడు, ప్రకాశం జిల్లా



రకూ డబ్బుంది. మళ్లీ తండ్రి ఎందుకు వేయడం?

వారికి తన బాధ్యత ఇంకా తప్పలేద న్నట్లు ఆ డబ్బు సంకేతం ఇస్తోంది. ఎలా.. కుటుంబ విషయాలు ఎలా దారికి తెచ్చుకోవాలి? తల్లిదండ్రుల మనసు సున్నితం. తను బాధపడితే వారు చూడ లేరు, ఈయన చూస్తే ఈదారి.




హిమబిందు సీటు దగ్గరకి టీమ్‌లీడర్ వంశీకృష్ణ వచ్చాడు. ప్రాజెక్టు గురించి మాట్లాడి వెళ్లాడు. హిమబిందుకి విసుగు. అతడు ప్రాజెక్టు లీడర్. అటెండర్‌ను పంపి తనని రమ్మనవచ్చుకదా? లేదా కాల్ చేయవచ్చును. అవేవి చేయడు. తిన్నగా సీటు దగ్గరకు వచ్చి వర్క్ చూస్తాడు. ఏదైనా సూచనలుంటే చెపుతాడు. తను ఎలాగూ ఆ అవకాశం ఇవ్వదు. తన పని తను చేస్తుంది.

అతడు తన సుపీరియర్. తను గౌరవం ఇవ్వాలి. ఇస్తుంది. దానికేం గొడవ లేదు. కానీ అతడి కళ్ళు తనకు ఏదో సందేశం పంపడానికి ప్రయత్నిస్తుంటాయి.

తను సింధూరపు రంగు డ్రెస్ వేసికొని వచ్చినపుడు కళ్ళలా అప్పగించి చూస్తూ ఉండిపోయాడు. అతడి ఫ్రెండ్స్ అట పట్టించారు.

తన తోటి ఉద్యోగిని నందిని అంటుంది "బిందూ! నువ్వంటే మన సార్‌కి ఆరా ధన.. ప్రేమ..."

తను వెంటనే అనేస్తుంది "స్టాప్.. స్టాప్.. మన ఒంటికి ప్రేమ, దోమ సరిప డవు. దాని గురించి చెప్పకు"

"బిందు" అని నందిని పిలిచినపుడు హిమకి రమ గుర్తు వచ్చేది. "హిమా!" అంటూ ఎంత మార్దవంగా పిలిచేది.

మొదటిరోజు కలిసినప్పటి నుండి నందిని ఆత్మీయంగానే ఉంది. నిజానికి నందిని ఒట్టి పిరికిది. ఎలా చదివిందో, ఎలా ఉద్యోగంలో చేరిందో అదొక పజిల్.

"నేను ఉద్యోగం చేయడం మా బావకి ఇష్టం. నాలో అమాయకత్వం, భయం పోతాయట. అందరిలాగ ఏక్టివ్‌గా ఉంటా నట. అందుకని నాకు ఈ శిక్ష" అంటుంది.

నందిని బావ లండన్ వెళ్ళాడు. రెండే ళ్ళలో వస్తాడు. అప్పుడు వాళ్ళ పెళ్ళి. నందినిని కదిపితే అన్నీ బావ కబుర్లే.

ఆఫీసులో అందరికీ నందిని పెళ్ళి గురించి, బావ గురించి తెలుసు. అందు కని ఆట పట్టిస్తారు. అయితే వాటి వెనుక అభిమానం, స్నేహం ఉంటాయి.

"హిమా" అని నందిని పిలవబోతే హిమ ఒప్పుకోలేదు.

"ప్లీజ్, నన్ను అలా పిలవ వద్దు" కచ్చి తంగా చెప్పింది. అప్పుడే ఉద్యోగంలో చేరిన వ్యక్తి, మొదటిరోజున తనతో పని చేసే వ్యక్తితో అలా చెప్పగలగడం సాహ సమే. అంతా అదే అనుకొన్నారు.

"ఎందుకని పిలవకూడదు? మీ పేరు హిమబిందు. అందులోని అక్షరాలే కదా పిలిచింది" మరొకరు నిలదీశారు.

హిమ కళ్ళు సజలాలయ్యాయి. గొంతు రుద్ధమైంది, "నా ప్రాణ మిత్రురాలు రమ మాత్రమే అలా పిలుస్తుంది. పిలవాలి. ఆ పిలుపు మా రమది"

నందినికి హిమబిందు మనసు అర్థమైంది.

"బిందూ... మీ ఫ్రెండ్.. అర్థోక్తితో ఆగిపోయింది. "ఉంది" బిందు చిరునవ్వు అరువు తెచ్చుకుంది. "ఆమెకు కొత్తగా పెళ్లైంది. తను బెంగుళూర్, నేనిక్కడ" హిమ గొంతులో ఫ్రెండ్ ఎడబాటు వలన పడుతున్న వ్యథ.

"స్త్రీ మనసు పుష్పకవిమానం వంటిదంటారు. నిజమే. ప్రేమించే హృదయం ఆమె సొత్తు. కన్నవారిని, చెలిమి చేసిన వారిని, కట్టుకున్నవారిని, కన్నబిడ్డలను, మనవలను, సమాజాన్ని అందరినీ ప్రేమిస్తూనే ఉంటుంది.

"వంశీకృష్ణ బావుంటారు. మంచి ఉద్యోగం. త్వరలో స్టేట్స్ వెళతారు. మరి ఆయన మనసు అర్థం చేసుకోవచ్చు కదా!" నందిని అంటే హిమ ఒంటికాలి మీద లేచింది.

పెళ్లంటే చిరాకు. రమ పెళ్ళి చేసుకొని ఏం సుఖపడుతోంది? పెళ్లైతే ఇంతే! అయ్యేవరకూ వంద ఫోన్లు చేశాడు. భార్య అయ్యేసరికి చులకన. ఇవన్నీ చెప్పగలదా?

"అసలే నాకు పెళ్ళంటే పడదు. మా రమ గురించి ఆలోచిస్తే అసలు వద్దు" హిమబిందు ఖరాకండిగా అంటుంది.

వంశీకృష్ణతో ఫ్రెండ్ అంటున్నాడు "అమ్మాయికి కాస్త కూడ సౌమ్యం లేదురా! చాలా నిర్లక్ష్యంగా, నిర్మోహమాటంగా ఉంటుంది. అక్కడ ప్రేమ అనే పూవులు పుష్పించవు"

మరొకరు "అటువంటి కత్తి ఎందుకురా నాయనా? మనని డామినేట్ చేసే తెలివి తేటలు. ఆమెను చూస్తే సాటి ఉద్యోగిని అన్న భావం తప్పితే ఏదీ కలగనీయదు"

వంశీకృష్ణ ఏమీ మాట్లాడడు. హిమబిందు.. చూస్తే తనలో ప్రేమ ఉవ్వెత్తున పాతాళగంగలా లేస్తుంది.

## కొత్తగాలి...

**బాక్సైట్ పులులు**
**సెజ్ సింహాలూ మింగడంతో**
**ఇప్పుడెన్నో గ్రామాలు**
**మటుమాయం!**

– మాధవీ సనారా, అనకాపల్లి

ఆమె మాట్లాడనక్కరలేదు. తనవైపు చూడనక్కరలేదు. ఆ చైతన్య స్రవంతిని తను చూస్తే చాలు. ఒక ఆనందం, ఒక అనుభూతి, ఒక తృప్తి కలుగుతాయి.

"ప్రేమ".. దీనిలో ఇంత శక్తి, ఆకర్షణ ఉన్నాయనీ హిమబిందుని చూశాకే తెలిసింది. ప్రేమ అంటే 'హృదయ స్పందన' అన్నమాట. తన ప్రేమను తనలో దాచుకోవడం తెలియడం లేదు.

★ ★ ★

రాఘవరావుకు, జానకికి బెంగగా ఉంది. రమను చూడకుండా ఉండలేమన్పిస్తోంది. అందుకే ప్రభాత్‌కి ఫోను చేశారు రమను తీసికొని రమ్మనమని. అతడికి వర్క్ ఎక్కువగా ఉంది. రాలేమంటే వాళ్ళే వచ్చేస్తారు. అతడు రమతో ఆ విషయమే అన్నాడు.

"చిన్న పిల్లల్లాగ వాళ్ళను ఎందుకు రమ్మనడం? నేను వెళ్ళి మా వాళ్ళను చూసి వస్తాను" రమ చెప్పింది.

ప్రభాత్ చిరాకుగా అన్నాడు, "నువ్వు వెళితే నాకు ఇబ్బంది"

రమ వాతావరణాన్ని తేలిక చెయ్యాలనుకొంది "ఎవరైనా వింటే నవ్విపోతారు. మీ గురించి మీ కంటే నాకే బాగా తెలుసు. మీరు దర్జాగా ఉండగలరు. నాలా కాదు"

అతడికి రమ తనను తక్కువ చేసుకోవడం మొదటిసారిగా నచ్చింది. అతడు మార్దవంగా అడిగాడు.







"అయితే రమా! నన్ను విడిచి ఉండలేవన్నమాట"

"ఔను నా పంచప్రాణాలు మీరందరూ!" రమ నిజాయితీగానే అంది.

రమ ప్రయాణం ఖరారయింది. రాఘవరావు విజయనగరం వచ్చి రమను రిసీవ్ చేసుకోవాలని అల్లుడు చెప్పాడు.

తల్లికి తండ్రికి ఏవైనా కొని తీసికెళ్ళాలనుకుంది రమ. భర్తను తీసుకుని ఎటిఎంకి వెళ్ళింది. రమ వెళ్ళి పదివేలు తీస్తూంటే అతడు తెల్లబోయి చూశాడు.

"ఇప్పుడు పదివేలు ఎందుకు రమా?" అన్నాడు.

"అమ్మ నాన్నలకి బట్టలు కొంటాను. సంజయ్‌కి వెరైటీ గిఫ్ట్ కొనాలి. రమ ఏకరువు పెట్టింది. అతడికి ఇబ్బందిగా అన్పించింది. మామూలుగా చూసినట్లు ఆమె చేతిలోని బేలన్స్ స్లిప్ చూశాడు. ఎనభైఐదువేలుంది. అతడు తెల్లబోయాడు.

రమ మామూలుగా చెప్పింది. "నాన్నగారు ఎప్పుడూ డబ్బు ఇస్తూనే ఉంటారు. నా పోషణ, ఖర్చు వాళ్ళకి ఆనందం కలిగిస్తాయి తప్ప బరువు కాదు."

ప్రభాత్‌కి ఆ మాటలు చురుక్కున తగిలాయి. తను బ్యాగ్‌లో డబ్బు తీయడం, పనిమనిషి కివ్వడం, చులకన అవడం గుర్తు వచ్చాయి. అమ్మాయి అత్తవారింటికి వెళుతూంటే పదివేలో, పాతికవేలో ఇస్తారు కానీ ఇంత ఇస్తారా? తన జీవితం అతడికి గుర్తు వచ్చింది.

"డబ్బు దుబారా చేసి తగలబెట్టకు. మీ నాన్నగారు నా ప్రాణం తీస్తారు" అంటుంది అమ్మ.

"అందరి అవసరాలు తీర్చేటప్పటికి నా పని అవుతోంది. డబ్బు చెట్లకి కాయడం లేదు. ఇచ్చిన డబ్బు నెలంతా వాడుకోవాలి. మధ్యలో పంపమంటే ఎలాగ? అన్నయ్య నీలాగ ఉన్నాడా? ఎంత జాగ్రత్తగా చదువుకొన్నాడు?" నాన్న పాఠాలు మొదలు పెడతాడు. అలాంటిది రమ ఇల్లు, రమ పెంపకం, తల్లిదండ్రులు అతనికి కొత్తగా కన్పించారు.

రమను రిసీవ్ చేసుకునేందుకు అందరూ వచ్చారు.

"నువ్వు ఇంటికి వచ్చేవరకూ ఉండలేక నాన్నగారితో వచ్చేశాను" చెపుతూంటే తల్లి గొంతు గాద్గదికమయింది.

రమకి కూడా ఎన్నాళ్ళో అయినట్లు అన్పించింది. ఎక్కువగా మాట్లాడటం అలవాటులేని రమ తల్లికి, తండ్రికి, హిమ తల్లిదండ్రులకు ఎన్నో కబుర్లు చెప్పింది.

"అమ్మా! చాలా హాయిగా ఉంది. మళ్లీ నేను పాత రమను అయిపోయినట్లు అన్పిస్తోంది" రమ అన్నం తింటూ చిన్నపిల్లలాగ ఉంది.

ప్రభాత్ ఫోను చేశాడు. ఇరవైనిముషాల వరకూ అతడు మాట్లాడుతూనే ఉన్నాడు.

రమకి ఒళ్ళు మండింది. "ఇంట్లో ఉన్నప్పుడు ఆఫీసు నుండి ఒకసారైనా చేసి మాట్లాడడు. ఇప్పుడు తల్లిదండ్రుల ఎదుట పెద్ద బిల్డప్. వాళ్ళతో మాట్లాడనీయకుండా అడ్డు.

రాఘవరావు మాత్రం పొంగిపోయాడు. అమ్మాయంటే అల్లుడికి ప్రాణం అనుకొన్నాడు.

రమ సెల్‌లో హిమతో కబుర్లు చెప్పింది. "హిమా! రెండురోజులైనా నా కోసం రా! నిన్ను చూస్తాను"

మూడోరోజు రమ నిద్ర లేచేసరికి కళ్ళ ఎదురుగా హిమబిందు. రమ నోటివెంట మాట రాలేదు. ఫ్రెండ్‌ని అల్లుకుపోయింది.

"నాకు ఉద్యోగం, నీకు భర్త.. జీవితంలో మనం దూరమవడానికి కారణాలు. అయినా మనల్ని ఏవీ వేరుచేయలేవు" హిమ రమ చేతిని ముద్దాడుతూ అంది.

ఇక ఇద్దరూ కబుర్లలో పడ్డారు.

హిమ ఫ్రెండ్సందరికీ ఫోన్లు చేసింది. మళ్ళీ అందరూ కలిశారు. మళ్ళీ మనసు ఆనందతాండవం.

"ఈ స్నేహం విషయంలో, తల్లిదండ్రుల విషయంలో ఆలోచిస్తే అబ్బాయిగా పుడితే బావుండుననిప్పిస్తుంది. మన నిర్ణయాలు అమలు చేసుకోవచ్చు. ఆయన్ని అత్తగారిని బతిమాలలేక చచ్చాననుకో! వీశెడు ఆముదం రాయవలసి వచ్చింది" సుధ వాపోయింది.

"పెళ్ళయ్యాక కూడా స్నేహాలు ఏమిట మ్మాయ్. చీటికీమాటికీ పుట్టింటికని పారి పోకూడదు" మా అత్తగారు క్లాసు పీకింది మరొకరు మనసు విప్పారు.

గిరిజ నిలబడి తర్జని చూపిస్తూ అంది "మన స్నేహం నిలవాలంటే కొంత ధైర్యం చేసి భర్తతో, అత్తమామలతో గట్టిగా చెప్పుకోవలసిందే!"

అందరూ అంతే అంతే నంటూ బలపరిచారు. హిమబిందుకి వంశీకృష్ణ ఫోను చేశాడు. "వచ్చేస్తు న్నారా? లీవ్ ఎక్స్‌టెండ్ చేయాలా? "

హిమ అడిగింది "నిజం చెప్పమంటారా? అబద్ధం చెప్పమంటారా? "

అతడు అడిగాడు "ఏం చెపుతున్నారు? ' ' అతడికి అర్థమవలేదని గ్రహించింది.

"రమ వచ్చింది. అందుకు లీవ్ పెట్టి వచ్చాను. అక్కడ ఆఫీసులో మా మదర్‌కి బావుండలేదన్నాను కదా! అందుకు అడి గాను. మరొక రెండు రోజులుండి వస్తే బావుండుననిప్పిస్తోంది. వీలవుతుందా? " వీలైనంత సౌమ్యంగా అడిగింది.

"అలాగే రండి. వర్క్ నేను చూస్తానూ" అతడు చెప్పాడు.

"అవసరం లేదు. వచ్చాక మరొక రెండు గంటలు ఎక్స్‌ట్రా చేసి వర్క్ పూర్తి చేస్తాను" దృఢంగా చెప్పింది.

వంశీకృష్ణకి ఆఫీసు బోరుగా అన్పి స్తోంది. హిమ లేని నాలుగు రోజులకే ఇలా ఉంటే ఆవిడ మరొక కంపెనీకి వెళ్ళి పోతే.. అమ్మో.. ఇంకేమైనా ఉందా? మొదటిసారిగా వంశీ భగవంతుడిని ప్రార్థించాడు హిమను తన కళ్ళముందే ఉంచమని. ముందు ఇది నెరవేరితే తర్వాత పెళ్ళి..

## సమయస్ఫూర్తి



గాలిబ్ మతవిరుద్ధమైన పను లన్నీ రంజాన్ మాసంలోనూ చేస్తూ ఉండేవాడట. ఓరోజు పండుగ తర్వాత రాజుగారి ఆస్థా నానికి వెళ్లాడు. 'రంజాన్‌లో ఎన్నాళ్లు ఉపవాసం ఉన్నారు? ' అడిగాడు రాజు. 'ఒక్కనాడు ఉండలేదు' అన్నాడు గాలిబు. నెల రోజుల్లో ఒక్కరోజే ఉపవాసం ఉండలేదేమో అనుకున్నాడు రాజు. కాని 'ఏ రోజూ ఉపవాసం ఉండలేదు, సుష్టుగా తిన్నాను' అని గాలిబు చెప్పదలిచాడు. ఈ రెండు అర్థాలు వచ్చే చిన్నమాటను ఎంతో సమయస్ఫూర్తిగా వాడాడు గాలిబ్.

హిమ ఇంట్లో కూడా ఇదే గొడవ.

"అమ్మా! ఇలాగ పెళ్ళంటూ, పెళ్ళి చూపు లంటూ గొడవ చేస్తే రావడం మానేస్తాను" హిమ బెదిరించింది.

శాంతకి కోపం వచ్చింది. "బావుందే! తమ్ముడు ఇంటర్‌నెట్‌లో మన వివరాలు పెడితే ఈ సంబంధం వచ్చింది. అదిగాక



మావయ్య ఒక సంబంధం తెచ్చాడు. ఎలా వాటిని కాలదన్నం? "

"భార్గవగారు కూడా ఈ ఏడాది అమ్మాయి పెళ్లి చేస్తారా? సంబంధాలు మంచివి ఉన్నాయని ఫోను చేశారు" తండ్రి చెప్పాడు.

హిమ రెండు చేతులూ జోడించింది.

"నాన్నగారూ! ఆయనకి, ఆయన తెచ్చే సంబంధాలకి ఒక నమస్కారం. రమ విషయంలో చేసిన ఉపకారం చాలు"

శాంత కసిరింది "ఏమిటే! రమ సంబంధానికి ఏమైంది? లక్షణమైన సంబంధం? "

హిమ ఎగతాళిగా అంది "ఆс... లక్షణమైన సంబంధమా? లక్షలకి ఆశపడే సంబంధమా? అతడు నిజాయితీపరుడిగా నాకు అన్పించలేదు!"

"అసలు నీకు ఎవరైనా నచ్చితే కదా? అందరినీ భూతద్దంలోనుండి చూస్తావు" శాంత విసుక్కొంది.

"నాన్నగారూ! అమ్మను ఎందుకు పెళ్లి చేసుకొన్నారు? ఇంత అవగాహన లేని వ్యక్తితో పాపం.. మీరు ఎలా గడుపుతున్నారు? " హిమ మాటలకు ఆనందరావు నవ్వారు. శాంతమ్మ మొహం ఎర్రబడింది.

హిమ నవ్వుతూ అంది "అమ్మా! నిజం చెప్పు! రమ ముఖంలో కొత్తగా పెళ్ళైన ఆనందం కన్పిస్తోందా? లేదు. అది నిండయిన మనిషి కనుక బయటపడదు. అతను డబ్బు మనిషి. సహృదయత కూడా లేదనే నా ఉద్దేశం. ఇంట్లో ఉన్నంతసేపూ ఆంక్షలే"

ఆనందరావు మౌనం వహించాడు. పిల్లల్ని కనగలం కానీ వాళ్ల తలరాతలు కనగలమా?

"అమ్మా! నన్ను ఆనందంగా ఉండనీ. నాకు పెళ్లి కావాలన్పించినప్పుడు చెపుతాను" అంటూ చెప్పింది. తండ్రి చేతికి డబ్బు ఇచ్చింది.

"నాకు ఎందుకమ్మా ఇంత డబ్బు? " ఆయన దాన్ని చూస్తూ అడిగారు.

"నాన్నగారూ! నాకు సగం, మీకు సగం. అమ్మకి లేదు" హిమ మాటలకు నవ్వారు.

శాంత కూడా నవ్వేసింది.

"అమ్మకి నీ జీతం వద్దు. పెళ్లి చేసుకొని, మనవడినో, మనవరాలినో ఇయ్యి. అది చాలు" అంది.

హిమ అంది "అమ్మా మాలాంటి రాక్షసులను కన్నాక కూడా నీకు ఇంకా పిల్లలు కావాలన్పిస్తోందా? "

అంతా నవ్వేశారు. శాంత సూచన ప్రకారం కొద్దిగా నగలు, కొత్త చీరలు తీసుకొని హిమ తిరుగు ప్రయాణం కట్టింది.

"ఈ వెధవ డ్రెస్‌లు మాను. చీరలు కడితే మహాలక్ష్మిలాగ ఉంటావు. మన సంప్రదాయం గుర్తు వస్తుంది. పెళ్లి మీదకి దృష్టి వెళుతుంది" శాంత గట్టిగా కూతురికి చెప్పింది.

"నాన్నగారు! అమ్మ నన్ను హిప్నటైజ్ చేస్తోంది" హిమ ఫిర్యాదుగా అంటూంటే ఆయన నవ్వారు.

హిమ వెళుతూ రమకి గట్టిగా చెప్పింది.

"రమా! గుడ్డిగా అతడిని నమ్మకు. భర్తగా ఎంతవరకూ గౌరవించాలో అంతవరకూ గౌరవించు. ఎటిఎం కార్డు, వేరే జాగ్రత్త పెట్టుకో. నిన్ను ఏమాత్రం అగౌరవ పరిచినా సహించకు"

రమ ఫ్రెండ్ దగ్గర ఏ విషయాలూ దాచలేదు. అవి వినడం వలననే హిమ ఇచ్చిన సలహా అది.

★ ★ ★

మరోవారం గడిచాక ప్రభాత్ నుంచి ఫోన్.

"రమా! ఎప్పుడు వస్తున్నావు? మీ ఫ్రెండ్ వెళ్లి వారం అయినా నువ్వు అక్కడే

ఉండిపోయావు. అలవాటయిన అర్ధాంగి పక్కన లేకపోతే ఎలా? వేరే ఎవరినైనా చూసుకోనా? " సరదాగా బెదిరించాడు.

రమ నవ్వుతూ "అమ్మావాళ్ళతో చెప్పి, త్వరలో వచ్చేస్తాను" అంది.

అతడు సరదాగా అన్నా అతడి మాటలు రమకి చివుక్కుమన్పించాయి.

★ ★ ★

"అమ్మగారూ! అమ్మగారూ!" గట్టిగా తలుపు చప్పుడవడంతో ప్రభాత్ నిద్ర లేచాడు.

'ఈ పనిమనిషిని పెట్టి రమ ఇల్లు నరకం చేస్తోంది. బంగారం లాంటి నిద్ర పాడు చేసుకొని, తలుపు తీయాల్సి వస్తోంది' అనుకుంటూ విసుగ్గా లేచాడు.

తలుపు తీయగానే అతడి విసుగంతా ఎగిరిపోయింది. ఎదురుగానున్న అమ్మాయిని చూసేసరికి నిద్రమత్తు వదిలిపోయింది. పరికిణీ, ఓణీతో పదిహేనేళ్ళ పడుచుపిల్ల. బొద్దుగా ఉండటం వలన వయసుకి మించి రెండేళ్ళు పెద్దదేమో అన్పిస్తోంది.

"అమ్మకి జ్వరం.. నన్ను పనికి పంపింది" ఆ అమ్మాయి లోనికి రావడానికి పక్కకు తప్పుకున్నాడు.

నలుపైనా కళగల మొహం, సూదంటు రాయివంటి కళ్ళు, నవ్వుతున్న మొహంతో చలాకీగా లోపలకు వచ్చింది.

గుండ్రటి కళ్ళతో ఇల్లంతా కలియచూసింది. దాని కళ్ళల్లో మెరుపు కన్పించింది.

ఈ దేముడు, డబ్బు, అంతస్తు ఒకచోటే ఇస్తాడు. మాలాంటి పేదవాళ్ళకు గుండె నిబ్బరం తప్ప ఏటీ ఇవ్వడు మనసులో అనుకుందా పిల్ల.

"నీ పేరేంటి? " ప్రభాత్ అడిగాడు.

"లక్ష్మి" అంటూ "ఇల్లు బావుందండీ. అమ్మగారు ఏది? " అని మూసి ఉన్న మరొక గదివైపు చూస్తూ అడిగింది.

"అమ్మగారు పుట్టింటికి వెళ్లారు" అని చెప్పి చీపురు, చేట అందించాడతను.

"ప్రస్తుతానికి ఇల్లు తుడు" పని పురమాయించాడు.

"అంట్ల గిన్నెలు లేవా? " లక్ష్మి ఆశ్చర్యంగా అడిగింది.

"రాత్రి వండుకోలేదు. హోటల్ లో తిన్నాను" చెప్పాడతను.

"అతను బ్రష్ చేసుకుని వచ్చేసరికి పనులు చేసేసింది.

"అయ్యగారూ? మా అమ్మ మీకు టీ కాచి ఇస్తుందా? " అడిగింది.

"ఏం మీ అమ్మ ఇవ్వకపోతే నువ్వు పెట్టి ఇవ్వవా? ఓహో! నీకు రాదా" అతడు అడిగాడు కవ్విస్తూ.

లక్ష్మి వెంటనే నవ్వేసింది.

"వచ్చో రాదో మీరే చెప్పండి. ఇప్పుడే టీ ఎడతాను. నేను కాఫీ కూడా కూడా ఎట్టగలను. బువ్వ, కూరలు, చారు, పులుసు వండగలను. సావిత్రమ్మ ఇంటికాడ, రాజబాబు గారింటికాడ పనులుచేసేది నేనే" గర్వంగా చెప్పింది లక్ష్మి.

తను మంచి మాటకారని గ్రహిచి టీ పెట్టమన్నాడతను. పావుగంటలో చిక్కటి టీ తెచ్చి అతడికి అందించింది.

అది ఎంత చురుకైనదో, దాని పనికూడా అంతే చురుకు అన్పించిందతనికి.

"ఉప్మాగానీ, పూరీ కూర గానీ టిఫిన్ చెయ్యాలా? " అడిగింది ఉత్సాహంగా.

అతడు ప్రశ్నార్థకంగా చూశాడు.

## కొత్తగాలి...

**అంపైరు**
**వేలు పైకెత్తితే వీడు హ్యాపీ**
**లేపోతే వాడు హ్యాపీ**
**అంతేనయా కిరి కిరి క్రికెట్టు!**

*- లలితా మానస, బెంగళూరు*







"మా అమ్మ మీరు చెప్పిన పనులు సేయమంది. మీ పనులు ఏటో ఎట్టా తెలుస్తుంది? " అంది తలొంచుకుని.

"నువ్వు హోటల్‌కి వెళ్ళి మనకి టిఫిన్ పట్టుకునిరా! ఈలోపు స్నానం చేస్తాను" అంటూ డబ్బు తీసి ఇచ్చాడు.

అతను 'మనకి అనడం దానికి నచ్చింది' అమ్మగారుంటే ఏ అన్నమో, టిఫినో దొరుకుతుందని తల్లి చెప్పింది. అమ్మగారు లేదు. ఖాళీ కడుపుతోనే వెళ్ళాలేమో అనుకొంది. అలా కాకుండా అతను తమ ఇద్దరికీ టిఫిన్ తెప్పిస్తాననడం సంతోషం కలిగించింది.

అతడు కూనిరాగం తీస్తూ స్నానం ముగించాడు. అతడు డ్రెస్ వేసుకొంటుంటే లక్ష్మి టిఫిన్ పార్సిల్స్‌తో వచ్చింది. అతను ఒక ప్యాకెట్ తనకి అందించాడు.

"నువ్వు నాకు నచ్చావు. నీలాంటి చలాకీ అమ్మాయిలంటే నాకు బలే ఇష్టం. మీ అమ్మకి తగ్గేవరకూ నువ్వే రా!" అని చెప్పాడు మనసులో ఎన్నో ఆలోచనలతో.

పనిమనిషిని పెట్టినందుకు భార్యను తిట్టాడు. డబ్బు ఖర్చన్నాడు. మరి పనిమనిషికి ఇంత రంజయిన కూతురుందని తనకి తెలియదు. "ప్రభాత్ ఏమైనా నువ్వు అదృష్టవంతుడివిరా! నీ పంట పండింది" అని తనని తానే అభినందించుకొన్నాడు.

అనవసరంగా భార్య మీద ఎగిరి వచ్చెయ్యమని ఫోను చేశాను. స్టుపిడ్‌ని. నాలుగు రోజులుండి రమ్మంటే.. ఛ.. ఛ.. అసలు బావుండదు.

ఆ.. ఐడియా.. మంచిదే వచ్చింది.



వెంటనే అతడు రమకి ఫోను చేశాడు.

"రమా! నువ్వు మా వాళ్ళను కూడా చూసి రా! మీ వాళ్ళను చూసి వచ్చేస్తే మా వాళ్ళు బాధపడవచ్చు. ఇద్దరినీ చూసి వస్తే, ఏ గొడవా ఉండదు" అతడు తెల్పి చెప్పాడు.

రమ సరేనంది. భర్త కాస్త తిక్కవాడే కానీ ప్రేమ లేనివాడు కాదనుకుంది.

"రమా! నువ్వు మా వాళ్ళచేత మాటలు పడటం నాకు సుతరామూ ఇష్టం లేదు. నా భార్య పడితే ఒకటి, నేను పడితే ఒక టీనా? "

అతని మాటలు ఆమె అంతరంగంలో బాగా నాటుకొన్నాయి. తనంటే ఎంత అభిమానం. ఈ ప్రయాణం వలన తను మరొక నాలుగు రోజులు తిరగవలసి వస్తుంది. అయినా ఫర్వాలేదు. తమిద్దరిదీ ఒకటే మాట. ఒకటే బాట. రమ తండ్రిని తీసుకొని అత్తవారింటికి వెళ్ళి రావాలని, నిర్ణయించుకుంది. వెంటనే తండ్రి చెవిలో ఆ మాట వేసేసింది.

★ ★ ★

"ఔను హిమా! ప్రస్తుతం నేను మా అత్తవారింట్లో ఉన్నాను. తను ఎంతో ఇదిగా అడిగాడు. కాదనలేకపోయాను. ఆఁ మళ్ళీ నన్ను తీసికెళ్ళడానికి నాన్నగారు ఎల్లుండి వస్తారు. నేను ఇక్కడికి వచ్చి మూడు రోజులైంది. ఊఁ.. మా అత్తగారు, మామయ్యగారు బాగున్నారు. నన్ను బాగానే చూస్తున్నారు.



రమ ఫోను పెట్టేశాక హిమ ఆలోచనలో పడింది. తనున్నప్పుడు అత్తగారి ఊరెళతానని రమ అనలేదు. ఇప్పుడు సడన్‌గా ప్రయాణం ఎందుకు మారింది?

ఈ ప్రభాత్ నాటకాల వాడి లాగున్నాడు. తల్లిదండ్రులను మంచి చేసికొని, ఏ లాభమో పొందుదామని ఇలా యుక్తిని ప్రదర్శిస్తున్నాడేమో? ఏమో?

రమతో కానీ ప్రభాత్ గురించి అనుమానంగా మాట్లాడితే "నాకు రాని ఆలోచన నీకు ఎలా వచ్చింది" అంటుంది.



హిమ భుజాలు ఎగరవేసింది. పెళ్ళి చేసికొంటే ఇదొక బాధ. చేసుకొన్నవాడు తన గురించే ఆలోచిస్తున్నాడా లేక చిన్న ఇల్లు ఏదైనా పెడుతున్నాడా అని. అయినా అమ్మ అన్నట్లు ఎక్కడ లేని చెడు ఆలోచనలూ తనకే వస్తాయా.. ఎందుకు?

మళ్ళీ తన ఆలోచనలు సరైనవనే హిమకి అన్పించింది. రమకి లౌకిక జ్ఞానం లేదు. ఈ మగవాళ్ళు, వాళ్ళ నాటకాలు, మోసాలు తెలియని అమాయకురాలు. అంకుల్, ఆంటీ కూడా అంతే. అందరూ తమలాగే మంచివాళ్ళేనని భావిస్తారు. అందుకే రమవైపు తన ఆలోచనలు.

హిమ మనస్ఫూర్తిగా అనుకొంది "రమా! ఏ విషయంలో నీకు బాధ కలగకూడదు"




ఎవరు చెప్పగలరు? బాధ ఎటువైపు నుండి వస్తుందో, ఎలా వస్తుందో? ఎలా మనిషిని గాయపరుస్తోందో?

లక్ష్మి నిలువుటద్దంలో తన ప్రతిబింబం చూసుకుంటోంది.

మెడలోని తెల్లపూసల దండ, చిన్న లాకెట్‌ను చూసుకుంది. ఒక్క బంగారు గొలుసుంటే ఎంత బావుంటుంది?

కట్టుకున్న పసుపు రంగు అద్దు పరికిణీ, పసుపు జాకెట్టు, నల్లవోణీలో తను ఎంత బావుంది? లక్ష్మి పక్కకి తిరిగి తన నడుం, జాకెట్టు మెడ చూసుకుంది. జడను ముందుకేసుకొంది. తల కొద్దిగా రేగింది. ఇంటినుండి నడిచి రావడం, మంచులో, చలిలో నడవడం వలన తలపై కప్పుకుంది. అందుకే తల రేగింది.

లక్ష్మి పౌడర్ తీసి మొహానికి రాసుకుంది. దానికి ధైర్యం వచ్చింది. అయ్యగారు స్నానానికి వెళ్ళారు. ఈలోపు తను అద్దం చూసుకొంటే తప్పేమిటి?

సహజంగా ఆడపిల్లలు అలంకార ప్రియులు. అందువల్లే లక్ష్మి డ్రెస్సింగ్ టేబుల్ సొరుగు లాగి చూసింది. తిలకం తీసి, తను పెట్టుకున్న స్టిక్కర్ తీసేసి, కోలగా బొట్టు దిద్దుకుంది. అబ్బ.. పాత సినిమాలో సావిత్రి బొట్టులా తన బొట్టు ఎంత బావుంది?

డ్రెస్సింగ్ టేబుల్ సొరుగు లాగింది. స్ప్రేలు కన్పించాయి. ఒకటి తీసి చేత్తో పట్టుకుంది. పెద్దింటి అమ్మాయిలు అవి కొట్టుకోవడం తనకి తెలుసు. అంతలోనే ఎప్పుడూ దగ్గుతూ, మంచంలో పడి ఉండే తండ్రి గుర్తుకొచ్చాడు. లక్ష్మికి తండ్రి రిక్షా లాగినప్పుడు అందరూ రోజుకి అంతో ఇంతో తినేవారు. అప్పుడూ సగం డబ్బు ఆడి తాగుడికి అయ్యేది.

ఏక్సిడెంటయ్యాక కాలు విరిగింది. ఆడు మంచమెక్కాడు. తల్లికి ఇంటి పనులు చేయక తప్పలేదు. తండ్రి మందులు, ఇల్లు నడవడం జరగాలంటే పనికి ఎళ్ళక తప్పదు. తల్లి రెండిళ్ళలో చేస్తోంది.

ఇద్దరు చెల్లెళ్ళు, తను తినాలి. అందుకే చదువు ఏడులోనే మానేసి తనూ పనిచేస్తోంది. రెండు ఇళ్ళు తను చేయడం వలన అందరూ ఒకపూటైన కడుపు నిండా తింటున్నారు. మరొక పూట అర్ధాకలి.

ఎప్పుడు వచ్చాడో ప్రభాత్, దాన్ని వెనుక నుండి గట్టిగా కౌగలించుకున్నాడు.

"అమ్మ దొంగా! నా స్ప్రేలు తీశావా? ఉండు. నిన్ను ఏం చేస్తానో.."

లక్ష్మి కళ్ళు భయంతో పెద్దవయ్యాయి. అతడు ఎంత గట్టిగా పట్టుకున్నాడో? ఏం చేస్తాడో? భయంగా అంది. "అయ్యగారూ! నేను ఏం చేయలేదు. కొద్దిగా పౌడరు వేసుకొన్నాను. సెంటు వాసన బావుంటే చూస్తున్నాను"

ప్రభాత్ చేతులు ఆమె నడుం నుండి పైకి లేచాయి. ఎత్తయిన గుండెలవైపు వెళ్ళాయి. అతడిలో కోరికలు బుస కొట్టాయి.

"నేను నిన్ను ఏమీ చేయను. భయపడకు. ఈ స్ప్రే ఎలాగ వేసుకోవాలో నీకు నేర్పిస్తాను. సరేనా? ఏదీ ఇటు నా వైపు తిరుగు" అతడు ఆమెను బొమ్మలాగ తిప్పాడు.

స్ప్రే తీసి ఆమె చేతులు పైకెత్తి కొట్టాడు. పౌడరు తీసి, మెడకి, మొహానికి సుతారంగా రాశాడు.

"ఇలా రాసుకోవాలి. మొహం అంతా లైట్‌గా వచ్చిందో, లేదో చూడాలి. ఏదీ ఇప్పుడు చూడు అద్దంలో" అతడు ఆమెను మళ్ళీ అద్దంవైపు తిప్పాడు.

నిజమే. పౌడరులో ఆమె మొహం ఆ మెకే ముద్దు వచ్చింది.

"బావుందా?" అతడు అడిగాడు.

"బావుంది" లక్ష్మి అమాయకంగా చెప్పింది.

"ఇంకా ఈ సెంటు వాసన చూడు. ఎంత బావుందో?" అతడు ఆమెకు సెంటు రాసి, వాసన చూపించాడు. సెంటు వాసన ఆమె ముక్కుపుటాలకు నెమ్మదిగా పాకింది.

"అయ్యగారూ! ఈ సీసా ఎంతుంటుంది?" అడిగింది. ప్రభాత్ తను పౌడరు రాసుకుని, స్ప్రే చేసుకొన్నాడు. పచ్చటి శరీరం మిరుమిట్లు గొల్పుతోంది. కట్టుకున్న పెద్ద టవల్ తప్ప అతడి శరీరం అనాచ్ఛాదితంగా ఉంది.

"ఎంత బాగున్నావో? నాకు బలే

## కొత్తగాలి...

**అన్నప్రాసన నాడు**
**'కందుకూరి' ము(ప)ట్టుకున్నది**
**కచ్చితంగా**
**కుంకుమ భరిణే..**

*– రత్నకుమారి, హైదరాబాద్*

నచ్చావు" అతడు ఆమె బుగ్గలపై గట్టిగా ముద్దులు పెట్టాడు. గట్టిగా గుండెకు అదుముకొన్నాడు.

లక్ష్మి బుగ్గలు కెంపులయ్యాయి. అయ్యగారి స్ప్రే వాసనలో అది కొట్టుకుని పోయింది. అతడికి ఆ పిల్ల లేత సొగసులు ఎంతో నచ్చాయి.

నెమ్మదిగా తనను పక్క గదిలోకి తీసికెళ్ళాడు. "అయ్యగారూ! ఇదేమిటి? మీరు..."

తన నోటి నుండి మాటలు పూర్తికానే లేదు. అతడి కౌగిలి బిగుసుకుపోయిందా పిల్ల చుట్టూ. అసంకల్పితంగా ఆమె చేతులూ అతడి వీపుమీద అల్లుకొన్నాయి.

ఒక గంట గడిచాక, అతడు తృప్తిగా లేచి లక్ష్మిని చూస్తూ చెప్పాడు "లక్ష్మీ! ఇదిగో ఈ వందరూపాయలు ఉంచుకో. మంచిగాజులు కొనుక్కో! మనమిద్దరం ప్రేమికులం. ప్రేమికులు ఇలా అప్పుడప్పుడు కలుస్తూ ఉంటారు. నువ్వంటే నాకు ఎంత ఇష్టమో?"

లక్ష్మికీ అయ్యగారి మీద ఆరాధన పెరిగింది. అచ్చు మహేష్‌బాబులాగ అయ్యగారు ఎంత బావున్నారో? తనంటే ఆయనకి బోలెడు ప్రేమ.

"లక్ష్మి ఈ రహస్యం మన ఇద్దరి మధ్యే ఉండాలి. ఎవ్వరికీ చెప్పకూడదు. నీకు ఏం కావాలన్నా అడుగు. కొని పెడతాను. తెలిసిందా?"







లక్ష్మి కళ్లు మెరిశాయి. పుట్టాక అంత ప్రేమను అది చవిచూడలేదు. వెంటనే అతడి ఒళ్లో గువ్వపిట్టలా ఒదిగిపోయింది.

అతడి చేతులు ఆమె లేత శరీరాన్ని తడిమాయి. ఆఫీసుకి సెలవు పెట్టి ఇంట్లో ఉందామా అనుకొన్నాడు. ఇరుగు పొరుగు అనుమానిస్తే మొదటికే మోసం. అందుకే- "చూడు లక్ష్మీ! ఆఫీసుకి టైమవుతోంది. నిజానికి నిన్ను వదిలి వెళ్లాలని లేదు. రేపు కలుద్దాం! సరేనా? " అన్నాడు. అలాగేనన్నట్లు లక్ష్మి తలూపింది.

ప్రభాత్ మాటలు మత్తుమందులా ఉన్నాయి. గదిలో నుండి వస్తోంటే లక్ష్మి కళ్లు ఎదురుగా నున్న రమ ఫొటోపైన పడ్డాయి. ఫొటోలో రమ తల్లి, తండ్రితో ఉంది. దాన్ని చూసి నవ్వుతూ బయటకు నడిచిందామె.

ప్రభాత్ ఫ్రెష్ అయి ఆఫీసుకి బయలు దేరుతూ సెల్, పర్స్ తీసుకొంటుంటే రమ, తను కలిసి తీయించుకున్న ఫొటో మీద దృష్టిపడింది.

ఒక్కక్షణం అతడికి గిల్టీగా అన్పించింది. మరునిమిషం మామూలుగా అయ్యాడు.

రమ ఫొటోపైన ముద్దు పెట్టాడు. "రమా! నీ స్థానం నీదే! అయితే ఇలాంటి పనుల వలన వచ్చే ఆనందం వేరు. ప్లీజ్ అర్థం చేసుకో!" అనుకుంటూ హుందాగా అడుగులు వేస్తూ బయటకు వెళ్లిపోయాడు.

★ ★ ★

హిమ ఆవేశంగా ఫోనులో వాదిస్తోంది. "సీనియర్ ఆఫీసరై ఉండి ఆయన అలాగ చేయకూడదు రమా! ఒకవైపు భార్యతో, నీలాంటి అర్ధాంగి దొరకడం నా అదృష్టం అంటూ, మరొక వైపు ఆఫీసులో రిసెప్షనిస్టని ఉంచుకున్నాడంటే.. ఎంత గుండెలు తీసిన బంటు? ఆ భార్య ఆఫీసుకి వచ్చి, ఎంత అల్లరి చేసిందో? మా వాళ్లు అందరూ పని ఉన్నట్లు బయటకు వెళ్లినా నేను మాత్రం అక్కడే నిలబడ్డాను."

రమ అవతలనుండి అంది, "అవన్నీ నీకెందుకు హిమా? లోకమంతటినీ మనం బాగు చేయగలమా? "

"కనీసం పాడు చేసేవాళ్లని నాలుగు ఉతుకుతుంటే చూడొద్దా? " హిమ నవ్వింది.

"నువ్వు మరీ.. హిమా! ఆయన నీపై ఏదైనా కోపం పెట్టుకొంటే.. మాకెంత భయం? అసలే ఒక్కదానివే ఉన్నావు. మా బాధ అర్థం చేసుకో!"

ప్రభాత్ ఆఫీసునుండి పెందరాళే వచ్చాడు. రమ ఫోను పూర్తిచేసి, భర్తవైపు తిరిగి హెల్మెట్, బ్యాగ్ అందుకుంది.

"ఎవరు? ఏమిటి" అతడు లోపలికి వస్తోంటే వాళ్ల మాటలు చివరివి వినబడ్డాయి.

"మీరేమిటి? ఈరోజు పెందరాళే వచ్చారు? " రమ బ్యాగ్‌ని అలమారాలో పెడుతూ అడిగింది.

అతడు భార్యవైపు కొంటెగా చూశాడు.

"నా ఇల్లాలు ఈరోజు ఊరునుండి వచ్చింది. నాకు పర్మిషన్ ఇవ్వండి. వేగంగా ఇంటికి వెళ్లాలని అడిగి వచ్చాను"

అతడి మాటలు ఆమెను పులకరింపచేశాయి. "మీ భార్య ఎప్పుడూ ఇంట్లో ఉండేదే! మా పని పూర్తిచేసి కదులు అని అనాలి, మీ ఆఫీసు వాళ్లు" రమ సమాధానమిచ్చింది.

అతడు "థాంక్‌గాడ్! నువ్వు పై బాసువి అయ్యావు కాదు. చచ్చిపోదును" అన్నాడు.

అతడు ఆ మాటలన్న తీరుకి రమ నవ్వేసింది. "ఏవీ ముత్యాలు ఎక్కడ రాలాయి? కాసిని ఏరుకుంటాను" అంటూ అతడు నేలవైపు వెదుకుతున్నట్లు చూశాడు.

రమ నవ్వుతూ అడిగింది, "ఏమిటీ!

శ్రీవారు కొత్తగా ప్రవర్తిస్తున్నారు? "

ప్రభాత్ ఉలిక్కిపడ్డాడు. తను అతిగా నటించాడా? అతడు ఆలోచనలో పడ్డాడు తనని తాను నిలవరించుకుని అన్నాడు, "బావుంది. భార్య పుట్టింటికి వెళితే.. ఆ భర్తపడే యాతన మీకు ఏం తెలుస్తుంది? హూఁ.." అంటూ నిట్టూర్పు వదిలాడు.

భోజనాల దగ్గర రమ, హిమ ఫోనులో చెప్పిన విషయాలు చెప్పింది. భార్య ఉండగా సెకండ్ సెటప్ పెట్టడానికి వాడికి ఎన్ని గుండెలు? అంటూ హిమ తిట్టిందని చెప్పింది.

ప్రభాత్‌కి పొలమారింది. రమ అతడి నెత్తిమీద మెల్లిగా తట్టి, మంచి నీళ్లు అందించింది. ప్రభాత్ వెంటనే తాగి రమవైపు చూశాడు.

ఆమె లేత నీలిరంగు చీరలో భువన మోహనంగా ఉంది. చెవులకి కొత్తగా పెట్టుకున్న టాప్స్ ఎంతో నప్పాయి. ఇంత సౌందర్యరాశిని పక్కన పెట్టుకుని... నా బుద్ధి.. అనుకొన్నాడు. కానీ ఆ పశ్చాత్తాపం కొద్దిసేపే. తర్వాత మామూలైపోయాడు.

★ ★ ★

హిమబిందు, నందిని పిక్చర్‌కి బయలు దేరారు. తీరా హాల్లోకి వెళ్ళేసరికి కొలీగ్స్ అందరూ. కలిశారు. వంశీకృష్ణ నవ్వు మొహంతో పలకరించి సీట్లు చూపించాడు.

హిమబిందు అనుమానంగా నందిని మొహంలోకి చూసింది. వీళ్ళంతా గూడు పుఠాణి కాబోలు.

నందిని చేతులు జోడించింది.

"బిందూ! నాకు ఏమీ తెలియదు. అందరం ఇక్కడ కాకతాళీయంగా కలిశాం. అంతే" అంది.

హిమ భుజాలు ఎగురవేసింది. "సో.. వాట్" అంది. అతడు సీట్లు చూపించాడు. అతడు స్పందించినంత మేరకు తాము గౌరవించడంలో తప్పులేదు.

హిమబిందు వాళ్ళవైపు నడిచి వాళ్ళ పక్కన కూర్చుంది. వంశీకృష్ణకు కలా, నిజమా అన్పించింది. ఆమె రావడం, తన పక్కన కూర్చోవడం.. ఎంత అదృష్టం?

కళ్ళు మనిషి మనసుని తెలియచేస్తాయంటారు. వంశీ మొహంలోని ఆనందం అతడిలో అణువణువునా కన్పిస్తోంది. ఇంటర్వెల్‌లో అందరికీ కూల్‌డ్రింక్స్ అందించాడు.

హిమబిందు నందినితో ఎలా మాట్లాడుతోందో, అతడితో కూడా అలాగే మాట్లాడుతోంది. వారిద్దరి సంభాషణ సినిమాల గురించి, ఈనాటి నటీనటుల గురించి సాగుతోంది.

## ఆ రుచి గాడిదకేం తెలుసు?

మామిడి పండ్ల కాలంలో ఇంటినిండా మిత్రుల్ని కూచోబెట్టుకుని పండ్లు తినేవాడు గాలిబ్. ఒకనాడు అవంటే ఇష్టంలేని మిత్రుడొకడు వారింటికి వచ్చి గాలిబ్‌తో మాట్లాడుతున్నాడు. ఆ సమయంలో గాలిబ్ ఇంటి ముందు పడున్న మామిడి టెంకల్ని ఒక గాడిద వాసన చూసి వెళ్లిపోయింది. వెంటనే ఆ మిత్రుడు అన్నాడు- 'మామిడిపళ్లంటే అంత మురిసిపోతావు. గాడిద కూడా ముట్టడం లేదు చూడు'

'అవును నిజమే. గాడిదలు మామిడిపళ్లు ముట్టవు' అన్నాడు గాలిబ్ సరసంగా.





వంశీకృష్ణకి ఒకటి అర్థమవలేదు. తాను ఆమెను అభిమానిస్తున్నానని ఆమెకు తెలుసును. ఇద్దరిదీ కంపెనీ ఒకటే. వృత్తిపై ఆసక్తులు ఒకటే. ఇద్దరిదీ కష్టపడే స్వభావం. ఇద్దరూ అందమైనవాళ్లమే. మరి ఇలాంటి అవకాశం మరొకరెవర్ికైనా వచ్చి ఉంటే, వాళ్ళు తప్పక సద్వినియోగం చేసుకొనేవాళ్ళు. మరి ఈమె ఇంతయినా స్పందించకపోవడానికి ఏమిటి కారణం?

స్త్రీ, పురుష ఆకర్షణ శక్తులకు ఎవరూ వ్యతిరేకం కాదుకదా! మరి ఎందుకలా ఉంటోంది?

ఒక స్థిరమైన చదువు, ఉద్యోగం, అందం, మంచితనం, సమర్థత ఉన్న స్త్రీలు లభించడం అసాధ్యం. అన్నీ ఉండి, తనకు నచ్చి, అందుకోవడానికి వీలుకాకపోవడం ఏమిటి?

పిక్చరయ్యాక వంశీ ఫ్రెండ్స్ అందరికీ హోటల్‌లో డిన్నర్ ఏర్పాటు చేశారు. వాళ్ళ మనసు నొప్పించలేక హిమ నందినిని అనుసరించింది.

వంశీకృష్ణ కొలీగ్స్ అందరికీ హిమ దగ్గర కాస్త చనువు ఏర్పడింది. హిమతో జోక్స్ వేసే స్థితికి వాళ్ళు చేరారు.

"మన ఫైర్‌బ్రాండ్ వస్తున్నారురా!"

"మన లేడీ టైగర్ ఎంటరవుతున్నారురా!"

"మన హిట్లర్ ఏమంటున్నారు? " అని సరదాగా హిమ గురించి మాట్లాడుతున్నా, హిమ నవ్వేస్తుంది కాని పట్టించుకోవడం లేదు.

వంశీకృష్ణ ఆఫీసరవడంతో, ఒకసారి హిమ పనిమీద తన దగ్గరికి వస్తే అడిగాడు, "మిస్ హిమా! మిమ్మల్ని ఒకటి అడగాలనుకొంటున్నాను. దయచేసి అవకాశం ఇస్తారా? "

హిమబిందు సాలోచనగా అతడిని చూసింది. "నాకు పని ఉంది. అయినా విడిగా మాట్లాడుకోవడానికి ఏం ఉంటాయి? నాకు నా కెరీరే ముఖ్యం. అదే తపనతో ఉన్నాను. దయచేసి మామూలు విషయాలైతే వద్దు."

అతని మొహం చిన్నబోయింది.

"మామూలు విషయాలా? అంటే.."

హిమ నవ్వేసింది. అతడు ఆహ్లాదంగా చూశాడు.

"ఆడపిల్లలు కనబడగానే మాట్లాడే పెళ్ళి, ప్రేమ వగైరా కబుర్లు. మనం టీనేజీ కాదు కనుక అవే విషయాలు కొంత హుందాగా మాట్లాడాలనుకొంటాం!"

హిమ కొద్ది నిముషాలాగింది.

"వాళ్ళైనా, మనమైనా సంభాషణ ప్రారంభమయ్యేది ప్రేమ దగ్గర, చివరికి వచ్చేది పెళ్ళి దగ్గర. అవి వద్దంటున్నాను. మీరు మంచి జాబ్ చేస్తున్నారు. బాదరబందీలు లేవు. ఎవరైనా ఎగిరి గంతేసి పెళ్ళిచేసుకొంటారు. నన్ను వదిలేయండి" స్థిరమైన మనసుతో చెప్పేసింది.

అతనికి చాచి లెంపకాయ కొట్టాలన్పించింది. అయినా తమాయించుకొన్నాడు. సాటి ఉద్యోగిని, తను ముందుగా వచ్చాడు కనుక సీనియర్. అంతే. వర్క్ విషయంలో ఆమెకు ఉన్న కర్తవ్య పరాయణత, అంకితభావం, ఏకాగ్రత, పట్టుదల, తపస్సు తనకు బాగా తెలుసు. ఆ విషయాలలో ఆమె ముందు తామంతా దిగదుడుపే! అందుకే అతడు వెనుకంజవేశాడు.

అతడు మంద్రమైన స్వరంతో అన్నాడు, "హిమబిందుగారూ! మనిషి మనిషితో మాట్లాడుకోవడానికి, భావాలు పంచుకోవడానికి అవకాశం ఉంది. మనం విద్యావంతులం. అటువంటి సహృదయతకి మనం వెరవం"

హిమబిందు అతడు ఏం చెప్పబోతున్నాడా అని ఆగింది. భాష బావుంది. భావాలు బావున్నాయి. మాట్లాడుతు

న్నాడు. మాట్లాడనీ అనుకుంది.

"మీరు ప్రేమ- పెళ్లి కామన్ విషయాల న్నారు. అందరు మాట్లాడేది అవే అన్నారు. అవే అయినప్పుడు ఎందుకు మాట్లాడుకోవాలన్నారు? "

"అందరూ.. ఆబాలగోపాలం ప్రేమ ప్రవాహంలో కొట్టుకుంటున్నారని తేలిక చేశారు. ఒకటి అడుగుతున్నాను, సూటిగా చెప్పండి. అజరామరమైన ప్రేమ అనే దివ్యమైన భావాన్ని తేలిక చేసే హక్కు మీకెక్కడిది? మీకు ఇష్టం లేకపోతే ఆ భావాలకు, ఆ ఆకర్షణకి దూరంగా ఉండండి. కానీ ఇతరుల భావాలను ఎలా నియంత్రిస్తారు!

ఉదయించే సూర్యకిరణాలను ఆపేశక్తి ఉందా? మధురంగా పాడే కోయిల గొంతును ఆపగలమా? పూవుని వికసిం చకుండా చేసే రాక్షసత్వం మనకి ఉందా? లేదు. 'ప్రేమ' అలాంటిదే! ఆ భావానికి కరగనివారు, లొంగనివారు ఎవరూ ఉండరు. ఎప్పుడో ఒకప్పుడు మీరు మీ జీవితంలో ప్రేమకు తలవంచుతారు. తప్పదు. ప్రేమకున్న శక్తి అలాంటిది" అంటూ అతడు లేచి వెళ్లిపోయాడు. ఆఫీ సులో కొందరు ఆ మాటలు విన్నారు. ఆ మాటలు వాళ్లని నిరుత్తరులను చేశాయి. అందుకే మౌనంగా వాళ్లు కదిలివెళ్లారు.

హిమబిందు అలాగే నిలబడింది. తను చెప్పాలనుకున్నది ఎంత సూటిగా నిర్భ యంగా చెప్పాడు.

సాధారణంగా నవ్వుతూ, అందరితో మాట్లాడుతూ కన్పించే వంశీలో ఇంత మార్దవమైన భావాలా? ఇంత అవగాహ నతో కూడిన ఆలోచనలా?

మనసా! నువ్వు మొదటిసారి ఒక పురు షుని గురించి ఆలోచిస్తున్నావా?

ఎలా ఆ మాటలు నిన్ను తాకాయి? నీ చుట్టూ అభేద్యమైన గోడలాంటి కవచం ఉందే! ఆ కవచం చాలా పటిష్టమైనది కదా! మరి అతడి మాటలు చిరుగాలిలాగ ఎలా తాకాయి?

హిమబిందు ఎంతసేపు అలా నిలబ డిందో తెలియదు. ఆమె చూపులు కిటికీ లోనుండి బయట కన్పిస్తున్న లాన్‌వైపు సాగాయి.

హిమబిందు మొదటిసారి వంశీకృష్ణ, అతడి మాటల గురించి ఆలోచించింది. తర్వాత తల విదిలించుకొని వెళ్లిపో యింది.

★ ★ ★

తల్లి ఆదెమ్మతో కల్సి పనిలోకి వచ్చింది లక్ష్మి. కూతురిని రమకి పరిచయం చేసింది తల్లి. రమ చిరునవ్వుతో పలకరిం చింది. చదువుకొంటోందా, లేదా అన్నీ అడిగి తెలుసుకొంది.

లక్ష్మి పెదవులు రమకి యాంత్రికంగా సమాధానాలు చెపుతున్నా కళ్లు మాత్రం ఎవరికోసమో వెతుకుతున్నాయి.

రమ గమనించి "ఏమిటి చూస్తు న్నావు? ఇల్లు నీకు బావుందా? " అని అడి గింది.

రమకి పేదవాళ్లంటే జాలి. అందుకే ఆర్ద్రంగా లక్ష్మిని పలకరించింది. తన గది లోపలి బాత్‌రూంలో ఉండటం వలన ప్రభాత్ దానికి కనబడలేదు.

"రమా! కాఫీ" ప్రభాత్ పిలిచాడు. లక్ష్మితో మాట్లాడుతున్న రమ వంటింట్లోకి వెళ్లి, కాఫీ కలిపి పట్టుకెళ్లింది.

ఆదెమ్మ గిన్నెలు తోముతోంది. కూతు రిని రావద్దంటే గొడవ చేసి తనపని ఎగ్గొట్టి తనతో వచ్చింది. వచ్చింది ఏదో పని చూసుకోక, మహారాణీలాగ కూర్చో వటం ఏమిటి?

గదిలోకి రమ వెళ్లడం, రమ నవ్వు, ప్రభాత్ మాటలు లక్ష్మికి వినిపిస్తున్నాయి.

"కాఫీతో పాటు ఇవ్వవలసినవి







ఉన్నాయి కదా!" అతడు రమను చెయ్యి పట్టుకుని లాగుతూ చిన్నగా అనడం, రమ నవ్వులు లక్ష్మి గుండెల్లో మంటలు రేపాయి. పిడికిళ్లు బిగుసుకొన్నాయి. రమ ఎర్రబడిన మొహంతో ఇవతలకి వచ్చింది.

రమ ఇవతలకు రావడం, లక్ష్మి చెయ్యి తగిలి అలమరాలోని టీ సెట్ కిందపడి పగలడం ఒకేసారి జరిగాయి. అందమైన పింగాణీ కప్పులు, ప్లేట్లు ముక్కలుగా పడ్డాయి.

వాటి చప్పుడుకి "ఏమిటి రమా? ఏం పడేశావు?" అంటూ ప్రభాత్ గదిలోనుండి ఇవతలకి వచ్చాడు.

రమ కిందపడి పగిలిపోయిన వాటివైపు చూపించింది.

"అవి ఎలా కిందపడ్డాయి? అక్కడికి నువ్వు ఎందుకు వెళ్ళావు?" రమ లక్ష్మిని అడుగుతోంది.

లక్ష్మి పగిలిన కప్పులవైపు చూడటం లేదు. ప్రభాత్‌వంక తీక్షణంగా చూస్తోంది. అవి పగిలిపోయాయన్న భయం ఆమె కళ్ళల్లో లేకపోవడం రమని ఆశ్చర్యపరిచింది.

లక్ష్మిని చూసి ప్రభాత్ ఆగిపోయాడు.

"చెయ్యి నొప్పిగా ఉంటే పైకి ఎత్తి జాడించాను. వాటికి తగిలి పడ్డాయి" జంకుగొంకు లేకుండా చెప్పింది రమ మరో సారి అడిగేసరికి.

"ఈ అమ్మాయి ఎవరు రమా?" అతడు పగిలిన సెట్‌వైపు చూస్తున్నాడు.

డిజైన్ చూసి రమ ఎంతో ఇష్టంగా కొనుక్కున్న సెట్ అది. రమ ఏం గొడవ చేస్తుందో అన్పించిందతనికి.

"మన ఆదెమ్మ కూతురట" రమ చెప్పి,

"అవి నెమ్మదిగా ఎత్తు. అయ్యగారేమీ అనరులే" అందిగానీ బంగారంలాంటి టీ సెట్ పగలగొట్టినందుకు రమ మనస్సు చివుక్కుమంది. అలమరాలో ఉన్న వాటి వైపు చెయ్యి విసరడం ఏమిటి?

"రమా! ప్రతివాళ్ళను లోపలికి రానిస్తావు. ఇప్పుడు చూడు ఏమయిందో?" అంటూ ప్రభాత్ విసురుగా వెళ్ళాడు.

లక్ష్మి కళ్ళల్లో కోపం బుసలు కొట్టింది. అతను తనను పలకరించలేదు. కనీసం తనవైపు కూడా చూడలేదు.

రమ రావడంవల్లే కదా ఇదంతా! ఛీ.. అమ్మగారు ఎందుకు రావాలి? ఆవిడ రాక పోతే అతను తనను ఎంత బాగా చూసే వాడు. ఛీ.. అంతా ఈవిడ వల్లే! రమవైపు అది క్రోధంగా చూస్తోంది.

"అదేమిటమ్మా? కప్పులు జారిపోయాయా? మీ చేతులకు ఏమీ అవలేదు కదా!" ఆదెమ్మ కంగారుగా లోపలికి వచ్చింది.

ఇల్లు తుడవడానికని చీపురు, చేట పట్టుకుని వచ్చిన ఆదెమ్మకు రమ, లక్ష్మి పెంకులకు అటూ, ఇటూ కనబడ్డారు.

రమ చెప్పింది, "మీ అమ్మాయే వాటిని పగలగొట్టింది. చెయ్యి పైకెత్తి జాడించుకుందిట. అదిగో దాన్నే అడుగు" అంటూ లక్ష్మి వైపు చూసింది.

"పాపిష్టిదానా? రావద్దంటే వెంటపడ్డావు. బంగారంలాంటి వస్తువు పాడుచేశావు. నా ప్రాణానికి శనిలాగా దాపురించావు. అలాగే దెయ్యం పట్టినదానిలాగ నిలబడకపోతే ఎత్తవచ్చుకదా" అంది.

"నువ్వు అరచి కేకలు వెయ్యకు. అయ్యగారికి నచ్చవు" రమ పనిమనిషిని హెచ్చరించింది.

ఆదెమ్మ గొణుక్కొంటూ ఎత్తసాగింది. పనైపోయాక కూతురుని తీసుకొని బయలుదేరింది.

రమ ఇచ్చిన టిఫిన్, అన్నం కేరేజీలో పెట్టి ఒక చేత్తో దాన్ని పట్టుకుని, వస్తున్న తల్లి వెనక, ఆ వీధి చివరివరకు నడిచింది లక్ష్మి. తర్వాత మలుపుదగ్గర ఆగి,

## ఎవరిదైనా ఆకలే

అనగనగా నిజం

ప్రఖ్యాత ఫిడేల్ విద్వాంసుడు మైసూరు టి.చౌడయ్య, ఒక పెద్ద ప్రభుత్వ అధికారి ఇంట ఫిడేల్ కచ్చేరి చేయడానికి అంగీకరించి, సమయానికి తన శిష్యవరంతో వెళ్ళారు. ఆ అధికారి వీళ్ళ రాకను చూసి కూడా పట్టించుకోక, తన మిత్రులతో పిచ్చాపాటి కబుర్లాడుతూ భోజనానికి వారిని మాత్రమే పిలుచుకొని లోపలికెళ్ళాడు. అధికారి, అతని మిత్రబృందం లోపల కేకలేసుకొంటూ భోజనం ఆరగిస్తుంటే, చౌడయ్యకు కడుపుమండి పిచ్చి కోపమొచ్చింది. ఆయన తన శిష్యబృందాన్ని వెంటపెట్టుకొని దగ్గరనున్న ఒక హోటలుకి వెళ్ళి అందరికీ కడుపునిండా టిఫిను పెట్టించి, నెమ్మదిగా అధికారి ఇల్లు చేరుకున్నారు. ఇంట్లో భోజనం ముగించుకొని బయటికొచ్చిన అధికారి చౌడయ్య బృందం లేకపోవటంతో ఆగ్రహం చెందాడు. వాళ్ళు తిరిగి రాగానే ఆ అధికారి, "ఎక్కడికెళ్ళారు? నన్నడుగకుండా ఎందుకెళ్ళారు?" అని చౌడయ్యను ప్రశ్నించాడు. చౌడయ్య నెమ్మదిగా, "అయ్యా, మీ పిలుపందుకొని మీ ఇంటికి వచ్చిన మమ్ము పట్టించుకోక మీ ఆకలి తీర్చుకొనేందుకు లోపలికెళ్ళారు. మాకు ఆకలి ఉండదా? అందుకే మేము హోటలు కెళ్ళాం. మేము కడుపు మాడ్చుకొని కచ్చేరి చేయాలా? న్యాయం చెప్పండి?" అని సమాధానం చెప్పారు. అధికారికి శృంగభంగమయ్యింది. తన తప్పు అంగీకరించి క్షమించమని కోరాడు.



"అమ్మా! నువ్వు ఎల్లవే. నేను కాసేపుండి వత్తాను. కాళ్ళు పీకుతున్నాయి" అంటూ అక్కడున్న సిమెంటు గట్టుమీద కూర్చుంది.

ఆదెమ్మ ఎంత చెప్పినా వినలేదు. తిక్కముండ అనుకుంటూ ఆమె వెళ్ళిపోయింది.

గంట తర్వాత రమకి చెప్పి ప్రభాత్ బయటకు వచ్చాడు. వీధి దాటాక అతడికి లక్ష్మి కనిపించింది. అతడి కనుబొమ్మలు ముడిపడ్డాయి.

"ఇదేమిటి? ఇది ఇక్కడ కాపేసింది. తను వెళ్ళాక రమ దగ్గరకు వెళ్ళదు గదా! సరే, చూద్దాం" అంటూ స్కూటర్ ఆపాడు.

లక్ష్మి అతడిని సూటిగా చూస్తూ అంది, "మీ కోసమని చూడటానికి వత్తే, మీరు నన్ను చూసి మాటాడనేదు" కళ్ళల్లో నీళ్ళు తిరుగుతున్నాయి.

అతడికి ఆమె బాధ అర్థమైంది. ఆమెకు తెలిసేటట్లు ఇక్కడ విషయం చెప్పలేదు. అలాగని వెళ్ళిపోతే తనను వదలదు. అభిమానం, ఉక్రోషం, జాలి కలగలిపిన భావాలతో లక్ష్మి సతమతమవుతోంది.

అతడు క్షణం ఆలోచించి జేబులోనుండి డబ్బు తీసి "ఫలానా చోటికి రా" అని చెప్పి వెళ్లిపోయాడు. లక్ష్మి "అలాగే" అంది సంతోషంగా.

ప్రభాత్ టిఫిన్లు, పళ్ళు, పూవులు ప్యాక్ చేయించుకుని ఎదురుచూడసాగాడు.

అది ప్రభాత్ మిత్రుడి గది. ఆ గదిలో రెండు సింగిల్ కాట్‌లు, దుప్పట్లు, ఎక్కడివక్కడే పడివున్న ప్యాంట్లు, షర్టులు కన్పించాయి.

"అయ్యగారూ! మీ ఫ్రెండ్స్ గదా?" లోపలకు వచ్చిన లక్ష్మి అడిగింది.

అతడు దాన్ని కూర్చోపెట్టి టిఫిన్ తిని

## కొత్తగాలి...

**లవ్ మ్యారేజ్**
**అయినవాళ్లని దూరం చేస్తుంది**
**ఎరేంజ్డ్ మ్యారేజ్**
**కానివాళ్లను కలుపుతుంది**

-కూర్మాన వెంకట సుబ్బారావు,
మురళీ నగర్, విశాఖపట్నం

పించాడు. ఆమె సంతోషంగా తింది.

"మనం ఒకళ్ళను ఒకళ్ళం ఇష్టపడ్డాం. అలాగని మా ఇంటికి వస్తే ఎలా? " అతడు నెమ్మదిగా అంటూంటే, అది అతడిని అల్లుకునిపోయింది.

ఏవేవో చెపుతోంది. అతడిని చూడక పోతే ఉండలేదట. ఎలాగైనా చూడాలన్పించి వచ్చేసిందట.

"మీరంటే నా ప్రాణం కొట్టుకుంటోంది. మనం కలిసే ఉందాం"

అప్పుడు ఏం చెప్పినా అతడు వద్దనడు. ఆ సమయం అలాంటిది మరి! రమ గుర్తు వచ్చింది. "ఆ... అది విందు భోజనం, ఇది ఫలహారం. టిఫిన్లు ఎన్నయినా తింటాం. అలాగని భోజనం మానేస్తామా? దేనిదారి దానిదే!"

కాసేపటికి ఇద్దరి దేహాలూ శాంతించాయి.

"అయ్యగారూ! అమ్మగారిని మళ్ళీ ఊరు పంపించెయ్యండి. నేను మీకు అన్నీ చూస్తాను"

లక్ష్మి మాటలకు అతను గుడ్లు వెళ్ళబెట్టాడు. ఇంత చిన్నపిల్లకి ఎన్ని ఆలోచనలు? అమ్మో.. ఎలాగో దీన్ని భయపెట్టాలి.

"రమ చుట్టాలు పోలీసుశాఖలో పెద్ద ఉద్యోగస్తులు. మన విషయం వాళ్ళు తెలుసుకొంటే నీకు, నాకు జైలు ఖాయం"

ఆమె భయపడింది. మరి రమ ఆలోచన చేయలేదు. అలాగని అతడిని వదిలి ఉండలేదు తను. ఏంచేయాలి?

"ఊ.. ఆఫీసు టైమైంది. గంట లేటుగా వస్తానని ఫోను చేశాను. నువ్వు వెళ్ళు" అతను లక్ష్మి చేతిలో వంద రూపాయలు పెట్టాడు.

"నేను.. డబ్బు తీసుకోను. బాబుగారూ! మీరంటే నాకు ఇష్టం. నన్ను ఇంకోలా చూడవద్దు" అది గొడవ చేసింది.

"ఉష్.. ఇక్కడ ఇళ్ళన్నీ దగ్గర దగ్గరగా ఉంటాయి. నువ్వు గట్టిగా మాట్లాడితే, అందరూ వింటారు" అతడు నోరు నొక్కాడు.

లక్ష్మి, అతడు అరగంటయ్యాక బయటికి వచ్చారు. స్కూటర్ మీద కూర్చోబెట్టుకొమ్మని అడగాలనుకొంది. కానీ అతడు చెప్పిన మాటలు గుర్తు వచ్చి ఊరుకుంది.

★ ★ ★

రమ ఫోనులో తండ్రితో మాట్లాడుతోంది, "ఔను.. నాన్నగారూ! ఆయన నన్ను బాగా చూస్తున్నారు. నాకు మీ గురించే బెంగ" ఆమె కంఠం రుద్ధమైంది.

"అమ్మలూ! మా గురించి బెంగవద్దు. మీరు సరదాగా ఉంటే చాలు. ఫోన్లు చేస్తున్నావు. మా కష్టసుఖాలు కనుక్కొంటున్నావు. ఇంకేం గావాలి? " ఆయన కంఠంలో చిన్నగా కంపం.

భగవంతుడు తమకు ఒక్క అమ్మాయినే ఇచ్చాడు. చిన్నప్పటి నుండి తన చుట్టూనే ఆశలు అల్లుకొన్నారు. తను వెళ్ళిపోయినప్పటినుండీ ఇల్లు బావురుమంటోంది. ఆ శూన్యత చూస్తే గుండె పిండినట్లవుతోంది. తనైతే ఏవో వ్యాపకాలలో ఉంటాడు. జానకి విషయం మరీను.

భోజనాల దగ్గర మరిచిపోయి మూడు కంచాలు పెట్టేస్తుంది. ఎప్పుడూ కూతురి గది సర్దిస్తూనో, బూజులు దులిపిస్తూనో ఉంటుంది.

వారం అయితే చాలు రమ పడుకోకపో

యినా పరుపుమీద దుప్పట్లు మార్చి స్తుంది. కూతురి బీరువా సర్దిస్తుంది. ఒక్క మాటలో చెప్పాలంటే రమ ఇంట్లో ఉన్నట్లే మసులుకొంటుంది.

భార్యను చూస్తే జాలి కలుగుతుంది. తను చెప్పింది వింటే బావుండేదేమో అన్పి స్తుంది. దగ్గర వాళ్ళకి అమ్మాయినిస్తే, గట్టిగా చెపితే వాళ్ళు ఇల్లరికం వచ్చేవా రేమో? ఆయనకి అప్పుడప్పుడు ఇల్లు చూసినా, భార్య బాధ చూసినా తనే కార ణమేమోనన్పిస్తుంది.

"జానకీ! మన రమకి పాపో, బాబో పుడితే వాళ్ళను మనం తెచ్చేసుకొందాం. హాయిగా వాళ్ళను పెంచుతూ, సందడిగా కాలం గడుపుదాం" ఆయన ఆవిడతో ఆప్యాయంగా అన్న మాటలు అవి.

"ఊ.. బావుందండి. ఎవరి పిల్లలను ఎవరు ఇస్తారు? మా నాన్న, అమ్మ బతి మాలినా, మీరు రమను నాలుగు రోజులు వాళ్ళ దగ్గర ఉంచేవారా? మా పిల్లను వదిలి మేము ఉండమని కచ్చితంగా చెప్పే వారు కాదూ? " ఆవిడ తేల్చేసింది.

పనులయ్యాక ఆవిడ, బయట వ్యాప కాలు అయ్యాక ఆయనా కూతురి గురించే ఆలోచిస్తారు.

ఆయన భార్యతో అన్నారు, "అల్లుడు కారు కొందామనుకొంటున్నానని, కారుంటే మన అమ్మాయి హాయిగా బజారు, కచే రీలు అవీ చూసి రావచ్చని ఫోను చేశారు. అబ్బాయి ఉద్యోగం వలన రాలేకపోయినా, అమ్మాయి డ్రైవరుతో సంగీత కచేరీలకు మీటింగులకి వెళ్ళవచ్చునంటున్నాడు"

జానకి ఆలోచనలో పడింది. ఈ విషయం రమకు తెలుసా? లేదా? తెలిస్తే రమే చెపుతుంది కదా?

చివరికి విషయం కూతురివద్దే ప్రస్తావిం చడానికి సిద్ధపడింది, "రమా! అల్లుడు నీకు అన్ని విషయాలూ చెపుతారా? "

రమ అడిగింది, "నీకు ఆ అనుమానం ఎందుకు? ఆయన చెప్పిన విషయాలు వినడం తప్ప నాకై నేను అడగనమ్మ"

జానకి విషయం వివరించింది. రమకి ఆశ్చర్యం కలిగింది. కారు కొనుక్కోవాలని తాము ఎప్పుడూ అనుకోలేదు. తమలో తాము అనుకోకుండా తండ్రినే అడిగారంటే డబ్బు కోసం విషయం కదిపినట్లే కదా!

రమ దృఢంగా తండ్రితో అంది, "నాన్న గారూ! మీరు చాలా రకాలైన వ్యక్తులను చూశారు. నా భర్తకి మంచి వ్యక్తిత్వం ఉండాలని నేను భావిస్తున్నాను. నేను చెప్పకుండా, అదే అడగకుండా మీరు ఆయ నకు ఏ విధమైన డబ్బు ఇవ్వవద్దు"

"అదేమిటమ్మా? ఆయన నాకు పరాయి వాడా? నాకు మీరిద్దరూ రెండు కళ్ళు. మీకోసం కాకపోతే ఆస్తి ఎందుకు? మీరు ఇద్దరూ ఈ విషయంలో గొడవలు పడ వద్దు" ఆయన అనునయంగా అన్నారు.

"ప్లీజ్... నా మాట వినండి" రమ గట్టిగా పట్టుపట్టింది. ఆయన మౌనం వహించారు.

★ ★ ★

ప్రభాత్ మావగారినుండి చెక్కు వస్తుం దని చూశాడు. తన ఎక్కౌంట్‌లోకి డబ్బు వేస్తారనుకొని బ్యాంక్‌కి వెళ్ళి చూసుకొ న్నాడు. ఎటిఎంలో తన ఎక్కౌంట్‌లో తన డబ్బే ఉంది.

"రమా" అతడు పిలిచాడు.

ఫ్రెండ్సందరూ తనను కారు కొనమని ప్రోత్సహిస్తున్నారు. తనకు రెండు లక్షలు మావగారిస్తే, మిగిలినది తను పెడతాడు.

డబ్బుకి అతడికి లంకె. తండ్రినడిగి కట్నం డబ్బులోంచి కూడా ఇలాగే కొంత రాబట్టాడు.

"రమా!" రెండోసారి పిలవడంతో రమ వచ్చింది. "మీ డాడీ నీకు ఏదైనా ఫోను చేసి చెప్పాడా? " ఆమెకు అతడు దేని







గురించి ఎదురుచూస్తున్నాడో బాగా అర్థమైంది.

"అన్నట్లు మీకు చెప్పడం మరిచాను. నాన్నగారు, అమ్మ నీకు కారు కొనుక్కోవడానికి డబ్బు పంపనా? అని అడిగారు. చెప్పవద్దా.. మనకి ఇప్పుడు కారు ఎందుకు? హాయిగా బైక్‌మీద వెళ్ళి వస్తున్నాం. బైక్‌మీద వెళ్ళేటప్పుడున్న అనుభవం కారులో ఉండదు కదండీ! అందుకే కారు వద్దన్నాను" ఆమె అతి తేలికగా చెప్పింది.

అతడికి ఏమనాలో తోచలేదు. గ్లాసుడు మంచినీళ్ళు తెచ్చుకుని గటగటా తాగాడు.

"అయ్యో! నన్నడిగితే మీకు మంచినీళ్ళు తెచ్చి ఇచ్చేదాన్ని కదా!"

అతడు తనని తాను నిలవరించుకొని అన్నాడు "మీ డాడీని నేను కారు కోసం డబ్బు పంపమన్నాను. పనుల్లోపడి నీకు చెప్పడం మరిచిపోయాను. నువ్వు తప్ప, నీ ఆనందం తప్ప ఆయనకి ఏం కావాలి"

రమ సున్నితంగా అంది, "నాకు భర్త ఉన్నారు. ఆయనకి మంచి జీతం ఉంది. దేహీ అంటూ పుట్టింటి వారినడిగి తెచ్చుకోవలసిన అవసరం లేదు. అందుకే వద్దన్నాను"

లోనికి వెళ్ళిపోతున్న రమను అతడు నిస్పృహాయంగా చూశాడు. తనను అడగకుండా ఫోను చేశానని రమ ఇలా చేసిందా? లేక పుట్టింటి వారి డబ్బు ఖర్చు కాకూడదని అలా చెప్పిందా?

ఛీ.. తన ప్లాన్ పాడయింది. అతడు చిరాకు పడ్డాడు.

రమలో అనేక ఆలోచనలు. ఇతడి డబ్బు ఆశకు తాను ఫుల్‌స్టాప్ పెట్టాలి. లేకపోతే తల్లిదండ్రుల దగ్గర తన పరువు పోతుంది.

తమ కాళ్ళమీద తాము నిలబడాలని కొందరు యువకులకు ఎందుకు అన్పించదు? తమ కష్టంతో తాము బతికితే ఎంత అందం? ఆనందం? పరుల సంపదమీద అసమర్థులే ఆశపడతారు. తన భర్త ఆ లిస్టులోకి వెళ్ళకుండా తాను చూసుకోవాలి. రమ గట్టిగా నిర్ణయించుకుంది.

## 8

హిమ, మరో ఇద్దరు అమ్మాయిలు కలిసి ఒక ఇల్లు తీసుకుని ఉంటున్నారు. ముగ్గురూ మూడు కంపెనీల్లో పనిచేస్తున్నారు. వాళ్ళు ఇద్దరూ తల్లిదండ్రులు సంబంధాలు చూస్తే చేసుకునేవాళ్ళే.

హిమ చురుకుదనం, తెలివితేటలు, అందం చూస్తే వాళ్లకి ఎంతో ఇష్టం. పెళ్ళి, మగపిల్లలు, ఆకర్షణ ఇలాంటి కబుర్లకి హిమ దూరమని వాళ్ళకు ముందే తెలుసు.

హిమ జీతంలో సగం ఎప్పుడూ తండ్రి ఎక్కౌంట్‌లో వేస్తుంది. తన దాంట్లో కావలసినది వాడుకోవడం, మిగిలినది దాయడం.

సంజయ్ ఏది కావాలన్నా అడుగుతాడు.

"నాన్నని అడగరా! డబ్బు అక్కడికే పంపిస్తాను కదురా" అంటే ఒప్పుకోడు. హిమకి డబ్బు దుబారా చేస్తే చిరాకు.

"తల్లీ! నువ్వు సంపాదిస్తున్నావని నీకు గర్వం. నాన్నని అడిగితే లెక్కలు అడుగుతారు. నెల కోటా చాలదా అంటారు. నువ్వు ఇస్తే అది లెక్కలోకి రాదు." సంజయ్ వివరంగా చెప్పాడు.

"ఏమిటే మాట్లాడవు? అరణ్యరోదనలా ఉంది నా గోల. కాస్త ఆలోచించవే! నాకు ప్రాక్టీసు పెరిగాక నీకే ఆ డబ్బంతా!"

హిమ నవ్వింది. ఆమెకు తన పాకెట్ మనీ వాడేసి, తన డబ్బులోది ఇమ్మని



పేచీలు పెట్టే సంజు గుర్తువచ్చాడు. వెధవకి ఫ్రెండ్స్ ఎక్కువ, ఖర్చు ఎక్కువ అనుకుంది.

"నాయనా! ఆపరా బాబూ! అలాగే పంపుతాను సరేనా?" అంటూ ఐదువేలు పంపింది.

డబ్బు అందిన తర్వాత సంజయ్ అక్కకి థాంక్స్ చెప్పాడు.

"ఏం చేస్తానే! పీత బాధలు పీతవి. అసలు నా ఎక్కౌంట్‌లోనే మీరు జీతం దాచుకొంటే బావుంటుంది కదే! మనిషికో ఎక్కౌంట్ ఎందుకే? నా బాధ నువ్వర్థం చేసుకోవు. నాన్నగారు అర్థం చేసుకోరు".

"ఒరేయ్ ఇంక ఆపుతావా? నెలనెలా నీకు పాకెట్‌మనీ కావాలి. అంతేకదా! అలాగే" అంది నవ్వుతూ.

సంజయ్ నవ్వుతూ అన్నాడు, "ఏం చేస్తాను? నీ వెనకాలే పుట్టినందుకు నిన్ను బతిమాలుకోవలసి వస్తోంది. మంచిదానివి. అడిగినప్పుడల్లా డబ్బు ఇచ్చి ఇలా ఆదుకొంటూ ఉండు."

హిమ నవ్వుతూ ఫోన్ ఆపింది. కళ్లలో నీళ్ళు తిరిగాయి. ఆ రోజులు ఎంత బావుండేవి?

సంజు, వాడి అల్లరి, తను, వాడు దెబ్బలాడుకోవడం, రమతో కబుర్లు, రమ వాడిని ముద్దుగా చూడటం అన్నీ గుర్తువచ్చాయి. హిమకి ఆ క్షణంలో ఇల్లు, మనుషులు అపురూపంగా అన్పించాయి.

ఇదొక జీవితం, అదొక జీవితం, ఇదీ బిజీలైఫ్. ఈ జీవితంలో ప్రాజెక్టులు, బాధ్యతలు, చేతినిండా డబ్బు, అలసట, పోటీ. సాటివారిలో మేటి అనిపించుకోవాలని రాత్రింబవళ్ళు కష్టపడటం.

స్టేట్స్ వెళ్ళాలి. కీర్తి ప్రతిష్టలు డబ్బు సంపాదించాలి. బహుశ మరొక ఆరు నెలల్లో తను లండన్ వెళ్ళవలసి వస్తుందేమో.

హిమ కళ్ళు ఆ క్షణాలలో ఇప్పటి జీవితాన్ని, తల్లిదండ్రులతో గడిపిన జీవితాన్ని బేరీజు వేస్తున్నాయి. కంపెనీలో రాత్రి వర్క్ ఎక్కువుంటే వాళ్ళే మీల్స్ ఏర్పాటు చేస్తారు. ఉదయం మాత్రం యథావిధిగా వంట. అమ్మ చేసిన వంటలాగ ఉంటుందా? ఊహూ... ఫర్వాలేదన్నట్లు ఉంటుంది. హిమ మనసు రెండుగా విడిపోతోంది.

ఒకటి తల్లిదండ్రులు, తమ్ముడు, ప్రాణ స్నేహితురాలు రమ, ఆ సందడి కావాలంటూ అల్లరి చేస్తోంది. మరొకటి సమాజ స్థితి, విద్య ఉచ్ఛస్థితి వైపు వెళ్ళమని గొడవచేస్తోంది. అవ్వా కావాలి, బువ్వా కావాలంటే ఎలా అవుతుంది? కొన్ని కావాలంటే, కొన్ని వదులుకోవాలి.

"హిమ! నాన్నగారినడిగి డబ్బు తీసుకుని రా. కూరలమ్మి వచ్చింది" తల్లి తనతో అన్నప్పుడు తను ఏమని సమాధానం చెప్పిందో తల్లి ఇప్పటికీ చెపుతుంది.

"కూరలు వండేది నువ్వే కదమ్మా! డబ్బు నాన్నని ఎందుకడగడం! నువ్వు తెచ్చి ఇచ్చుకో?" అందట.

గాజులకి, పువ్వులకి భర్తని డబ్బు అడిగే ఆడవాళ్ళంటే హిమకి ఓలాగా అన్పించేది.

"అమ్మా! నువ్వు హాయిగా ఒక ఫాన్సీ షాపు పెట్టుకో! అప్పుడు నీ సంపాదన నీకు ఉంటుంది. చీటికి మాటికి ఎవరినీ అడిగే అవసరం ఉండదు" హిమ సీరియస్‌గా చెప్పింది.

శాంత, బుగ్గలు నొక్కుకుంది. "బావుందే! నేను ఎవరినడుగుతున్నాను? మీ నాన్ననే కదే!" అంది.

హిమ తల్లిని జాలిగా చూసింది. ఎలా ఈవిడకి తను స్వావలంబన గూర్చి చెప్పాలా అన్న ఆలోచన వచ్చింది.

"నాన్నను కూడా అడగకూడదమ్మా! నీ కాళ్ల మీద నువ్వు నిలబడాలి. వ్యక్తిత్వం

నేర్చుకోవాలి."

శాంత కళ్ళు పత్తికాయల్లా అయ్యాయి. "మీ నాన్నగారిని ఎందుకు అడగకూడదు? మరి పెళ్ళి ఎందుకు చేసుకొన్నట్లు? నా కష్టసుఖాలు చూడమని కదా మా అమ్మా నాన్న నన్ను ఆయనకిచ్చి పెళ్ళిచేశారు." ఆవిడ నిలదీసింది.

కూతురి తలలో ఏవో జెర్రులు పాకుతున్నాయి. లేకపోతే ఈ ఆలోచన ఏమిటి? వ్యక్తిత్వమా, గాడిదగుడ్డా?

"అమ్మా! మీరు ఆలోచించరు. నువ్వే కాదు నీ తరం వాళ్ళంతా అంతే! భర్త మీద ఆధారపడి బతుకుతారు. మీకు తిండిపెట్టి, బట్టలిస్తున్నానని, మిమ్మల్ని సంరక్షిస్తున్నానని వాళ్ళు మీమీద అధికారం చలాయిస్తారు. చీటికీ మాటికీ తిడతారు. కేకలు వేస్తారు. అడిగినవి ఇవ్వడానికి మురిపిస్తారు. మీరు జీవితం అంతా ఇలాగే గడుపుదామనుకొంటారు తప్ప మీ కాళ్లమీద మీరు నిలబడరు" హిమ పెద్ద ఉపన్యాసం ఇచ్చింది.

శాంత నవ్వి కూతురితో అంది, "చూడు. నీ దృష్టిలో నేను నా కాళ్ళమీద నిలబడి సంపాదించుకోవడం లేదని కదూ! 'పెళ్ళి' అన్నది ఒక సహజీవనం. ఇద్దరు వ్యక్తులు మనసులను కలుపుకుని, కష్టసుఖాలు కలుపుకుని జీవితమంతా కలిసి బతకడం. నేను ఈ ఇంటికి, మీ నాన్నగారికి సేవ చేస్తున్నాను. వంట వండుతున్నాను. ఇల్లు సంరక్షిస్తున్నాను. మీ పనులు చక్కగా చేస్తున్నాను. నా శ్రమకు మీ నాన్నగారు తిండి, బట్ట ఇచ్చి నాకు కావలసినవి చూస్తున్నారు. నేను ఇవి ఆయనకు చేస్తే, ఆయన నాకు అవి చేస్తున్నారు. మరి నేను సంపాదన కలిగిన దానిని కాదా!"

అప్పుడే వచ్చిన ఆనందరావు చప్పట్లు కొట్టాడు. శాంత చిరుకోపంగా చూసింది.

"హిమా! మా పెళ్ళయ్యాక మీ అమ్మ ఎప్పుడూ ఇంత తెలివిగా మాట్లాడలేదు.

## కొత్తగాలి...

**అలక, ఆవేదన**
**కలకాలం ఉండవు!**
**పగటికల, బీడునేల**
**ఏనాడూ పండవు!**

*–యడవల్లి, ఖైరతాబాద్, హైదరాబాద్*

అలా మాట్లాడించిన ఘనత నీదే!"

హిమకి మాత్రం తల్లి వాదనలో లోపం కన్పించింది. పనిమనిషి చేసే పనులు, వంటవాళ్ళు చేసే పనులు చేస్తూ, ఇలా చేసి నాకు కావలసిన డబ్బును సంపాదిస్తున్నానడం నచ్చలేదు. అలాగైతే చేసే పనికి, పెట్టించుకొనే ఖర్చుకి లంగరు కుదరదు. అలాగని తల్లితో తన అభిప్రాయాలను హిమ తప్పని చెప్పలేకపోయింది.

బాల్యం నుండి విత్తనంగా ప్రారంభమైన స్వతంత్రతకి సంబంధించిన ఆలోచన పెరిగి, పెద్దదై వటవృక్షమంతయింది. ఎంతో కొంత, తనకాళ్ళమీద తాను నిలబడి సంపాదించుకోవాలి. ఆర్థిక స్వాతంత్ర్యం ఉన్నప్పుడే ఆడది సుఖజీవనం చేయగలదు.

కుటుంబ వ్యవస్థ గొప్పదా? కానీ ఈ వ్యవస్థలో ఒకరికి ఒకరు ప్రేమ పంచాలి. ఒకరిని ఒకరు గౌరవించుకోవాలి. ఒకరికి ఒకరు సహకరించుకోవాలి. అప్పుడు ఆ వ్యవస్థ బలహీనమవదు.

వంశీ తనని అభిమానిస్తున్నాడు. అతడి కళ్ళే ఆ విషయం చెబుతున్నాయి. కానీ ఈ ప్రేమ పెళ్ళిని కోరుతుంది. పెళ్ళయితే ఏముంది? పిల్లలు, సంసారబంధం, ఇక అందులో పడికొట్టుకోవలసిందే! తనకి ఇప్పుడే అందులో అడుగుపెట్టాలని లేదు.

రమ ఫోనులో హాస్యంగా అంది "ఏమ్మా! వంశీకృష్ణను నాకు చూపించు.







అతడు నీకు సరిజోడో, కాదో నిర్ణయి స్తాను."

హిమకి ఆ సమయంలో రమ ఫోను చేయడం సంతోషంగా ఉంది. ఏవో ఆలో చనలు వచ్చినపుడు, మనం ఏదీ చేయలేన పుడు తాత్కాలికంగా మనల్ని ఆనందపరి చేవారు, సమస్య నుంచి ఆలోచన మరల్చే వారు దొరకడం మంచిది కదా!

"అలాగే! నిర్ణయిద్దువుగాని, నాకు పెళ్ళి చేసికోవాలనుంటే ముందు నీకే చెపుతాను. సరేనా? కాస్త నన్ను హాయిగా బతకనీ! ఏమిటి విశేషాలు? మీ శ్రీవారు ఏమంటు న్నారు? " నవ్వుతూ అడిగింది హిమ.

రమ ఆలోచనలో పడింది. చివరికి ఉండబట్టలేక చెప్పింది. విషయం విన్న హిమ నిర్ఘాంతపోయింది.

"రమా! నువ్వు చెప్పేది నిజమా? కావా లని చేసుకొని డబ్బుకోసం ఇలా ప్రవర్తిస్తు న్నారా? " కంగారుగా అడిగింది.

రమ పేలవంగా నవ్వింది. హిమకు చెప్పాక ఆమె గుండె బరువు తీరింది.

"ఔను హిమా! నాన్నగారి డబ్బుతో కారు కొనుక్కోవాలనుకొన్నాడు. నేను అది పడనీయలేదు. మా పెళ్ళి జరిగాక ఎంత డబ్బు నాన్నగారికి ఖర్చయిందో చెప్పలేను. సిగ్గేస్తోంది" రమ నిజాయితీగా అంది.

తనే మళ్ళీ అంది, "హిమా! చిన్నప్పటి నుండి డబ్బు కోసం కక్కుర్తి పడేవాళ్ళంటే నాకు చిరాకు. అలాంటి బంధువులకు మేము దూరంగా ఉండేవాళ్ళం. ఇప్పుడు.. ఇప్పుడు అలాంటి వాడే నా జీవితంలో ప్రవేశించాడంటే బాధగా ఉంది.

హిమ కొద్దిక్షణాలు మాట్లాడలేకపో యింది. తనే సందిగ్ధంలో పడితే రమ మరీ డీలా పడుతుంది.

"రమా! ప్రపంచంలో మనుష్యులు రకర కాలు. కొందరు మనకి తారస పడకూడద నుకొంటాం. కానీ విధివశాత్తు వాళ్ళే తార సపడుతున్నారు. ఇంతేగా అతడి దౌర్బ ల్యాలు? ఇంకా ఏవైనా ఉన్నాయా? జాగ్ర త్తగా కనిపెట్టి ఉండు. జీవితాన్ని లైట్‌గా తీసుకోకు. నీ సమర్థతే నీ జీవితానికి రక్షణ అనుకో! ప్రతీ సమస్యా తెగిపోయేవ రకూ లాగకు. అలాగని సమస్యను పట్టి నట్టు ఉండొద్దు" హిమ గంభీరంగా చెప్పింది.

తర్వాత ఇద్దరూ కాసేపు మామూలు కబుర్లలో పడిపోయారు.

హిమకి ఒకటి అర్థమైంది. ప్రభాత్‌కి డబ్బు పిచ్చి ఎక్కువే! డబ్బు కోసం ఎవరి నైనా హీనంగా అడుగుతాడు. మావగారి నైనా సరే, భార్యనైనా సరే!

రమ ఇంటి పనిలో పడింది. నాన్నగా రిని డబ్బు అడగడం, తాను కాదనడం అతడికి విసుగు కలిగించింది. ఒక వారం ముభావంగా ఉన్నాడు. అయినా తను తమాయించుకుంది. తన పనులు తాను చేసుకోసాగింది.

మళ్ళీ రెండు రోజుల నుండే వెనుకటిలా ప్రవర్తిస్తున్నాడు. తండ్రి పండుగకి పిలవ డానికి వస్తానని చెప్పారు. ఎంత వేగంగా రోజులు గడుస్తున్నాయో అని అనుకుంది.

★ ★ ★

రాఘవరావు వీలుచేసుకొని కూతురిని, అల్లుడిని సంక్రాంతి పండుగకు రమ్మన మని పిలిచారు. తొలిపండుగ కనుక కూతురు, అత్తవారినందరినీ పిలిచారు.

"మావయ్యగారూ! నాకు సెలవు దొరకు తుందో? లేదో? రాకపోతే ఏమీ అనుకో వద్దు" ప్రభాత్ ముందుగా అన్నాడు.

రాఘవరావు వెంటనే అన్నాడు. "మాకు ఉన్నది రమ ఒక్కర్తే. ఏ ముద్దూ ముచ్చట తీర్చుకోవాలన్నా తనతోనే కదా!"

అతడు రమవైపు ఓరగా చూసి అన్నాడు "మీ అమ్మాయి అలాంటి ముద్దు ముచ్చట లకి చాలా దూరం లెండి."

రమ నుండి రియాక్షన్ వస్తుందనుకొన్నాడు. తండ్రికి కాఫీ అందించడంలో మునిగిపోయింది.

రాఘవరావు అల్లుడు వేళాకోళం ఆడుతున్నాడని అనుకున్నాడు.

"మీకు ముచ్చట ఏదైతే మాకూ అదే నాయనా!"

"లేదు లెండి. మీ అమ్మాయి గారి భావాలు వాళ్ళ ఫ్రెండ్‌ను ఫోకస్ చేస్తున్నాయి. పండుగలు, డబ్బుఖర్చు గిట్టవు" ప్రభాత్ టాపిక్ పెంచి, రమను ఇబ్బంది పెట్టాలని చూస్తున్నాడు.

"నాన్నగారూ! మీకు టిఫిన్ సేమ్యా ఉప్మా చెయ్యనా? పెసరట్టు పోయనా!" రమ సంభాషణ మార్చింది.

రాఘవరావు వచ్చినప్పటి నుండి చూస్తున్నాడు. రమ టిఫిన్లు, వంట చేయడం, అతడికి కావలసినవి అమర్చడం గిలకలాగ తిరగడం ఆయనను బాధిస్తోంది. పిల్ల నీరసపడింది. ఇంతపని ఏనాడైనా చేసిందా?

"వంటామెను మాట్లాడుకో తల్లీ! ఇప్పుడు నేను హోటల్ నుండి టిఫిన్లు తెస్తాను. నువ్వు శ్రమపడకు" ఆయన వారించారు.

ప్రభాత్ తగ్గలేదు. ఆధిక్యత చూపాలని అన్నాడు, "మా ఇంట్లో ఆడవాళ్ళు చేయడం తప్ప హోటల్ టిఫిన్లు పెద్దగా తినం. మనలాగ వాళ్ళు శ్రద్ధ చూపరు కదా!"

"నేను పెసరట్లు పోస్తాను. నాకు ఇష్టం అయింది మీకు ఇష్టమే కదా!" రమ వంటింటివైపు నడిచింది. ఆయన మౌనం వహించాడు.

ఆయన కళ్ళకు తమ ఇంటికి వచ్చినప్పుడు తాను తెచ్చిన హోటల్ టిఫిన్లు



హాయిగా తిన్న ప్రభాత్ గుర్తు వచ్చాడు. ఎన్నిసార్లు అతడు రాలేదు? ఎన్నిసార్లు తినలేదు? ఇప్పుడిలా మాట్లాడుతున్నాడు అనుకున్నాడు.

రమ టిఫిన్ ప్లేటు తెచ్చి అందిస్తుంటే గదిలో ప్రభాత్ అడిగాడు, "ఈ రోజు ఇంట్లో ఉండిపోనా? మావగారికి కంపెనీ ఇవ్వాలి కదా!"

రమ అతడిని సూటిగా చూసింది. "పని ఎక్కువగా ఉందని, పండుగకే సెలవు ఉంటుందో, ఉండదో అని, కొత్త ప్రాజెక్టు అప్పచెప్పారని అన్నారు కదా? మా నాన్న గారి కోసం మీ పని ఆగదు కదా!"

అతడు తేలిగ్గా అనేశాడు "నీకు మీ డాడీకి మధ్య నేనుండటం ఎందుకనా?"

రమ అంది "మీరు ఏదైనా అనుకోగలరు. నేను అనుకోలేదు. అనలేదు."

తండ్రికి తమ మాటలు వినబడటం ఆమెకిష్టంలేదు. అతడు మాత్రం గట్టిగా అంటున్నాడు. వెంటనే రమ సంభాషణ తుంచేసింది.

తండ్రి స్నానం పూర్తయ్యాక తనకు, తండ్రికి టిఫిన్ తెచ్చింది.

"అమ్మా! ఇంతపని నువ్వెలా చేసుకొంటున్నావమ్మా?" ఆర్ద్రంగా అడిగారు.

"మన ఇంట్లో అమ్మ చెయ్యడం లేదా నాన్నగారూ? అలాగే నేనూ! మీ పెళ్ళైన కొత్తలో అమ్మని తాతగారు కూడా ఇలాగే అడిగారేమో కదండీ!" రమ టిఫిన్ తింటూ అంది.

"నాన్నగారూ! టిఫిన్ ఎలా ఉంది?"

రాఘవరావు సంతృప్తిగా అన్నారు "చాలా బావుందమ్మా! మీ అమ్మకన్నా బాగా చేశావు?"

రమ నవ్వుకుంది. ప్రతి తండ్రి తన బిడ్డ చేసిన ఏ చిన్నపని అయినా మెచ్చుకుంటాడు. పనిలో తప్పువస్తే భార్యతో దెబ్బలాడతాడు కానీ బిడ్డను ఏమీ అనడు. అదే పితృవాత్సల్యం కదా! అనుకుంది.

తండ్రికి టమాటా పప్పు, వంకాయ కాయపళంగా ఉల్లికారం పెట్టి కూర, సాంబారు చేసింది, సేమ్యా చేసింది.

రాఘవరావు అన్ని ఐటమ్స్ వద్దని గోల పెట్టినా రమ వినలేదు.

"నాన్నగారూ! ఈ చేతులు చిన్నవిగా ఉన్నప్పుడు మీరు ఎన్నిసార్లు ముద్దు పెట్టుకున్నారో? మీతో ఈ చేతులు ఎన్ని దాగుడు మూతలు ఆడాయో? మీ వేలు పట్టుకుని ఎన్ని ఊళ్లు తిరిగాయో? మీరు ప్రేమతో పట్టుకుని ఎన్ని అక్షరాలు దిద్దిస్తే విద్యారంగంలో వెలిగాయో! ఈ చేతులను పాలలో ముంచి ఆయనకు, అత్తవారికి అప్పచెప్పిన నాడు ఇవి మిమ్మల్ని వదిలి రానన్నాయి. అటువంటి మీరు పెంచిన చేతులతో మీకు అన్నం పెట్టగలగడం అదృష్టం కాదా?" రమ మాట్లాడుతుంటే గొంతు ఉద్వేగంతో బొంగురుపోయింది.

రాఘవరావు రమ చేతులను ముద్దుపెట్టుకుని, "నువ్వు బావున్నావా అమ్మా? అల్లుడుగారికి, నీకు ఏ గొడవలూ లేవు కదా!" ఆయన గుచ్చిగుచ్చి అడిగారు.

రమ తొణకకుండా చెప్పింది.

"ఈ కాలం టీనేజ్ వాళ్ళలాగ రాసుకుని, పూసుకుని తిరగడం నాకు ఇష్టం ఉండదు నాన్నగారూ! అయితేనేం బాగానే ఉన్నాం"

రమ మాటలు ఆయనకి తృప్తినిచ్చాయి. మిగిలిన కబుర్లలో పడ్డారు వారిద్దరూ!

★ ★ ★

"ప్రభాత్! నాకు కొంచెం లిఫ్టు ఇవ్వగలరా?" కోమలమైన స్వరం అడుగుతుంటే అతడు తలత్రిప్పి చూశాడు.

"మీరు.. ఆ.. మీరు ఎల్.ఐ.సీ.లో చేస్తున్నారు కదూ! మీ పేరు.." అతడు ఆమెను గుర్తుపట్టి అడిగాడు.

"జలజ" ఆమె నవ్వుతూ అంది.

"నా స్కూటీకి రిపేర్ వచ్చింది. మీరు

మా వీధివైపు రావడం చూసి, ఆగాను" జలజ నవ్వు అతడికి గిలిగింతలు పెట్టింది. కానీ భయం కూడా కలిగించింది. అతడు మాట్లాడకుండా స్కూటర్ స్టార్ట్ చేశాడు. ఆఫీసు వచ్చాక అంది,

"దారిలో మీరు ఏమీ మాట్లాడలేదు. నాకు నిజం మాట్లాడటం అలవాటు. మీరు తరుచుగా మా వీధికి వస్తుండటం తెలుసు. ఆఫీసులోనూ అప్పుడప్పుడూ చూశాను. అందుకని చనువు తీసుకొన్నాను. ఇబ్బంది పెట్టానా? " ఆమె చేతిలో బ్యాగు అటూ ఇటూ ఊపుతూ అంది.

"అబ్బే అదేం లేదు" అంటూ అతను స్కూటర్ స్టార్టు చేయబోతే అదేం లేదనుకుంటే పక్కనున్న హోటల్‌కు కాఫీకి రండి" అందామె కొంటెగా చూస్తూ.

"సారీ! ఇప్పుడు కాఫీ వద్దు"

"మీకు టిఫిన్ తప్ప కాఫీ నచ్చదా? ఓకే వెళ్ళిరండి"

ఆమె మాటలలోని శ్లేష అర్థమైన అతను మౌనం వహించాడు. ఎవరు ఈ జలజ? ఈమెలా తనను ఎందరు ఆ వీధిలో చూస్తున్నారో? వాళ్ళూ ఇలానే నవ్వుకొంటున్నారా?

ప్రభాత్‌కు అసహనంగా అన్పించింది. తన క్లోజ్‌ఫ్రెండ్ రూం కనుక తనకు ఇబ్బంది కలగడం లేదు. అతడు ఒక 'కీ' తనకు ఇచ్చాడు. తనలాగే అతడూ జాలీగా జీవితం గడిపే రకమే కావడంతో లక్ష్మితో రోజులు హ్యాపీగా గడుస్తున్నాయి.

అయినా తనకు ఇష్టమైనట్లు తాను బతుకుతాడు. పదిమంది జలజలైనా తనను ఏమీ చేయలేరు.

అతడు అనుకొన్నట్లు అవలేదు. మరొకసారి లక్ష్మిని అతడు స్కూటర్ మీద దింపుతూంటే జలజ ఎదురైంది. ఆమె వాళ్ళను చూసింది. అతడు మొహం తిప్పుకొనేలోపే ఆమె కొంటెగా నవ్వింది.

లక్ష్మి అనుమానంగా అడిగింది. "మీకు

**కొత్తగాలి...**

**పురుగు మందు**
**ఖరీదెక్కువ..**
**సర్కారోళ్ల నీళ్లు తాగు**
**చావాలనుకొంటే**

-గరిమెళ్ల నాగేశ్వరరావు,
కొమ్మాది, విశాఖపట్నం

ఆవిడ తెలుసా? "

అతడు ఆ పిల్లవైపు కోపంగా చూశాడు. పైకి మాత్రం "రోడ్డు మీద వందమంది వెళతారు. అందరూ తెలుస్తారా? వాళ్ళ గొడవ వాళ్ళది. మన గొడవ మనది."

లక్ష్మికి అతడంటే ఈ మధ్య అపనమ్మకం కలుగుతోంది. తనకు అతడిని చూడాలని, మాట్లాడాలని ఉంటుంది. అతడికి ఎలా ఉంటుందో, తనకు అర్థమవదు.

"చనువు లేకపోతే ఎవరైనా అట్లా నవ్వుతారా? "మనసులో అనుకోబోయి పైకి అందామె.

"ఇదిగో.. నువ్వు ఇలాగ గొణిగితే, నెల రోజుల వరకూ నిన్ను చూడను" బెదిరించాడతను.

"వద్దులెండి. అన్ని రోజులు నేనుండలేను. మీకైతే అమ్మ గోరున్నారు, నేను న్నాను.." మధ్యలో ఆపింది.

అతడు ఎవరైనా వింటారేమోనన్నట్లు ఉలిక్కిపడి చూశాడు. లక్ష్మిని చిరాగ్గా చూసి, అన్నాడు "బయటికి వచ్చినపుడు మాట్లాడవద్దంటే వినవు"

ఆమె మరి మాట్లాడలేదు. ఆమెకు తన దగ్గర ఫోనుంటే బావుండునన్పించింది, హాయిగా అతడితో ప్రతిరోజూ మాట్లాడుకోవచ్చు వారానికి ఒకసారి చూడవచ్చు ఈ పొద్దు మరీ పెందరాళే వచ్చేశారు. ఆయన ఫ్రెండ్ వచ్చేస్తాడట. తనకి ఆయనతో ఉ

## కొత్తగాలి...



**భిక్షువు**
**కడుపులోని**
**'ఆకలి చాకలి'**
**పేగులను పిండుతున్నాడు**
**అందుకే కన్నులోంచి నీళ్లు!!**

*- కందాళై రాఘవాచార్య, బొబ్బిలివాడ, నిజామాబాద్*

న్నట్టే లేదు. ఉన్నట్టే లేదు. పనిమీద మన సుపోదు. చెప్పలేని గుబులుగా ఉంటుంది. అయ్యగారు ఏం మాయ చేశారో? ఏ మంత్రం ఎట్టారో అనుకుంది.

★ ★ ★

"ఇదిగో! రమా! ఒక ఇరవైవేలుంటే ఇయ్యి, వారంలో ఇస్తాను" ప్రభాత్ భార్యను అడిగాడు.

రమ ఆలోచనలో పడింది. తండ్రి రమ్మంటే వీలు కాదన్నాడు. పాపం, తండ్రి బాధపడుతూ వెళ్ళాడు. వీలైతే వస్తానన చ్చును కదా! ఊ.. హూ.. భేషజం

రమ మాట్లాడకపోయేసరికి ఇస్తుందను కొన్నాడు. "వీలవదండీ! ఆ డబ్బుతో నాకు పనుంది" చెప్పింది. డబ్బు ఉండి, ఇవ్వన నేసరికి అతడికి కష్టం కలిగింది. ఫ్రెండ్ వడ్డీ ఇస్తాను, డబ్బుంటే ఇవ్వమన్నాడు.

"నా అవసరాన్ని మించిన పని నీకు ఏముంది? " అతడు నిలదీశాడు.

రమకు ఈ పరిస్థితి దుర్భరంగా అన్పిం చింది "మీరు మీ జీతం ఏం చేస్తున్నారో నేను అడిగానా? మీరు ఇంటికని ఇచ్చిన దాంట్లో నడుపుకొంటున్నాను. నాకు సంబంధించిన దాని గురించే ఎప్పుడూ ఆలోచిస్తారేమిటి? సరే! చెబుతున్నాను. హిమకి పాతికవేలు ఇవ్వాలి. నా కోసం తను కంప్యూటర్ కొంది. అది వట్టిగా నేను తీసుకోను" రమ చెప్పేసింది.

అతడు ఆశ్చర్యంగా విన్నాడు. హిమ బిందు రమ కోసం కొందా? ఈవిడ అది వట్టిగా పుచ్చుకోదా?

ఒక్కక్షణం వాళ్ళ స్నేహానికి అతడికి అసూయ కలిగింది. తన విషయం తాత్కాలికంగా మరిచిపోయాడు.

"పండక్కి హిమబిందు వస్తుందా? " అతడు అడిగాడు. వస్తుందన్నట్లు రమ తల ఊపింది. అతడి కళ్ళ ముందు హిమ బిందు రూపం మెదిలింది.

ప్రభాత్ అంతటితో వదలలేదు. అలిగి, అన్నం మాని రమ నుండి ఇరవైవేలు సంపాదించాడు. రెండు నెలల్లో మళ్ళీ ఇస్తానన్నాడు.

రమ మాత్రం ఏం చేస్తుంది? అతడి గొడవను భరించలేక ఇచ్చింది. ఫ్రెండ్‌కి అవసరమంట, డబ్బు ఇచ్చి వడ్డీ పుచ్చుకుం టాడట. ఇతనేం మనిషి? అనుకుంది.

ప్రభాత్ ఫ్రెండ్‌కి గొప్పగా డబ్బు అంద జేశాడు. అతడు గొప్పగా అన్నాడు, "ఏమైనా నువ్వు గ్రేట్ రా!"

ప్రభాత్‌కి ఆ మాటలు సంతోషం కలి గించాయి.

తండ్రి నుండి మళ్ళీ ఫోను రావడంతో అందరూ పండుగకి వెళ్లారు. కూతురిని చూసిన జానకికి భర్త మాటలు నిజమే అన్పించాయి. రమలో గాంభీర్యం చోటు చేసుకొంది. మనిషి కొంత నీరసపడింది. జానకికి కళ్ల నీళ్లు తిరిగాయి. ఒక్క బిడ్డను ఎంత వైభవంగా పెంచానో, ఎంత మంచి జీవితం ఇద్దామనుకొన్నానో?

జానకి వియ్యపురాలైన యమునతో అంది, "వదినగారు! పెద్దవాళ్ళు తరచుగా పిల్లల దగ్గరకు వెళ్ళివస్తూ ఉండాలి. కొత్త కనుక పిల్లలు, వాళ్ళ సంసారం ఎలా ఉం దో తెలుస్తుంది. ఎవరిలో లోపం ఉన్నా మనం సరిచేసుకోవచ్చు "

ఆమె మొహం నల్లబడింది. ఆవిడ అభి ప్రాయంతో ఏకీభవిస్తున్నట్లు మాత్రం తల

ఊపింది.

భర్త దగ్గర తర్వాత వాపోయింది.

"ఏమండీ! మనం ఎప్పుడు వస్తామన్నా, వాడు 'మేం వద్దామను కొంటున్నాం. వీలు చూసుకొని వస్తాం' అనే కదా ఫోను చేస్తాడు. కోడలు చిక్కింది. మంచి చెడ్డలు మనికి వాళ్ళు చెపితేకదా తెలిసేది"

ఆయన ఔనన్నట్లు తల ఊపారు. మంచి సంబంధం కదా అని చేశారు. వాడు ఆ పిల్లను నెత్తిన పెట్టుకుని చూసు కోవాలి. మరి అలాంటిది ఇలా ఎందుకు?

అత్తగారు రమను పిలిచి కాసేపు కబుర్లు చెప్పింది. ఈసారి తాము కూడా వాళ్ళతో వస్తున్నామని ప్రకటించింది. రమ పెదవులు చిరునవ్వుతో విరిశాయి. "అసలు మీరిద్దరూ వేరుగా ఎందుకు అత్త య్యగారు.. అందరం బెంగళూరులో కలిసి ఉందాం" రమ ఉత్సాహంగా అంది.

మావగారికి ఆ పిల్ల బెంగ అర్థమైంది. ఈలోపే ప్రభాత్ చెప్పేశాడు "బావుంది. స్వంత ఇల్లు వదులుకొని, మనతో వాళ్ళు ఎందుకు అద్దె ఇళ్ళల్లో పడుండాలి? మా నాన్నగారికి అక్కడ ఉన్నట్లు, ఎక్కడా ఉండదు"

ధర్మారావు కొడుకు తెలివితేటలకు చిరా కుపడ్డాడు. "మీ పెళ్ళి రోజు వస్తోంది కదా! అదయ్యాక వస్తాం. అమ్మాయి విడిగా ఉండలేక బెంగ పడుతోంది. మేం వస్తాం" ఆయన నిర్ణయించేశారు.

గదిలోకి వచ్చిన రమను ప్రభాత్, "ఏమిటీ! అమ్మాయిగారికి అత్తమామలతో ఉండాలనుందా? రమ్మని మీవాళ్ళు, నువ్వు ఒకటే ఆహ్వానిస్తున్నారు" అడిగాడు.

"బాగుంది. అత్తమావలుంటే ఇల్లు సందడిగా ఉంటుంది. అయినా బావగారు దూరంలో ఉన్నారు. వాళ్ళ బాధ్యత మనదే కదా! మనవాళ్ళు మన దగ్గరుండక ఎందుకు వేరే ఉండాలి? " రమ తన అభి ప్రాయం చెప్పింది.

"మనం నాలుగు రాళ్ళు దాచుకోవాలంటే ఇదే సమయం. రేపు పిల్లా పాపలు కలి గాక ఖర్చు ఉంటుందా? అప్పుడు మనం దిక్కులు చూడాలి" అతడు కుటుంబం గురించి చెప్పినట్లు చెప్పాడు.

రమ వెంటనే చెప్పింది "మీ పిల్లల తల్లికి బోలెడు ఆస్తి ఉంది. వాళ్ళ అమ్మ కూడా విద్యావంతురాలు. ఉద్యోగం చేసి బాగా సంపాదించగలదు"

అతడు రమ అన్న తీరుకి నవ్వేశాడు.

"అమ్మదొంగా! భవిష్యత్తు మీద నీకు అంత నమ్మకం ఉంటే నాకు భయం ఎందుకు? నీకు జాబ్ చెయ్యాలని ఉంటే సూటిగా చెప్పవచ్చు. అయినా ఇప్పటికే ఇంటి పనులు నీచేత చేయిస్తున్నాననే మీ నాన్నగారు కారాలు మిరియాలు నూరుతు న్నారు."

"ఇంటి పనులు చేయడానికి ఎప్పుడూ నేను బాధపడలేదు. అయితే నాకు ఆ పనులు కొత్త. వాటికి అలవాటు పడటా నికి కొంత సమయం పడుతుంది" రమ నిజాయితీగా చెప్పింది.

"మీ వాళ్ళకు చెప్పు. అక్కడ నీకు ఏమీ ఇబ్బంది లేదని" అతడు అనునయంగా అన్నాడు.

"నాకు ఉన్న ఇబ్బంది మీతోనే! మీరు రోజుకోలాగా ఉంటారు. ఒక్కోసారి ఒక్కో తీరున ప్రవర్తిస్తారు. మీరేమిటో, మీ పద్ధ తులేమిటో అర్థం కావు. మనం ఉన్నదే ఇద్దరం. భిన్నధ్రువాల్లా బతికితే ఏం ప్రయోజనం? " రమ మాట్లాడగలదని అనుకోని అతడికి, సందేహం తొలగింది.

ఎదురుగా వింటున్న ప్రభాత్, పరో క్షంగా వాళ్ళని డబ్బు ఇవ్వడానికి వచ్చిన రాఘవరావు, ఆయన రమ్మంటే వచ్చిన ధర్మారావు కూడా వాళ్ళ సంభాషణను చివర్లో విన్నారు. రాఘవరావుగారు ధర్మా

రావువైపు చూశాడు.

ధర్మారావుకి కొడుకు మీద ఎంతో కోపం వచ్చింది. పెళ్లైతే అతడి స్వభావంలో మార్పు వస్తుందనుకొన్నాడు. రమ మాటలు ఆమె స్థితిని తెలుపుతున్నాయి.

"ఎప్పుడు ఇంటికి వస్తారో తెలియదు. నాతో ఎప్పుడు గడుపుతారో తెలియదు. చనువుగా ఉన్నారని, ప్రేమగా దగ్గరకి వస్తే చిర్రుబుర్రులాడతారు. అలాగని మౌనంగా ఉంటే సఖ్యంగా లేనంటారు. మొదట మీ సంగతి మీరు పూర్తిగా తెలుసుకోండి. తర్వాత నాకు తెలియచేయండి. ఒకవేళ మీకు డబ్బు బాగా సమకూడాలనే ఆలోచన కలిగితే, నేను మావాళ్ళ ఇంట్లో ఉంటాను. తర్వాతే వస్తాను" రమ తన చేతి వేళ్ళను చూసుకొంటూ చెప్పింది.

ప్రభాత్ సన్నివేశాన్ని హాస్యంగా తీసెయ్యాలనుకొన్నాడు. తాను ఊహించినట్లు రమ అమాయకురాలేమీ కాదు.

"భార్యను దూరంగా ఉంచాలనే ఆలోచన ఉంటే పెళ్ళి ఎందుకు చేసుకొంటాను? " నవ్వుతూ అన్నాడు.

అతడికి రమ అలా మాట్లాడటం ఇబ్బందిగా ఉంది.

ధర్మారావుకి ఇంక ఆలస్యం చెయ్యబుద్ధ వలేదు. ఇంకా ఉంటే ఇంకేం వినాలో?

"ప్రభాత్! మావయ్యగారు వచ్చారురా!" అంటూ గదిలోకి ప్రవేశించాడు.

రమ, ప్రభాత్ అనుకోకుండా వాళ్ళను చూసి, కంగారుపడ్డారు. రమ లేచి నిలబడింది.

"మావయ్యగారూ! కూర్చోండి. నాన్నగారూ! రండి" అంటూ త్వరగా ఇద్దరికీ ఆహ్వానం పలుకుతూ కుర్చీలు జరిపింది.

రాఘవరావు పదివేల చెక్కుతెచ్చి అల్లుడికిచ్చాడు. బట్టలు కూడా అందించాడు.

"నీకు నచ్చినట్లు ఖర్చు పెట్టుకో!" అన్నారు. రమ చెక్కువైపు, తండ్రివైపు చూసింది.

"మొదటిసారి పండుగకి మీరందరూ వచ్చారు. చాలా సంతోషం. తొలి పెద్దపండుగ కనుక ఏదైనా కానుక ఇవ్వాలి. ఏది కావాలంటే అది తీసుకోండి" రాఘవరావు చెప్పి, బయటికి వచ్చేశారు. తండ్రితోపాటు రమ వచ్చేసింది.

రాఘవరావు వెళ్ళాక ధర్మారావు కొడుకును తీక్షణంగా చూసి, "డబ్బుకాదు ముఖ్యం. అవతల వాళ్ళ అభిమానం పొందగలగడం గొప్ప. నువ్వు చాలా బాగా అభిమానం పొందావు. 'అదృష్టం అందలం ఎక్కిస్తే, బుద్ధి పెడత్రోవ పట్టించిందట' అంటే ఏమిటో అనుకొన్నాను. ఇప్పుడు నిన్ను చూస్తే తెలిసింది" చీత్కారంగా అన్నారు.

ప్రభాత్‌కి విసుగు వచ్చింది. రమ మీద, ఆమె తండ్రిమీద కోపం వచ్చింది. మనసులో ఉన్న కష్టం తను ఊళ్ళో చెప్పవచ్చు కదా. పోనీ ఆయన ఏదైనా డబ్బు ఇవ్వాలనుకుంటే తనను పిలవవచ్చు కదా! ఈయనా అంతే! ఎప్పుడు దెప్పుదామా అని చూస్తారు.

అందరూ అందరే. అతడు నిస్సంకోచంగా తండ్రిని చూసి అన్నాడు. "ప్రతి భార్యాభర్తల మధ్య ఏవో కీచులాటలు ఉంటూ ఉంటాయి. గోరంతను కొండంతలుగా ఎందుకు ఊహిస్తారో? "

ధర్మారావుకి నిస్త్రాణ ఆవహించింది. 'వీడిని ఎలా మార్చాలి? అనవసరంగా ఆ అమ్మాయి బతుకు పాడు చేయలేదు కదా!' అనుకొన్నారు. పెద్దకొడుకు డబ్బుకోసం దేశాలు విడిచి తిరుగుతున్నాడు. ఉన్నవాడు వీడు. వీడు ఇలాగ... తన బాధ ఎవరికి చెప్పుకోవాలి?

రమకి పట్టుచీర, నాలుగు మంచి ఫ్యాన్సీ చీరలు, చెవులసెట్ కొనిచ్చారు రాఘవరావు. రమ ఇప్పుడు మాత్రం తలవంచు

కుంది. వాళ్ళు తనకు అన్నీ ఇస్తున్నారు. తాను మాత్రం వాళ్ళకి ఏదీ చేయలేకపో యింది.

"అన్యాయం.. మీకు ఇద్దరు అమ్మాయి లు. మీరు రమకే అన్నీ ఇస్తే ఈ పిల్ల ఏమవ్వాలి? " హిమ నిలదీసింది.

ఆయన మనసారా నవ్వారు.

"ఈ పిల్లకి సంక్రాంతి వరకూ పండుగ రాకపోతే ఏంచేయను? " అన్నారు.

"త్వరగా స్నానం చేసిరా!" తొందరచే శారు.

రమ హిమను అల్లుకుని పోయింది. రమకి ఎంతో ఏడుపు వచ్చింది.

"ఏయ్ పిచ్చీ! నేను రాకుండా ఎలా ఉంటాను? " రమ ఏడుస్తూంటే హిమకు గొంతు పట్టినట్లయింది.

రమ ఏడుపు చూసి జానకి వంటింట్లో నుండి పరుగెత్తుకుని వచ్చింది.

"నిన్ను చూడకుండా ఎన్ని రోజులు న్నానో చూడు. నా ప్రాణం ఎప్పుడు నిన్ను చూస్తానా అని తహతహలాడింది" రమ వెక్కిళ్ళ మధ్య అంటోంది.

ఏమయిందో, రమ ఏడుపు విన్పిస్తోం దని ప్రభాత్, తల్లిదండ్రులు ఇవతలికి వచ్చారు.

"రమా! నా తల్లీ! ఊరుకోరా! నువ్వు ఏడవకూడదురా! ఈ స్టుపిడ్‌ని తిట్టు. ఉద్యోగంలో బిజీ అయిపోయి, నీ దగ్గరకి రావడం మానేసింది కదూ! అందుకు తిట్టు" హిమ, రమని పొదివి పట్టుకొని, తల నిమురుతోంది.

జానకి వచ్చి వారిద్దరినీ రెండు చేతు లతో దగ్గరకు తీసుకుంది. ఒక్క పిల్లగా పుట్టి, రమ పడుతున్న ఆవేదన అప్పుడు రాఘవరావు దంపతులకు తెలిసింది.

"చూడు, నువ్వు లేచి కాస్త "కూర్చుంటే, మీ ఫ్రెండ్ నీకేం తెచ్చిందో చూడవచ్చు" హిమ, రమను లేపి కుర్చీలో కూర్చోబె ట్టింది.

తన దగ్గరున్న సూట్‌కేస్‌లో నుండి పెద్ద హ్యాండ్‌బేగ్ అంత ఉన్న కంప్యూటర్ తీసింది. దాన్ని చూడగానే రమకళ్లు పెద్ద వయ్యాయి.

"ఒరేయ్ రమా! ఇది నీకురా! నువ్వు ఇంటర్‌నెట్ ఆన్ చేశావంటే నేను హాయిగా కన్పిస్తాను. మనమిద్దరం చూసు కోవచ్చును. మాట్లాడుకోవచ్చును. ఇది నీకు కొని తేవడం కాదురా! నాకు నేను కొనుక్కోవడం. నువ్వు దూరంగా ఉంటే చూడకుండా ఉండలేక, ఫోనులో మాట్లా డితే తృప్తి తీరక, ఇది నాకోసం కొన్నాను. ఇక రోజూ నిన్ను చూస్తాను కనుక హాయిగా ఏకాగ్రతగా నేను ఉద్యోగం చేస్తాను"

హిమ ఆగి జానకి వైపు చూసింది. "అమ్మా! హార్లిక్స్ ఇయ్యమ్మా!"

జానకి నవ్వుతూ లేచింది.

"హిమా! నువ్వు ఇంటికి వెళ్లలేదురా? " ఆయన అడిగారు. హిమ రమతో కబుర్లు చెపుతూ లేదన్నట్లు తల ఊపింది.

ఫోన్‌లో రాఘవరావుగారి స్వరం విన్పిం చింది. "ఔను. హిమ డైరెక్ట్‌గా ఇక్కడికి వచ్చింది. ఈరోజు మీరందరూ ఇక్కడికి వచ్చేయండి. అందరం కలిసి గడుపుదాం" ఆయన హిమ తండ్రికి చెప్పారు.

కాసేపటికి జానకి ఇచ్చిన హార్లిక్స్ తాగుతూ ఇద్దరూ కబుర్లలో పడ్డారు. వారికి ఆ క్షణంలో ఇల్లు, ఇంట్లోని మను షులు ఎవరూ గుర్తుకు రాలేదు. ప్రవా హంలా వారి కబుర్లు సాగుతున్నాయి.

ప్రభాత్ ఎదురుగా ఉన్నాడు కనుక హిమ "హాయ్" అంటూ చెయ్యి మర్యా దగా ఒకసారి ఎత్తింది. తర్వాత అతడి వైపే చూడలేదు. ప్రభాత్ వాళ్లిద్దరినీ చూస్తున్నాడు. వారిద్దరే ప్రపంచమన్నట్లు కబుర్లలో పడిపోయారు. రమలో ఇంత







ఉత్సాహం అతడు ఎప్పుడూ చూడలేదు.

రమ పసుపురంగు కంచి సిల్క్‌చీర కట్టింది. ఎరుపు అంచుతో అదెంతో బావుంది. చీరపైన, కింద బోర్డర్ చుట్టూ నెమళ్లు జరీ వర్క్‌తో ఉన్నాయి. అసలే అందమైన రమ ఆ చీరలో మరీ అందంగా ఉంది. పసుపు కొమ్ములాగ కాంతి విరజి మ్ముతోంది.

ఆ క్షణంలో అతడికి భార్యపై ఎంతో వ్యామోహం కలిగింది. తలంటుకుని జుట్టు ఆరడానికి క్లిప్ పెట్టి వదిలింది. పొడవైన జుట్టు వీపంతా పరుచుకుంది. గడ్డం కింద చెయ్యిపెట్టి నవ్వుతూ హిమను చూస్తూ ఆమె మాటలు వింటోంది.

"రమా! టిఫిన్ తిందామా?" ఎలాగైనా ఆమెను అక్కడినుంచి పక్కకు తీసుకె ళ్లాలనుకుని అడిగాడతను.

"మీరు తినండి. అమ్మా! ఆయనకి టిఫిన్ పెట్టు" అంటూ రమ తల్లికి పుర మాయించింది.

"మనం తిందాం పదండి. వాళ్లిద్దరూ తర్వాత తింటారు" రాఘవరావు వాళ్లంద రినీ లేపుతూ అన్నాడు.

హిమ తల్లిదండ్రులు వచ్చేశారు. సంజూ అక్కని కౌగలించుకున్నాడు.

శాంత కినుకగా అంది, "తల్లి ఎదురు చూస్తుందనైనా లేదా? తిన్నగా ఇక్కడికి వచ్చేస్తావా?"

రమ సమాధానమిచ్చింది, "అమ్మా ఈ నీ పిల్లకోసం వచ్చేసింది. నా ప్రాణం ఎక్కడ తల్లడిల్లుతుందో అని వచ్చింది. నన్ను క్షమించండమ్మా! పుచ్చుకోవడమే కానీ ప్రేమను ఇవ్వడం తెలియనిదాన్ని"

శాంత రమను దగ్గరికి తీసుకుంది. హిమ నవ్వుతూ తల్లి భుజం మీద తల వాల్చింది.

"రమా! నాదే పొరపాటు. మేమే ఇక్క డకు మొదట వచ్చేస్తే సరిపోయేది" ఆవిడ మనస్ఫూర్తిగా అంది.

'సహృదయత' అన్న పదం చిన్నదేకానీ దాని గొప్పతనం దానిదే! ఆ గుణం ఉంటే ప్రపంచంలో ఏ బాధా వారికి కలగదు. వాళ్ళ ఔన్నత్యం ఆకాశమంత పెరుగు తుంది.

శాంత, ఆనందరావుల సహృదయతకి రాఘవరావు శిరసు వంచి నమస్కరిం చాడు. స్నేహ పరిమళాన్ని వాళ్ళు ఎంత బాగా ఆఘ్రాణించారో అలవోకగా ఆయ నకు అర్థమైంది.

"నీ కూతురు బావుంది కదా! వాళ్ళను మాట్లాడుకోనియ్యి. నువ్వు ఆవిడకి పనిలో సాయం చెయ్యి. నేను ఈయనకి ఫలహా రాల్లో సాయం చేస్తాను!" ఆనందరావు భార్య వైపు చూసి, నవ్వుతూ అన్నాడు.

దాదాపు రెండు గంటలు గడిచాక కాబోలు, ఈ లోకంలోకి వచ్చింది రమ.

"హిమా! నువ్వు స్నానం చేసిరా? నేను నీ కోసం వెయిట్ చేస్తాను" అంటూ బాత్ రూంలోకి తోసింది.

"అబ్బ.. సుడిగాలి కదిలింది" సంజయ్ అక్కను వెక్కిరించాడు.

"ఏయ్ సంజూ!" రమ తర్జని చూపింది.

"ఓకే ఓకే రమక్కా? దానికి నిక్‌నేమ్ పెట్టను. గుంజీలు తీయమన్నావా?" నవ్వుతూ అడిగాడు.

సంజయ్ హిమ బ్యేగ్ వెదుకుతున్నాడు.

"సంజూ! నువ్వు లాయర్‌వి అని ఎవ రైనా అనుకొంటారా? అక్క రానీ!" రమ వాడి చెవి పట్టుకుంది.

ప్రభాత్‌కి వాళ్ళందరూ ఒకటిగా, తను వేరేవాడిగా కన్పిస్తున్నాడు. రమలో ఒక భాగాన్నే తాను చూశాడు. ఈ కోణాలు కొత్త. ఈ స్నేహం, ఈ ప్రేమ అతడికి వింతగా ఉన్నాయి. తనకీ ఫ్రెండ్స్ ఉన్నారు. కానీ ఇంతలా ప్రాణం పెట్టేవారు లేరు. అతడికి మొదటిసారి మంచి ఫ్రెండ్



ఉంటే బావుండనన్పించింది.

హిమ డ్రెస్ చేసుకుని వచ్చింది. తెల్లటి డ్రెస్‌పై జరీవర్క్. చాలా అందంగా ఉంది. చూపులకు తెల్లపావురంలాగుంది. చెవులకి తెల్లపొడుల ఫాషన్ టాప్స్ పెట్టుకుంది. మెడలోనున్న చక్కటి చైన్‌కి, అద్భుతమైన లాకెట్. విశాలమైన కళ్ళు కాటుక రేఖలతో అందంగా ఉన్నాయి. వంపు తిరిగిన పెదవులపై వెలసిన మనోహరమైన చిరునవ్వులోనే అందమంతా దాగిఉందా అన్పిస్తోంది.

రాఘవరావు పట్టుచీర, బంగారపు చైన్ ఉన్నవాచీ హిమకి అందించాడు.

హిమకి వాచీ ఎంతో నచ్చింది. రమకి తీసిన చీరలాంటిదే హిమకీ ఆయన కొన్నారు. సంజయ్‌కి రింగ్, డ్రెస్ ఇచ్చారు.

"నావి బాగా నచ్చాయి" అంటే, "నావి నీకంటే బావున్నాయి" అంటూ పిల్లలు పోటీపడ్డారు.

ఆ క్షణంలో రాఘవరావుకి రమ ఒక్కర్తే పిల్ల అని అన్పించలేదు.

సంజయ్ గారంగా రాఘవరావుతో అన్నాడు, "అంకుల్ వీళ్ళ వలన పాకెట్ మనీ పెరగక ఇబ్బందిపడుతున్నాను. ఇక నుంచి మిమ్మల్నే ఆశ్రయిస్తాను".

హిమ కంప్లైట్‌గా అంది "అంకుల్ పైసా కూడా ఇవ్వకండి వాడికి"

సంజయ్ వెక్కిరించాడు అక్కని. "అమ్మ పెట్టదట, అడుక్కు తిననీయదట.. అలా ఉందే నీ గొడవ. అంకుల్.. వాళ్ళు అమ్మాయిలు. నేనైతే అబ్బాయిని. జీవితాంతం మీకు తోడుగా ఉండేవాడిని" రాఘవరావుతో అన్నాడు.

"ఔను సంజూ? ఆ మాట యథార్థం" రాఘవరావు నిజాన్ని అంగీకరించారు.

"ఊ.. ఈ మాటలన్నీ ఇప్పుడే? రేపు భార్యామణి వచ్చాక వీడిని కొంగుకు కట్టుకుని తిరుగుతుంది. ఆవిడ కనుసన్నల్లో వీడు తిరుగుతాడు. అందుకే మేమే నయం" హిమ మూతి ముడిచింది.

సంజయ్ కొంటెగా అన్నాడు.

"నీ ఆరోపణలు అబద్ధమే! రమక్కను చూడు. ప్రభాత్ బావగారిని కొంగుకి కట్టుకుందా? కొంగుకు కట్టుకుంటే నీలాగ హాయిగా, సందడిగా తిరగగలిగేదా? పోనీ కనుసన్నల్లో పెట్టుకుందా? అదీలేదు. ఆ అక్కకి తమ్ముడినే! అలా ఎలా మాట్లాడావు? మనం 'ఆగు' అంటే దెబ్బకి భార్యామణి ఆగవలసిందే!"

ప్రభాత్ అక్కడ నుండి పని ఉన్నట్లు వెళ్ళిపోయాడు.

రమ, హిమ కొత్త బట్టలు కట్టుకుని, ఆనందంగా తిరుగుతూంటే ఇంట్లో వాళ్లకు చూడటానికి రెండు కళ్ళు చాలడం లేదు.

"రమా! మా కోరిక నువ్వు తీర్చేలాగ కనబడటం లేదు" హిమ రమను ఓరగా చూస్తూ అంది.

"నీ కోరికా? ఏమిటది? " రమ ఉత్సాహంగా అడిగింది.

"ఇలాగ నువ్వెప్పుడు కనబడతావా అని చూస్తున్నాం" హిమ పొట్టమీద ఎత్తుగా చెయ్యి పెట్టుకుని చూపిస్తూ అంది.

రమ బుగ్గలు కెంపులయ్యాయి. "ఏయ్! ఏమిటా మాటలు? "

"ఔను కావాలంటే మన వాళ్ళందరినీ అడగమన్నావా? ఔనంటారో, కాదంటారో తెలుస్తుంది. అమ్మా.." హిమ వాళ్ళను పిలవబోయింది. రమ చప్పున హిమ నోరు మూయబోతే ఆమె అందకుండా పరుగెట్టింది. రమ అనుసరించింది.

హిమను పట్టుకోవాలనే పంతంతో రమ... ఆమెకి దొరకకూడదని హిమ... ఇలా ముందు, వెనుక.. ఈలోపు ప్రభాత్ రమకు అడ్డుతగిలాడు.

పడిపోయే రమను అతడు రెండు చేతులతో పట్టుకుని ఆపాడు.

ప్రభాత్ అసంకల్పితంగా ఆమెను కౌగిలించుకుని ముద్దు పెట్టుకున్నాడు. రమ ముఖం ముద్దమందారమే అయింది.

"అబ్బ.. ఉండండి. ఎలాగైనా హిమను పట్టుకోవాలి? "

ప్రభాత్ ఆశ్చర్యంగా అడిగాడు "ఎందుకు? ఆమె నీకు దొరుకుతుందా? పందెం ఏదైనా వేసుకొన్నారా? "

"బావగారూ! నేను అడిగింది ఇవ్వమనండి" హిమ దూరం నుండి రమ రాకపోవడం వలన నవ్వుతూ అరిచింది.

"రమా! ఆమె ఊరుకోదు. ఆవిడ అడిగినదేదో ఇచ్చెయ్యి" ప్రభాత్ వెంటనే అన్నాడు.

"ఏమిటండీ! మీరు మరీను. తను ఒక పక్క ఆటపట్టిస్తుంటే.." రమ గొణిగింది.

"పోనీ! మీ ఫ్రెండ్ ఏం అడిగిందో చెప్పు. నేను ఇస్తాను" ప్రభాత్ భార్యతో సరదాగా అన్నాడు.

హిమ పడిపడి నవ్వడం మొదలుపెట్టింది, "రమా! బావగారికి నీమీద ఎంత ప్రేమ ఉందో చూడు. నీ బదులు ఆయనే ఇస్తారట"

రమ భర్తను గదిలోకి లాక్కువెళ్ళి, విషయం చెప్పింది. అతడూ వాళ్ళ నవ్వులతో పాలు పంచుకొన్నాడు.




**ర**మలో ఇప్పుడిప్పుడే మధురమైన ఆలోచనలు బయలుదేరుతున్నాయి. ఎంతో ఆనందంగా 'మేరేజ్ డే' జరుపుకొన్నారు. పెద్దలు తొందరపడుతున్నారని కాదు. తనకే ఒక బాబుగాని, పాపగాని కావాలన్పిస్తోంది. హిమ మాటలు గుర్తు వచ్చాయి.

"రమా! నీ అందం, నా చురుకుదనం, మన తెలివితేటలు, మీ నాన్నగారి మంచితనం కలగలిపిన అందమైన పాప కావాలోయ్ నాకు. నీ పాపతో ఆడుకోవాలని ఉంది" హిమ ఆ మాటలు ఎంత మధురంగా పలికింది!

"రమా గుడికి వెళ్దాం వస్తావా" పక్కింటామె పిలుపుతో ఊహల్లోంచి బయటపడింది రమ.

ప్రతీ శనివారం ఆవిడ వేంకటేశ్వర స్వామి గుడికి వెళ్తుంది. తీరిక ఉంటే రమ కూడా వెళుతుంది.

"వస్తానుండండి. తిరిగి వచ్చాక వంట చేస్తా" అంటూ ముస్తాబై బయలుదేరింది.

గుడిలో పూజ పూర్తి చేసుకొని ఇటు తిరిగిందో, లేదో తనను చిరాకుగా చూస్తూ లక్ష్మి కన్పించింది.

పక్కింటావిడ లక్ష్మిని పలకరించింది.

"ఏమే! ఈమధ్య ఎప్పుడూ కనబడలేదు. పనులు చేయడానికి మీ అమ్మకి సాయం కూడా రావడం లేదు? "

"నా పనులు నాకుంటాయి. ఇల్లిల్లూ పట్టుకుని తిరుగుతానా? " లక్ష్మి రుసరుసలాడుతూ వెళ్ళబోయింది.

పక్కింటావిడకి ఒళ్ళు మండింది.

"మరీ స్టైలుపోకు. రమ ఊరెళ్ళినప్పుడు మరి ఆమె ఇల్లు పట్టుకుని ఎలా తిరిగావ్! పిదపకాలం, పిదప పిల్లలు? " అని ఆవిడ బుగ్గలు నొక్కుకుంది.

"ఏదో.. మా అమ్మ వెళ్ళమంది కనుక వెళ్ళాను. ఇప్పుడు ఈవిడగారు వచ్చిందిగా! మా అమ్మ చేస్తుంది" అంటూ విసవిసా







వెళ్ళిపోయింది.

ఆకుపచ్చటి చీరకి సన్నటి జరీ అంచు, ఆకుపచ్చమీద చిన్న డిజైనుచీరకట్టులో రమ సంపెంగలాగ అందంగా ఉంది. రమ మెడలో పగడాల నెక్లెస్ ఎంతో బావుంది. సంతోషంగా ఉండటం వలన రమ మొహం వింత కాంతిగా ఉంది.

లక్ష్మి కళ్ళకి రమ సౌందర్యం సహించ రానిదిగా ఉంది.

అమ్మగారు గొప్ప అందగత్తె. అయినా అయ్యగారు చెప్పనే చెప్పారు, "ఆమె నీలాగా సరదాగా ఉండదు లక్ష్మి. నీ దగ్గర నేను కూడా చిన్నవాడినై పోయిన భావం కలుగుతోంది"

అయ్యగారు ఎంత మంచివారు? ఎంత బావుంటారు? అయినా ఈవిడ లెక్కచేయ దట. తను అయితే అయ్యగారు ఏం చేయ మంటే అది చేస్తాను.

"నీ కళ్ళల్లో నా మీద ఎంత ప్రేమ లక్ష్మి" అంటారు. తనకి ఆయన అలా మాట్లాడితే ఎంతో సంతోషంగా ఉంటుంది. ఈవిడ కంటే అయ్యగారికి తనే ఎక్కువ.

లక్ష్మి ఆలోచనలు ఇలా నడుస్తుంటే ఆ మె ప్రవర్తనకి రమ విస్తుపోయింది. తమ దగ్గర పనిచేసే పిల్ల ఎంత అణకువగా ఉండాలి. తన తల్లితో అప్పుడప్పుడు వచ్చేది కదా. దాని తల్లికి, తనకి ఉన్న అనుబంధం కూడా దీనితో లేదు. అలాంటిది ఇలా ప్రవర్తిస్తుందేంటి?

ఆ చూపులో ఎంత తిరస్కారం. నవ్వులో ఎంత హేళన? చిన్నపిల్ల చిన్న పిల్లగా ఉండక ఈ ప్రవర్తన ఏమిటి?

పక్కింటావిడ రమతో అంది, "చూడమ్మా! దాని జాణతనం! నువ్వు ఊరు వెళ్ళినప్పుడు, తప్పనిసరిగా మీ ఇంటికి వస్తుంది. అందుకని పలకరిం చాను. ఎలా వాగిందో? "

రమ తేలికగా అనేసింది. "పోనివ్వండి ఆంటీ. వాళ్ల అమ్మ ఏదైనా దెబ్బలాడిందే మో? చిన్నపిల్ల ఆ కోపం మనపై చూపి స్తుందేమో!"

ఆవిడ మాత్రం వదలలేదు, "ఎంతో పెద్దదానిలాగా చెపుతున్నావు కానీ దాని రాలుగాయితనం చూస్తుంటే నాకు ఒళ్లు మండుతుంది"

రమ మర్నాడు ఆదెమ్మతో విషయం చెప్పింది. ఆదెమ్మ నెత్తి బాదుకుని రమకి తన గోడు చెప్పుకుంది.

"అది మునుపటి పిల్ల కాదమ్మా! పను లకి తిన్నగా వెళ్ళదు. ఇంటిపట్టున ఉండదు. వారానికి, పది రోజులకి ఏదో కొంత డబ్బు తెచ్చి నాకు ఇస్తుంది. దాని దగ్గర డబ్బులు ఆడుతున్నాయి. మరి ఆ డబ్బు తెచ్చి సబ్బులు, పౌడర్లు, నూనె సీసాలు కొనుక్కుంటుంది. ఎప్పుడూ ఏవో ఆలోచనలే! మన మాటలు ఏం వింటుందో, ఏం వినదో? గంటలు గంటలు షోకు చేసుకుంటుంది. మునుపు ఈ తీరు లేదు. ఎవడిని మరిగిందో, ఏంటో? గడప దాటవద్దని ఈమధ్య నాలుగు బాదాను కూడా అయినా ఇనడం లేదు."

"మరివాళ్ల నాన్న ఏమీ అనడా? "

"ఆడి చేతిలో ఐదూ, పది పడేత్తోంది. పళ్ళు తెచ్చి ఇస్తాది. ఆడు దాని పక్షమైపో యాడు. దాన్ని తిట్టనీయడు. దానిని ఎనక ఏసికుని వత్తాడు. నేనే అరుస్తూ ఉంటాను" ఆదెమ్మ తన మనసులోని బాధంతా వెళ్ళబోసింది.

రమ మాత్రం ఏమంటుంది? లక్ష్మి ఎవరినైనా ప్రేమిస్తోందేమో? ఎవరైనా లక్ష్మిని పెళ్ళి చేసుకుంటానని నమ్మిం చారా?

ఆ మాటే ఆదెమ్మ ముందుంచితే, ఆమె నవ్వింది, "అది కూడా అడిగానమ్మగారూ!

కాదంది. తను పెళ్ళాడదట. ఇలాగే తనకి ఆనందంగా ఉందట. ఏటో అమ్మగారు? ఎట్టా ఈ పిల్లను ఒక అయ్య చేతిలో పెడతానో, ఏటో? " బెంగగా అందామె.

రెండు రోజుల తర్వాత ఈ విషయాలు భర్త దగ్గర ఏదో మాటల సందర్భంలో రమ అంది.

"మనకి అనవసరమైన విషయాలు ఎందుకు రమా? మన విషయాలు మనకు చాలవా? నువ్వు, నేను బస్.. చాలు" అంటూ ఆ విషయం తుంచేశాడు ప్రభాత్. అతడు మనసులో ఈ విషయం విన్న దగ్గర నుండి ఉలిక్కిపడుతూనే ఉన్నాడు. తాము వద్దన్నా లక్ష్మి వినకుండా సెకండ్ షో సినిమాకి తీసికెళ్ళమని గొడవ. ఎవరైనా చూస్తే ఎంత గొడవ? ఆమె వింటుందా? ఊహూ.. అన్నం మాని అలక. తనకి ఫోను మీద ఫోను. చివరికి ఇద్దరూ వెళ్ళారు. తమ ఎదురు ప్లాటు అతడు చూశాడు. ఏమవుతుందో.

రమను ఇరుగిళ్ళకి పొరుగిళ్లకి వెళ్ళవద్దని చెప్పాలి. ఒక విధంగా చూస్తే, రమ కాలక్షేపం కబుర్లకి ఇష్టపడదు. కానీ వాళ్ళే వస్తే తప్పదు కదా!

ప్రభాత్ సంశయాలన్నిటికి స్వస్తి చెప్పాడు. ప్రతి మగవాడు తన విషయాలన్నీ భార్యకు చెపుతాడా? ఏమీ చెప్పడు అనుకొని నిశ్చింతపడ్డాడు.

★ ★ ★

"అమ్మను చూడాలని ఉంది. వెళ్ళి ఒక పదిరోజులుండి వస్తాను" రమ ప్రభాత్‌ను అడిగింది.

"ఆరు నెలలు అవనీయవు. ఎప్పుడూ అటే దృష్టి నీకు. పెళ్ళి మానెయ్యా వలసింది. భర్త మీద, సంసారం మీద ఆసక్తి తక్కువ. పెళ్ళైనవాళ్లు పుట్టింటి ధ్యాస తగ్గించుకోవాలి" అతడు చిరాగ్గా చెప్పాడు.

"పెళ్ళైతే అందరినీ మరచిపోవాలా? మీ

## కొత్తగాలి...



**బతికున్నపుడు**
**చంపుకు తిన్నాడు!**
**వాడు చచ్చేడని**
**ఆమె ఒకటే రోదన!**

-శైలూషి, శ్రీకాకుళం

మగవాళ్ళు ఎప్పుడూ కన్నవారిని వదలరు కదా! మరి మాకెందుకు చెపుతారు? ప్రేమ, అభిమానం అందరికీ ఒకటే!" రమ నిష్ఠూరంగా చెప్పింది.

"ఎక్కౌంటులోని డబ్బు పదిహేను వేలు అడిగితే మాట్లాడవు. టాపిక్ మారుస్తావు. పర్మిషన్ మాత్రం కావాలి. నాకు అసలే డబ్బు ఇబ్బంది. పైగా నీ గొడవ ఏమిటి? " ప్రభాత్ అసహనంగా అరిచాడు.

రమకి చిరాకు వేసింది. "మీకు డబ్బు ఇబ్బంది లేనిదెప్పుడు? మీ జీతమంతా ఏం చేస్తారో తెలియదు? ఎప్పుడూ నా దగ్గరున్న డబ్బు మీదే ధ్యాస. పెళ్ళై ఇన్ని రోజులైంది. ఎప్పుడన్నా నా ఎక్కౌంటులో వంద రూపాయలైనా వేశారా? నా అవసరానికి నేను తీసికొన్నప్పుడల్లా రెడీ! అస్తమాను ఏది అడిగినా విషయం డబ్బు వైపు తెస్తారు" నాలుగు దులిపింది.

తర్వాత రమకి కళ్ళనీళ్ళు తిరిగాయి. ఒంట్లో బావుండటం లేదు. అన్నం తినబుద్ధి వేయదు. ఒకటే నీరసం. బద్ధకంగా ఉంటోంది. అమ్మను చూడాలన్పించి అడిగితే రాద్ధాంతం.

ప్రభాత్ రమను కొరకొరా చూశాడు. ఎంత ధైర్యం? తన జీతం, తన ఖర్చు వివరాలు కావాలట. తనను కన్నవాళ్లకే తాను చెప్పలేదు ఎప్పుడూ. ఈవిడకి చెప్పాలా?

ప్రభాత్ బూట్లు పాలిష్ చేసుకొంటున్నాడు. రమ టిఫిన్ తెచ్చి పెట్టింది.







అతడు దానివైపు చూడలేదు.

రమ నిస్తేజంగా పడుకుంది. అతడు అక్కడున్న మంచి నీళ్ళు తాగి, షూస్ వేసి కొని బయలుదేరాడు.

"సేమ్యా ఉప్మా చేశాను. తిని వెళ్ళండి" రమ తనను తానే సంబాళించుకుని చెప్పింది.

"వెధవ ఉప్మా! ఎవరు చెయ్యమని చెప్పారు? గోధుమ నూక ఉప్మా, సేమ్యా, ఉప్మా, ఉప్పుడు పిండి.. ఇవేగా నువ్వు చేసే టిఫిన్లు? వీటికోసం నేను చావటం లేదు" అతడు విసురుగా అన్నాడు.

ఎదుటివారి పరిస్థితి ఆలోచించడేం? తన గొడవే తనది. వెళ్ళనీ! ఇక బతిమాలే ఓపిక తనకు లేదు.

ఎదురింటామె చెప్పిన విషయం రమకి చెపుదామని పక్కింటావిడ వచ్చింది. ఎదురుగా ఉప్మా ప్లేటు చూసి విషయం అడిగింది. రమ కళ్ళ నీళ్ళు ఆపుకోలేకపోయింది, "ఒకపక్క ఒంట్లో బావుండలేదు ఆంటీ. ఉప్మా చేశానని కోపం. తల తిరిగినప్పటికీ, ఉప్మా ఎలాగో చేశాను" రమ చిన్నబోయిన మొహంతో అంది.

ఆవిడ రమను పరిశీలనగా చూసింది. రమ చిక్కి కనబడుతోంది. చక్కనమ్మ చిక్కినా అందమేనన్నట్లు బంగారు బొమ్మలాగుంది.

ఆవిడ మనసులోనే ప్రభాత్‌ను తిట్టుకుంది. "ఇంట్లో దీపంలాంటి భార్యను పెట్టుకుని వెధవ తిరుగుళ్ళు ఏమిటి?"

ఆవిడ రమ పక్కన కూర్చుని, నెమ్మదిగా రమ పీరియడ్స్ గురించి అడిగింది. రమ నాలుక కరుచుకుంది. ఔను. తను బయటచేరి నెలా ఇరవై రోజులు దాటింది. ఆవిడతో అదే చెప్పింది.

"మరింకేం? మీ నాన్నగారిని తాతగారిని చెయ్యబోతున్నావు. చాలా సంతోషమమ్మా! ఈ రోజుల్లో మూడోనెల రావాలనే పట్టింపు లేదు. డాక్టర్ దగ్గరికి వెళితే టెస్టుచేసి గర్భం అవునో, కాదో చెప్పేస్తున్నారు. అయినా మీ అమ్మగారు, అత్తగారు ఎలా చెబితే అలా చేద్దాం" ఆవిడ తేల్చేసింది.

రమకి తల ఎత్తి ఆవిడను చూడటానికి కూడా సిగ్గు వేసింది. ఆవిడ రమ బుగ్గలు పుణికింది.

"నీకు బిడ్డ పుడితే నాకు కావలసినంతగా కాలక్షేపం. పసిపిల్లలంటే నాకు ప్రాణం. ఆడజన్మ ఎంత మధురమైనది. మరొక ప్రాణికి మనం జన్మ ఇస్తాం! కూతురిగా, భార్యగా పొందే అనుభూతి కంటే తల్లిగా పొందే ప్రేమ ఎంతో గొప్పది. పిల్లా పాపలతో చల్లగా ఉండు" ఆవిడ పారవశ్యంగా చెప్పింది.

అపురూపమైన ఆవిడ మాటలకు రమ తల ఎత్తింది. జీవనసత్యం చెప్పుతున్న తృప్తి ఆవిడ మొహంలో కన్పిస్తోంది. రమ విప్పారిన కళ్ళతో ఆవిడను చూసింది.

"ఒకరికి కూతురిగా, మరొకరికి భార్యగా, మరొకరికి కోడలిగా, వేరొకరికి తల్లిగా, మనవలకి, మనవరాళ్లకి అమ్మమ్మగా, మామ్మగా ఓహో... స్త్రీ జీవితానికి ఎన్ని పదవులు? ఎన్ని అనుభూతులు? మలుపు మలుపులో ఆనందమే! మళ్లీ జన్మంటూ ఉంటే ఆడదానిగానే పుట్టాలని, ఈ ఔన్నత్యాన్ని అందుకోవాలని భగవంతుడిని నేను ప్రార్థిస్తానమ్మా!" ఆవిడ తాదాత్మ్యత నుండి ఇవతలికి వచ్చింది.

"సరే.. సరే.. అతడి సంగతి వదిలెయ్యి. ముందు నువ్వు ఈ టిఫిన్ తిను" ఆవిడ అభిమానంగా రమ చేతికి టిఫిన్ ప్లేటు అందించింది. రమకి ఆ క్షణంలో ఆమెలో అమ్మ కన్పించింది.

చాలా సంతోషం అన్పించింది. తల్లికి తండ్రికి ఫోను చెయ్యాలంటే సిగ్గేసింది. ఏం చెప్పాలి? ఎలా చెప్పాలి? ముందు

ప్రభాత్‌కి చెపితే, అతడు చెపుతాడేమో? సరే.. అలాగే చేద్దాం అనుకుంది.

సాయంత్రమే పనిమనిషిచేత సన్నజాజుల దండ తెప్పించుకుంది. పక్కింటావిడ సంపెంగలిచ్చి, రమను పెట్టుకోమంది.

ప్రభాత్‌కి ఇష్టమైన బెండకాయ వేపుడు, కొబ్బరి పచ్చడి చేసింది. స్నానం చేసి సన్నటి ఎరుపు అంచు ఉన్న తెల్లచీర కట్టుకుంది. పాముకుబుసం లాగ సన్నటి, తెల్ల చీరలో రమ ఎంతో బావుంది. జడలో పూవులు తురుముకుని టీవీ చూస్తూ ప్రభాత్ రాక కోసం చూస్తోంది.

తామిద్దరం ఒకటి, తమకి ఒక బాబో, పాపో.. ఎవరైనా ఒకటే! తమ బంధాన్ని పెంచినవాళ్ళు, తమకి అనురాగం పంచే వాళ్ళు, తమ అనురాగాన్ని పెంచేవాళ్ళు. హిమ ఈ వార్త వింటే ఎంత ఆనందపడుతుందో?

రమ చెయ్యి పలుచగా, బంగారు రంగులో మెరుస్తున్న తన పొట్ట మీదకు వెళ్ళింది.

"బాబూ! నువ్వు అమ్మకోసం వస్తున్నావా? హిమ పిన్నికి నువ్వు కావాలటరా! ఎప్పుడు నువ్వు బయటకు వచ్చి అమ్మమ్మని, తాతగారిని నాన్నగారిని చూస్తావు? త్వరగా వస్తావా? " రమ కడుపులో ఊపిరి పోసుకుంటున్న శిశువుతో ముచ్చట్లు చెపుతోంది.

తలుపు తీయమని కాలింగ్‌బెల్ మోత. రమ ఒక్క ఉదుటన లేచింది. ఆమెకి మనసు ఎంతో ఉద్వేగంగా ఉంది. అతడి చెవిలో ఆ వార్త వెయ్యాలని, భార్యగా తను అతడికిచ్చే అపురూప కానుక గూర్చి చెప్పాలని తనూ తహతహలాడుతోంది.

"ఎంతసేపు బయట నిలబెడతావు డియర్. త్వరగా" అంటున్న ప్రభాత్‌ను రమ రెప్పపాటుగా చూసింది.

అతడి నుండి డ్రింక్ వాసన గుప్పుమంది. రమ మనసు దెబ్బతింది. తలుపు తీసిన మనిషి, అతడు లోపలికి వెళ్ళేవరకు పక్కకి ఒదిగి అలాగే నిలబడింది.

"ఏమిటి డార్లింగ్? నా కోసమేనా ఇంత బాగా అలంకరించుకొన్నావు? " మాట ముద్దగా వచ్చింది.

"మీరు.. మీరు తాగి వచ్చారా? " రమ దెబ్బతిన్న దానిలాగ అడిగింది.

"అబ్బ.. ఏవో ప్రశ్నలు అడుగుతావు. నా మూడ్ చెడగొడతావు. తాగితే తప్పేంటి? " అతడు చిరాగ్గా అడిగాడు.

రమకి ఒళ్ళు మండింది "ఛీ.. ఇంత చదువుకున్నారు. తాగితే తప్పేంటంటూ అడుగుతున్నారా? "

అతడు పకపకా నవ్వాడు.

"రమా! విద్యకి వ్యసనానికి సంబంధం లేదు. ఆ మాటకి వస్తే విద్యావంతులే ఎక్కువగా వ్యసనాల పాలవుతున్నారు. ఫ్రెండ్స్ పార్టీ అడిగారు. నువ్వు ఊరెళ్ళినప్పుడు ఇస్తానన్నా వదలలేదు. 'జలజ'కి నాకు మంచి స్నేహం ఏర్పడిందని వాళ్ళు అడిగారు. సరే. ఇచ్చాను" అంటూ బాత్‌రూమ్‌కి తూలుకుంటూ వెళ్ళాడు.

రమ స్థాణువయింది. ఏమిటితడి జీవితం? ఈ మనిషి జీవితంలో తను ఎలా ఇముడుతుంది? మంచం మీద పడుకోబోతున్న అతడిని అడిగింది.

"జలజ ఎవరు? "

అతడు ఆమెను చెయ్యి పట్టుకుని దగ్గరగా లాక్కున్నాడు. ఆమె తూలి అతడి గుండెలపై పడింది.

"ఛీ.. ఛీ.. వాసన... నన్ను వదలండి" ఆమె పెనుగులాడింది. అతడు వదలడం లేదు.

"ప్లీజ్.. నాకు నీరసంగా ఉంది. నన్ను వదలండి" రమ బతిమాలుతూ అడిగింది.

"ప్లీజ్ రమా! నువ్వు ఎంత బావున్నావో? పాపం. నా కోసం అలంకరించు






కొన్నావు. ఎదురు చూస్తున్నావు? నిన్ను నిరాశపరచడం తప్పుకదూ!" అతను ఆమెను గట్టిగా బంధించి, ఏ వార్తను తీయగా పెదవి విప్పి చెప్పాలనుకొందో వాటిని బలంగా వశపరచుకొన్నాడు.

భోజనం చెయ్యలేదన్న ఆలోచన లేదు. ఒక మృగంలాగా ప్రవర్తిస్తున్నాడు. ఆమె శరీరం అతడి చేష్టలతో నలిగిపోతోంది.

తను రాసుకొన్న గేయాలు, ఊహించిన ప్రేమ సన్నివేశాలు, కనుల ముందునుండి కలగా జారిపోతుంటే, రమ బాధగా కళ్ళు మూసుకుంది.

"ఈ సమయంలో కన్నీరు ఏమిటి రమా? నా దగ్గర జలజ ఎంత హాయిగా ఉంటుందో తెలుసా? నాకు.. నాకు స్వర్గం చూపిస్తుంది. నువ్వు మాత్రం నన్ను చూసి ముడుచుకొనిపోతావు ఎందుకు? ఓ.. నీకు పంచవలసిన ప్రేమ వాళ్లకు పంచాననా? లేదు. లేదు. నువ్వు నువ్వే. వాళ్ళు వాళ్లే.. నువ్వు నా భార్యవి. నా బంగారానివి. నా లక్ష్మివి" అతడు ఏవేవో మాట్లాడుతున్నాడు.

అలసి సొలిసి చివరకు నిద్రలో ఒరుగుతూ అంటున్నాడు, "రమా! నీకు అన్యాయం చేయను. నిన్ను వదలను. నీ మీద ఒట్టు"

అతడు నిద్రలోకి జారిపోయాడు. రమ ఎంతసేపు అలాగ పడుకుందో ఆమెకి తెలియదు. ఎలాగో లేచి మంచినీళ్ళు తాగి, లైట్లు ఆర్పి పడుకుంది.

సాయంత్రం వరకూ మనసు పొందిన ఆనందం, ఉద్వేగం, ఈ రాత్రి సమయంలో పొందిన దుర్భర సమాగమం, అనుచిత ప్రేలాపన ఆమెను చీల్చివేస్తున్నాయి.

ఇదేనా జీవితం? చీకటి వెలుగుల సమాహారమే జీవితమా? సుఖదుఃఖాల కలయికే ఈ ప్రస్థానమా? లేత తమల పాకులాంటి చెక్కిళ్ళు, ధారలుగా ప్రవిస్తున్న కన్నీళ్ళతో మలినమైపోసాగాయి.

ఆమెకి ఆ క్షణంలో మహా రచయిత శరత్ గుర్తు వచ్చాడు. "ఓ స్త్రీ! నీ మనసు, శరీరం గాయాలైనా, వాటిని దాచుకొనే సమర్థత నీకే ఉంది. వాటిని బయట ప్రపంచానికి చూపించకు!"

ఆయన సృష్టించిన పాత్రలను చూసి తను జాలిపడింది. బాధపడింది. మరి తన పాత్రను చూసి ఏంచేయాలి? ఈ చేదును ఎలా భరించాలి? సన్నగా బయలుదేరిన తలనొప్పి, మహా వృక్షమై బాధించసాగింది.

★ ★ ★

ఉదయం ఎలా లేచిందో, ఏం చేస్తోందో, ఆమెకే తెలియలేదు. నిస్ప్రాణగా, ఒక జీవచ్ఛవంలా పనులు ప్రారంభించింది.

పక్కింటామె వచ్చి ప్రభాత్‌తో మాట్లాడుతోంది. రమ వంటింట్లో నుండి, ఇవతలకి రాలేదు.

"ప్రభాత్! నువ్వు నాకు పార్టీ ఇవ్వాలయ్యా? " ఆవిడ అథార్టీగా అడిగింది.

"ఎందుకు ఇలా ఉదయమే వచ్చి నిద్ర పాడు చేసినందుకా? " అతడు చిరుకోపంతో అన్నాడు.

ఆవిడ పకపక నవ్వింది. "భలేవాడివే! నేనేమిటి? రేపు నీకు పుట్టబోయే కొడుకు కూడా ఇలాగే నిద్ర పాడు చేస్తాడు. వాడిని ఏం చేయగలవు? ఊ.. రాత్రి రమ శుభవార్త చెప్పింది కదా! ఈ రోజు సాయంత్రం మా నోళ్ళు తీపిచెయ్యి" ఆవిడ ఆర్డరు వేసింది.

అతడు సంబరంగా వింటున్నాడు.

"రమ లేదా? " ఆవిడ అడిగింది.

"బాత్‌రూంలో ఉందేమో? " అతడు చెప్పాడు. రమ ఉంటే వచ్చి, కాలింగ్‌బెల్ విని తలుపు తీస్తుంది కదా అనుకొన్నాడు.

"సరే! రమలాంటి భార్యను పొంది, పిచ్చి వేషాలు వేయకు. పనిపిల్లతో నిన్ను



హాలులో చూశానని ఎదురింటాయన చెప్పాడు. పాపం రమకి ఎంత కష్టం వచ్చిందని. ఆవిడ ఒకటే ఇదయిపోయి నాకు చెప్పింది. రమ బాధపడుతుందని నేను అనలేదు" ఆవిడ దీర్ఘంగా ఒక ఉపన్యాసం ఇచ్చి, అతడిని మందలించి, జాగ్రత్తలు చెప్పి వెళ్ళింది. చివరగా కాఫీపొడి కప్పు రమకి ఇవ్వమంది.

ప్రభాత్ ఆవిడ వెళ్ళగానే తలుపు వేసేశాడు. రమ ఆ గదిలోకి వచ్చి, కప్పు తీసికొని వెళ్ళిపోయింది. అతడు భయంగా, ఆమె వెళ్ళినవైపు చూశాడు.

పక్కమీద పడుకొన్నాడే కానీ మనసు అశాంతిగా ఉంది. తను రాత్రి ఇంటికి ఎలా వచ్చాడో గుర్తు వచ్చింది. జలజ తనకి అంత త్వరగా పరిచయమవుతుందని, అది అంత బాగా ఎదుగుతుందని అతడు అనుకోలేదు.

ఒకసారి కలిసినప్పుడు నర్మగర్భంగా అంది "చిన్నపిల్లలు తప్ప పెద్దవాళ్ళు, అందమైన వాళ్ళు మీకు నచ్చరా? "

తనూ అంతే నిగూఢంగా అడిగాడు "ఎందుకు నచ్చరు? వాళ్ళు ఒప్పుకోవద్దూ"

ఆమె గడుసుగా నవ్వింది "మా పాప 6 గంటల నుండి 7.30 నిముషాల వరకూ ట్యూషన్‌కి వెళుతుంది"

ఆ మాత్రం హింట్ చాలు తనకి. ఈ సిటీలో ఎవరి గొడవ ఎవరికి కావాలి? తామిద్దరూ పాప కంటికి మాత్రం కనబడకూడదనుకున్నారు.

అయినా అక్కడున్న వాళ్ళు ఆరాగా ఒకసారి అడిగారట, "జలజ తడుముకోకుండా చెప్పింది. ఆయన మా అన్నయ్య ఫ్రెండ్. నా మంచి చెడ్డలు చూడమని అన్నయ్య అప్పచెప్పాడు. అందుకు వస్తూంటారు"

తన ఫ్రెండ్స్‌కి జలజ ఫోను కాల్స్ వలన విషయం అర్థమైంది. వారికి పార్టీ ఇచ్చి రమకి తను దొరికిపోయాడు.

తను ఇంటికి వస్తే రమ శుభవార్త చెప్పాలనుకొంది కాబోలు. తను ఎలా వచ్చాడు? ఏం చేశాడు? తన నోటితో ఏం వాగాడో?

తను తండ్రి కాబోతున్నాడా? రమ.. అంటే గర్భవతి. అతడికి రమను ఎలా ప్రసన్నం చేసుకోవాలా అన్పించింది. ధైర్యంగా లేచి వంటింటి వైపు వెళ్ళాడు.

రమ కాగుతున్న పాలను చూస్తోంది. అతడు వెనకనుండి వచ్చి ఆమెను బంధించాడు. అతడికి ఆమె మొహం చూడటానికి ధైర్యం చాలలేదు.

ఆమె తలపై తన చుబుకం పెట్టి, మృదువుగా అడిగాడు "రమా! నేను విన్నది నిజమేనా? "

రమ మాట్లాడలేదు. కంపరంగా అతడి చేతులు తీసెయ్యబోయింది. అతడు ఆమె పాపిటలో వెనుకనుండి ముద్దు పెట్టుకున్నాడు.

"రమా! ఇంత మంచివార్త విన్పించినందుకు నీకు ఏం బహుమానం కావాలి? " అతడు అడిగాడు.

"బహుమానం రాత్రి ఇచ్చారుకదా! ప్లీజ్.. నన్ను వదలండి. మీ జీవితంలో ఎందరు ఆడవాళ్ళు ఉన్నారో, నేను ఊహించలేను. ఛీ.. ఛీ.. వారిని తాకిన చేతులతో నన్ను ముట్టుకోకండి" ఆమె ఎలాగో శక్తి తెచ్చుకుని అతడి చేతులను విడదీసింది.

"నా మనసు ఆలోచించే స్థితి కోల్పోయింది. దయచేసి నా జోలికి రావద్దు. ఈ తుఫాను తట్టుకుని నన్ను నిలబడనీయండి. ప్రశాంతంగా బతకనీయండి". ఆమె రెండు చేతులు జోడించి, అక్కడి నుండి వెళ్ళిపోయింది.

అతడు ఆమె వెళ్ళినవైపు చూస్తూ నిలబడిపోయాడు. రమ మనసును తను బాధపెట్టాడు. అతడు తన పడక గదిలోకి వచ్చాడు. అక్కడ రమ చేతి గాజుము

క్కలు కన్పిస్తే అతడు మొహం తిప్పుకొన్నాడు.

రమ నిస్సత్తువగా కుర్చీలో కూలబడింది. ఆదెమ్మ రావడమే సోది ప్రారంభించింది, "అమ్మగారూ! మా పాపిష్టి పిల్ల ముట్టవలేదు. ఏ వెధవతో తిరిగిందో తెలియదు. నిన్న దాన్ని ఆసుపత్రికి తీసికెళ్ళి ఆబార్షన్ చేయించాడు. వెధవ గుంట. తీగలాంటిది చందమామలాగ చిక్కిందమ్మా! అందుకని నిన్న రాలేదు. పని మీరే చేసుకొన్నారుట. పక్కింటామె దెబ్బలాడింది 'అమ్మగారు నీళ్ళు పోసుకున్నారు. పని నాగాలు పెట్టకు' అని. మరెప్పుడూ మానను" అంటూ పనిలోకి చొరబడింది.

ఆమె మాటలన్నీ ప్రభాత్ కూడా విన్నాడు. ఏం మనిషో రమకి ఇప్పుడే అన్నీ తెలియాలా? వెధవ వాగుడూ.. ఇదీ.. అని తిట్టుకున్నాడు.

లక్ష్మి తనకు విషయం చెప్పింది. తాను దాన్ని అబార్షన్ చేయించుకోమని చెప్పాడు. అలాగైతే దాన్ని వదలనన్నాడు. ఆ మంత్రం లక్ష్మి మీద పనిచేసింది కాబోలు.

ఆదెమ్మ చెప్పిన తరువాత లక్ష్మి మంచితనం గుర్తు వచ్చింది. పాపం పిచ్చిపిల్ల. చెప్పిన పనిచేసింది. దానికి వాచీ సరదా! ఒక వాచీకొని ఇవ్వాలి అనుకొన్నాడు.

రమకు తన ప్రాణశక్తి అంత ఎవరో లాగేసినట్లు అన్పిస్తోంది. ఏంచేయాలి? ఏం చేయగలదు?

ప్రభాత్ స్టవ్ మీదనుండి పాలు తీసి, హార్లిక్సు కలిపి, రమకి తీసికొని వచ్చాడు.

"రమా! రాత్రి కూడా నువ్వు ఏమీ తినలేదు. ఈ పాలు తాగు" అతడు అందించాడు.

"వద్దు.. వద్దు.. దయచేసి మీరు నటించవద్దు. మీ కపట ప్రేమను నేను నమ్మను" రమ అరిచింది.

"నాది కపట ప్రేమా?" అడిగాడు.

## కొత్తగాలి...

**ఉదయం**
**అమాయక చక్రవర్తే**
**మధ్యాహ్నమయ్యేసరికి**
**మండిపడే అధికారి**
**సూరీడు**

-బద్ది నాగేశ్వరరావు, అనకాపల్లి

"కాక..ఒక మనిషిని మనం ప్రేమిస్తే.. ఆరాధిస్తే.. వాళ్ళ కాల్లో చిన్న ముల్లు గుచ్చుకున్నా విలవిల్లాడతాం. వాళ్ల కంట్లో నలక పడితే మన గుండెల్లో బల్లెం దిగినట్లు బాధపడతాం.. అలాంటిది ప్రేమ అంటూనే మీరు ఇంత గాయం చేశారు. ఒకపక్క నాతో ఉంటూ, అడ్డమైన వాళ్ళతో సంబంధాలు పెట్టుకున్నారు. మీకు, ఒక పశువుకు తేడా ఏమిటి?" నిలదీసింది.

ప్రభాత్ రెచ్చిపోయాడు. ఆమె చెంప చెళ్ళుమన్పించాడు, "నన్ను పశువు అంటావా? ఎంత ధైర్యం?" అరిచాడు.

రమ నిశ్చేష్టురాలయింది.

తనను.. తనను.. అతడు కొడతాడా?

"శతమానం భవతి.." అంటూ వేదమంత్రాలతో బ్రాహ్మణోత్తముల ఆశీస్సులతో, భార్యగా అతడి జీవితంలో అడుగుపెట్టిన.. తనను నిర్దాక్షిణ్యంగా కొడతాడా?

అతడికి ఒక బిడ్డను ప్రసాదించి, అతడి వంశాన్ని నిలబెట్టే తనను కొడతాడా? మంచిచెడు, కష్టంసుఖం అతడితో కలిసి బతకాలని, నూరేళ్ళూ జీవితం పంచుకోవాలని వచ్చిన.. తనను కొడతాడా?

ఏం తప్పు చేసింది తను? ఔను.. తప్పే చేసింది. మల్లెపూవులాంటి మనసును అపాత్రదానం చేసింది. సన్నజాజిపూవులాంటి తనువును పశువు లాంటి మనిషికి అర్పించింది. ఛీ... ఛీ... రమకు తన మీద తనకే అసహ్యం వేసింది. రాత్రి



నుండి ఏమీ తినలేదేమో. కళ్ళు తిరగసాగాయి. ఒళ్ళంతా చెమటలు దిగకారసాగాయి. ప్రపంచం గిర్రున తిరిగిపోతోంది. అంతవరకే తెలుసును ఆమెకు.

ప్రభాత్ కింద పడిపోతున్న రమను గబుక్కున పట్టుకొన్నాడు. ఎత్తుకొని, తీసికెళ్ళి మంచంమీద పడుకోపెట్టాడు. వెంటనే డాక్టరు దగ్గరికి బయలుదేరుతూ, పక్కింటావిడను పిలిచి రమ దగ్గర కూర్చోపెట్టాడు.

డాక్టరు ఇంజక్షన్ చేసి మందులు రాసింది. ఆమె చాలా నీరసంగా ఉందని, జాగ్రత్తగా చూడమని చెప్పి వెళ్ళింది.

ప్రభాత్ మందులు తేవడానికి వెళ్ళాడు. రమ అసలు అతడివైపే చూడలేదు.

ఆ రోజుకు పక్కింటావిడే వంటచేసి పెట్టింది. బలవంతంగా రమచేత భోజనం చేయించింది.

"నువ్వు ఒక్కదానివే అనుకొంటున్నావా? నువ్వు మాడితే, నీ కడుపులోని బిడ్డకూడా మాడతాడు. తెలిసిందా? నువ్వు నీ ఆహారంలో ఆహారం, నీ ఊపిరిలో ఊపిరి, నీ రక్తంలో రక్తం వాడికి పంచి ఇవ్వాలి. తెలిసిందా? కాసేపు పడుకో! మళ్ళీ వస్తాను" అంటూ రమకు అన్నం పెట్టి ఆవిడ వెళ్ళింది.

రమ భోజనం చేశాక ప్రభాత్ ఊపిరి పీల్చుకొన్నాడు. తనూ వెళ్ళి నాలుగు ముద్దలు తిన్నాడు. ఇంజక్షన్ ప్రభావం వలన ఆమె ఒక గదిలో, నిద్ర పట్టక అతడు ఒక గదిలో పడుకొన్నారు.

★ ★ ★

"మామయ్యగారూ! నేను.. ప్రభాత్‌ను మాట్లాడుతున్నాను"

మీకు ఒక శుభవార్త.. ప్రభాత్ చెప్పబోతుండగా అతడి చేతిలోని సెల్ రమ లాక్కొంది.

అతడు, ఇంటిని మామూలు స్థితిలో ఉంచాలంటే అత్తమామల వలననే అవుతుందనుకొన్నాడు. అందుకే వాళ్ళకి ఫోను చేసి, రప్పించాలనుకొన్నాడు. కూతురు తల్లి కాబోతోందంటే వాళ్ళు తప్పక వస్తారు. అప్పుడు రమ ఏం చేస్తుంది?

తల్లి దండ్రులను నొప్పించగలదా? వారి ఆశలను తుంచెయ్యగలదా? తన కడుపులో పెరుగుతున్న తన బిడ్డను మోయకుండా ఉంటుందా?

ప్రభాత్ ఆలోచనలు ఆమె చర్యతో ఆగిపోయాయి. "అది కాదు రమా! నువ్వు తల్లివి కాబోతున్నావని మావయ్యకు, అత్తయ్యకు చెపుదామనుకొన్నాను. అంతే!"

రమ అతడివైపు చూడలేదు. ఎవరితోనో చెపుతున్నట్లు అంది, "నాకు.. నాకు ఈ బిడ్డ వద్దు. ఒక తిరుగుబోతు బిడ్డకు నేను తల్లిని కాలేను. ఈ కడుపు నాకు వద్దు... వద్దు"

అతడు అదిరిపడ్డాడు. రమ అలాంటి పని చేస్తానంటుందని అతడూహించలేదు.

"లక్ష్మికి అబార్షన్ చేయించారు కదా! నేనూ చేయించుకొంటాను. లక్ష్మితో మీ తిరుగుళ్ళు ఎలా తెలిశాయా అని ఆశ్చర్యపోకండి. మన ఇంటికి వచ్చే ఫోన్లు, కోవెలలోని ఆ పిల్ల ప్రవర్తన, పొరుగు ఇంటి వాళ్ళ మాటలు.. అన్నీ తెలియచేశాయి. దాని ఇంటికి పక్కింటి ఆంటీ వెళ్ళి రెండు పీకి వచ్చింది. అయినా అభం శుభం తెలియని పసిదాన్ని పడగ్గదిలోకి లాగారంటే మీరసలు మనుషులేనా? "

అతడు ఆశ్చర్యంగా విన్నాడు. ఈ రెండు రోజులలో ఇన్ని విషయాలు జరిగాయా? మొదటిసారిగా ఆడవాళ్ళు చురుకుగా ప్రవర్తించగలరని తెలిసిందతడికి.

"నేను బయటకు వెళ్ళాక మీ ఇంటికి ఫోను చేస్తే" అతడు పెంకిగా అడిగాడు.

"చెయ్యండి. అప్పుడు ఉన్న వాస్తవాలన్నింటినీ నేనే చెపుతాను. నేను ఆలోచిం

చుకుందుకు కొంత టైము కావాలనుకొన్నాను. మీరు తొందరపడితే ఏం చేస్తాను? " రమ నిశ్చలంగా చెప్పింది.

అతడు కోపంగా వెళ్లిపోయాడు. కంపెనీకి వెళ్ళగానే లక్ష్మి నుండి ఫోను. అతడికి ఒళ్ళుమండింది.

"ఏం కొంప మునిగిందని ఇప్పుడు ఫోను చేశావు? " తీవ్రంగా అడిగాడు.

అతడి తీవ్రతకి ఆ పిల్ల బెదిరింది.

"మీరు చెప్పినట్లే చేశాను"

"అయితే ఏమిటంటావు? " అడిగాడు.

"నాకు మిమ్మల్ని చూడాలని ఉంది. హాస్పిటల్ నుండి వచ్చినప్పటి నుండి మా అమ్మ గొడవ. మన విషయం మా ఇంటి కాడనున్న వాళ్ళకి, మీ ఇంటికాడ వాళ్ళకి తెలిసింది!" భయపడుతూ చెప్పింది.

"నువ్వేకదా! టముకు వేసి మరీ చెప్పావు" అతడు అడిగాడు.

ఆమెకూ కోపం వచ్చింది.

"చెప్పేదాన్ని అయితే ఎప్పుడో అందరకూ చెప్పేదాన్ని. అలా చెప్పానా? ఈ జన్మకి పెళ్ళి ఆశ లేదని, మీతో ఇలా ఉండి పోదామని ఎందుకు అనుకొంటాను? " ఉక్రోషంగా అంది.

అతనేం మాట్లాడలేదు.

"ప్రతి సినిమాలో శోభన్‌బాబుకి ఇద్దరేసి పెళ్ళాలు ఉండేవారు కదా! అట్టాగే మీరు మా ఇద్దరితో ఉంటారనుకొన్నాను" లక్ష్మి మాటలలో నిరాశ.

లక్ష్మిలాంటి వాళ్ళను సినిమాలు, టీవీలు ఎంత ప్రభావితం చేస్తున్నాయో? ఒక హీరో, ఇద్దరు హీరోయిన్లను మన వాళ్ళు గొప్పగా అనుకొని చూపిస్తారు. అవసరమంటే ఇద్దరితో హీరోకి పెళ్లి జరిపేస్తారు. అనవసరమనుకొంటే నిర్దాక్షిణ్యంగా ఒకరిని చంపేస్తారు.

విద్యావంతులకైతే సినిమాలు, జీవితం వేర్వేరు. కానీ లక్ష్మిలాంటి నిరక్షరాస్యురాలికి సినిమాయే జీవితం. జీవితంలో ప్రతి



**కొత్తగాలి...**

**తూర్పు**
**నేర్పింది ఓర్పు**
**పడమర**
**చేసింది నిన్నొక మర**

*–గరిమెళ్ల నాగేశ్వరరావు, కొమ్మాది, విశాఖ*

విషయాన్నీ సినిమాకు అన్వయిస్తారు.

"అయ్యగారూ! మీరు మనం కలిసేచోటికి రావాలి. రాకపోతే, నేను విషం తాగి చస్తాను. మీరే నా చావుకి కారణమని రాస్తాను" లక్ష్మి స్థిరంగా చెప్పింది.

"ఏం బెదిరిస్తున్నావా? " కోపంగా అడిగాడతను. "నేను ఎందుకు బెదిరిస్తాను? మీలాంటి వాళ్ళు ఆ పని చెయ్యగలరు. మా అమ్మ నన్ను కొట్టింది. అయినా నేను మీరే నన్నుపాడు చేశారని చెప్పలేదు. మా అయ్య తిట్టాడు కడుపు తీయించానని. అయినా అది నా తప్పే నని చెప్పాను. మీరేనని ఆళ్ళకి తెలియదు.

మీ పక్కింటామే వచ్చి మనల్ని బయటకు లాగింది. అప్పుడైనా మా వాళ్ళు వచ్చి మిమ్మల్ని అడుగుతానంటే, నేను విషం తాగి చస్తానని బెదిరించాను. వాళ్ళు ఆగిపోయారు. నేను సెడ్డదాన్నయితే ఇవి జరగకుండా ఆపుతానా? " నిలదీసింది.

తర్వాత మెల్లగా "అయ్యగారూ! నాకు బిడ్డలు వద్దు, తాళివద్దు. మీరు మాత్రం కావాలి" తను ఇంకా మాట్లాడబోతూంటే అతడు ఆపాడు.

"నేను వస్తాను. నువ్వు ఇంక మాట్లాడకు. రేపు కలుద్దాం" చెప్పి ఫోను ఆఫ్ చేశాడు.

"ఏమైనా నువ్వు లక్కీ! అడుగు కదిపావా, ఆడవాళ్ళు వెంటపడతారు. మా మొహాలకు ఒక్కరు కూడా పడరు" ప్రభా





## కొత్తగాలి...

**మాట, బాణం**
**వదిలితే తిరిగిరావు**
**రెండూ వాటి లక్ష్యాన్ని**
**నెరవేర్చుకుంటాయి**

*-ప్రభాకర్ తల్లాప్రగడ, హైదరాబాద్*

త్‌ను అసూయగా చూస్తూ ఫ్రెండ్ అన్నాడు.

ప్రభాత్ నవ్వాడు. "అది కూడా ఒక కళ గురూ! ఆడవాళ్ళను ఆకట్టుకోవడం, మన చుట్టూ తిప్పుకోవడం, తీయగా కబుర్లు చెప్పడం.. ఇవన్నీ చెపితే వచ్చేవి కావు."

"గురూ! ఆడవాళ్ళు, ఆటంబాంబు ఒకటే! అతిశక్తివంతమైనవి. వికటించాయా, అంతు చూస్తాయి" మరొకరు నవ్వుతూ వ్యాఖ్యానించారు.

★ ★ ★

రాఘవరావు రమకు ఫోను చేశారు "అమ్మా! నిన్ను చూడాలని ఉంది. నెట్ ఆన్ చెయ్యి తల్లీ!"

రమ కాదనలేకపోయింది. తండ్రి తనను ఇలా చూస్తే తట్టుకోలేరు. ఏం చెయ్యడం?

"అల్లుడుగారు ఏదో శుభవార్తని చెప్పబో యారు. ఏమిటమ్మా అది?" ఆయన ఆశగా అడిగారు.

తను తాత కాబోతే అమ్మాయి చెప్ప కుండా ఉంటుందా? మరి ఇంక ఏ విషయం? ఆత్రుత ఆపుకోలేక ఆయన అడిగారు.

రమ వెంటనే చెప్పింది, "అదా.. విషయం. ఆయన ఇక్కడ అపార్టుమెంట్ తీసుకొందామనుకొంటున్నారు. కొనే ముందు చెప్పవచ్చును కదా అన్నాను నేను" రమ మాటలు వాళ్ళు నమ్మారు.

ఆయన భార్యతో అన్నారు, "మన అల్లుడు అలా ఉంటాడుగానీ అంచనాలకు అందడు. చూడు, పిల్లాపాప పుట్టక మునుపే ఇల్లు కొందామని ఆలోచన"

"చూడండి ఇంటికని మళ్ళీ మిమ్మల్ని డబ్బు అడగగలడు" నవ్వుతూ అనేసింది జానకి.

ఆయన చిన్నబుచ్చుకొన్నాడు.

"బావుంది అదేమన్నమాట. మన అల్లుడు వేరు, మన అమ్మాయి వేరు కాదు. ఇద్దరూ మనకు రెండు కళ్ళు" ఆయన మృదువుగా చెప్పారు.

ఆవిడ మాత్రం కచ్చితంగా అంది.

"చూడండి మనకి ఒక పిల్ల. మన తర్వాత ఆస్తి మనమే ఇస్తాం. ఆ మధ్య అతడు తన పేరు మీదో, రమ పేరు మీదో రాయమన్నాడు చూడండి. అది మంచి పనికాదు. అలా బయటపడి పోకూడదు."

"అడిగితే మాత్రం నువ్వు ఏమైనా రాయ నిచ్చావా?" ఆయన నెమ్మదిగా అడిగారు.

"ఎందుకు రాయనిస్తాను? పెళ్ళై రెండేళ్ళు అయినా గడిచాయా?" ఆవిడ నిలదీసింది.

"బావుంది. మరి రెండు నెలలు గడిస్తే రెండేళ్ళు అవుతాయి. మనవడు పుట్టాక రాద్దామనా నీ ఆలోచన" ఆయన ఎగతాళి చేశారు.

"అదికాదు. అతడు ఆస్తి రాయమన్నా డని అమ్మాయికి తెలిసి ఉండదు. ఉంటే ఊరుకోదు" ఆవిడ భరోసాగా అంది.

"ఈ మధ్య అమ్మాయిని పంపేసి, తను రావడం లేదు. పెళ్ళికి ముందు చెప్పిన కబుర్లకి, ఇప్పటి ప్రవర్తనకి తేడా తెలి యడం లేదూ" ఆవిడ నిలదీసింది.

ఆయన ఆవిడను మందలించారు.

"ప్రతిదీ భూతద్దంలో పెట్టి చూడకు. మగవాడన్నాక వంద పనులుంటాయి. అందువలన రాలేకపోయాడేమో?"

ఆయన సాలోచనగా అన్నారు.

మొదటినుండే తమ బిడ్డ కాస్త నెమ్మది. తాము చూస్తే పెళ్ళి, పెళ్ళిఅని ఆమె బుర్ర తినేశారు. తోటిపిల్ల హిమ ఇంకా నవ్వుతూ, తుళ్ళుతూ తిరుగుతోంది. స్వతంత్రంగా బతుకుతోంది.

రమలో చూద్దామన్నా అలాంటి ఉత్సాహం కనబడటం లేదు. ఆవిడ కూతురిని తలుచుకొని బరువుగా నిట్టూర్చింది.




"ఏవండీ! ఇన్నిసార్లు మీరున్న ఇల్లు వెదుక్కొంటూ వస్తున్నా కదా! ఒక్కసారైన భోజనానికి ఉండమని మర్యాద కోసమైన అనరేమండీ!" హిమను వంశీకృష్ణ నిలదీశాడు.

అతడు హిమ ఫీలింగ్స్‌తో సంబంధం పెట్టుకోవడం లేదు. తన మనసుకి నచ్చింది చేస్తున్నాడు.

"చూద్దాం! ఇలా వెంటబడి, మాట్లాడిస్తుంటే బండరాయిలాంటి ఆమె మనసు కరగదా? " అతడి ఆలోచన అది.

హిమబిందు ఎగతాళిగా నవ్వింది.

"మరే! భోజనానికి ఉండమంటాను. పీకలదాక తినమంటాను. తర్వాత తాంబూలం ఇస్తాను. ఉయ్యాలలో పడుకోపెట్టి ఊపమంటే ఊపుతాను. మాకు ఏమైనా వేరేపనులు ఉన్నాయా? మీ సేవలు తప్ప? " నిలదీసింది.

"హతోస్మి! రెండు మెతుకులు పెట్టమని అడిగితే ఎన్ని వల్లించారండీ!" హాస్యంగా అన్నాడతను.

"మీరు ఏమైనా ముష్టివారా? అన్నమో రామచంద్రా అని అడగడానికి" హిమ హాస్యంగా అంది. అన్నాక తన పొరపాటు తెలుసుకొని నాలుక కరచుకొంది. అతడు చిన్న పిల్లవాడు కాడు. సాఫ్ట్‌వేర్ ఇంజనీర్. తనపై బాస్. అలా చులకన చెయ్యడం ఏం మర్యాద?

"ఏమిటండీ! ఆలోచనలో పడ్డారు. 'ముష్టివాడు' అని తిట్టారనా? ఫర్వాలేదు లేండి. నేను మరొక రకం ముష్టివాడిని. మరొక విషయం గురించి అడుగుతున్నాను. కనుక ఫర్వాలేదు" అతడు తన మనసుని, మనసులోని మాటలను చదువుతూంటే ఆమె తలదించుకుంది.

"హిమబిందుగారూ! మన పరిచయమైనప్పటి నుండీ చూస్తున్నాను. మీరు హాయిగా తలెత్తుకుని ఆత్మవిశ్వాసంతో ప్రవర్తిస్తారు. నా విషయంలో తలదించుకుంటే భరించలేను" అతడు సిన్సియర్‌గా చెప్పాడు.

"మీరు ఉండండి. భోజనం తయారుచేస్తాను" హిమ చెప్పింది. పట్టెడు అన్నం పెట్టడానికి ఏం భాగ్యం? అన్నిసార్లు ఎందుకు కాదనాలి?

హిమబిందుతో సరదాగా అన్నానని చెప్పినా ఆమె వినలేదు. తను తప్పుగా మాట్లాడింది. తప్పుకు శిక్ష ఉండాలి.

బీరకాయ, ఉల్లిముద్ద పెట్టి వండింది. ములక్కాడ వేసి చారు పెట్టింది. వంకాయ పెద్దది తీసుకొని పచ్చడి చేసింది. కొద్దిగా అన్నం తీసుకొని పులిహోర కలిపింది. గంటలో అన్ని రకాలు తయారుచేసి, తనకు భోజనం వడ్డిస్తుంటే అతడు ఆరాధనగా చూశాడు.

కొందరు ఆడవాళ్ళు వంటపేరుతో ఎంత

హైరానా పడతారో అతడికి తెలుసు. ఈ నేర్పు చూసి అతడు ముగ్ధుడయ్యాడు.

హిమబిందు మొదట అతడికే ఆకు వేసింది. అతడు "నాకు ఒంటరిగా భోజనం చేయడం నచ్చదు" అని నిర్మొహ మాటంగా చెప్పాడు. ఆమె తాను కూడా ఆకు వేసుకొని కూర్చుంది.

లేత అరిటాకు, అందులో పొందికగా వడ్డించిన పదార్థాలు అతడు సంతృప్తుడ య్యాడు.

ఇద్దరికీ వడ్డించి, హిమ తినబోతూంటే అడిగాడు. "రమగారు గుర్తొచ్చారా? " ఆమె ఔనన్నట్లు తల ఊపింది.

"నేను ఇలాగ కలిసి అన్నం తినేది మా తమ్ముడితో, రమతో మాత్రమే." ఆమె కళ్ళు సజలాలయ్యాయి.

"రమగారిలా మీరు కూడా పెళ్ళి చేసుకో వచ్చును కదా! ఈ ఒంటరితనం, బాధ ఉండదు" అతడు పరిష్కారం చెపుతున్న వాడిలాగా అన్నాడు.

"పెళ్ళి.. అదొక ఫార్సు. పెళ్లి తర్వాత పిల్లలు. ఇంక ఆడదాని బతుక్కి స్వేచ్ఛ ఉండదు" హిమ అలవాటైన మాటలుగా చెప్పింది.

"కావాలనుకుంటే పెళ్ళి తర్వాత ఏం ఖర్మ. పెళ్ళికి ముందు కూడా పిల్లలు పుట్ట వచ్చును" అతడు మామూలుగా అన్నట్లు అన్నాడు.

హిమకి అతడి మాటలలోని హాస్యమ ర్థమై చిరుకోపం వచ్చింది. "ఏయ్, మీరు శృతిమించుతున్నారు" అంది.

అతడు అమాయకంగా చూశాడు. "మీరు అన్న మాటలకి నేను అలా చెప్పాను. అది మామూలు విషయమే. నాకు శృతి, లయ, రాగం, పల్లవి, అనుప ల్లవి ఏమీ తెలియవు. తెలియనివాటికి నన్ను ఎలా బాధ్యుడని చేస్తారు? "

హిమబిందు నవ్వుతూ అంది "మీతో మాట్లాడటం కష్టం. విషయం ఎక్కడి నుండి ఎక్కడికో తీసికెళతారు".

అతడు పెరుగు వేసుకొంటూ అన్నాడు. "బావుంది ఆరోపణ. అలా విషయం తీసికెళ్ళగలిగితే నా ప్రేమ ఇక్కడే ఎందుకు ఆగిపోతుంది!" అతడు క్రీగంట చూస్తూ అన్నాడు.

"వంటకాలు అద్భుతంగా ఉన్నాయి. ఈ విషయంలో కూడా మీరు మార్కులు కొట్టే శారు" అతడు నిజాయితీగా అన్నాడు.

"థాంక్స్. రూంమేట్స్ ఊళ్ళకు వెళ్లారు. బోరు కొట్టకుండా కంపెనీ ఇచ్చి, రక్షిం చారు" హిమబిందు నిజాయితీగా అంది.

"వాళ్ళు లేరని తెలిసే వచ్చాను. ఎలా గైనా మిమ్మల్ని పలకరించాలన్పించింది" అతడు సూటిగా చూస్తూ చెప్పాడు.

"మీరు భలేదొంగలు. ఇటువైపు ఫ్రెండు కోసం వచ్చానని అన్నారు" నిలదీసింది.

"నేను అబద్ధం చెప్పలేదు. మీరు నాకు ఫ్రెండే కదా!"

అతడి మాటలకు హిమ మౌనం వహిం చింది.

"హిమబిందూ! ప్లీజ్ నన్ను పెళ్లిపీటల వరకూ రానీయండి" అంటూ తనవైపు వేలుపెట్టి చూపించి అన్నాడు.

హిమబిందు ఏం చెపుతుంది?

"హిమబిందూ! మీరు లండన్ వెళ్లడా నికి సిద్ధంగా ఉండండి. వీసా, పాస్‌పోర్టు లకు రెడీ అవ్వండి. ఆ మాట చెప్పాలని వచ్చాను. మన ఎండీగారు చెప్పారు" అతడు ఆమెను చూస్తూ చెప్పాడు.

హిమబిందు మొహం ఆనందంతో ఉప్పొంగింది. అతడి చేతిని పట్టుకుని ఊపుతూ అడిగింది "నిజమా! నిజమా!" అంటూ. అతడు నవ్వాడు. అతడి కళ్లు తన చేతిని పట్టుకున్న ఆమె చేతిమీద నిలి చాయి. ఆమె స్పర్శకు అతడి ఒళ్లు గగుర్పొ డిచింది.

"బిందూ! ఇది పాణిగ్రహణానికి తొలిమెట్టు అనుకోనా? నేను రెండు సార్లు స్టేట్స్ వెళ్ళి వచ్చాను. కనుక మీ ఆనందం నాకు అర్థమైంది. నా ఆనందం కూడా మీరు అర్థం చేసుకొంటారా? " అతడు ఆర్ద్రంగా అడిగాడు.

"ప్లీజ్! నన్ను మొదట లండన్ వెళ్ళనీయండి" ఆమె అభ్యర్థించింది. అతడు నవ్వుతూ చెయ్యి ఊపి వెళ్ళిపోయాడు.

హిమ బిందు తల్లిదండ్రులతో, రమతో ఆ విషయం చెప్పింది. లండన్ వెళ్ళే ముందు తల్లి రమ్మంది. ఒక వారం ఉండి వెళ్ళమంది. హిమ అంగీకరించింది.

"ఏవండీ! అమ్మాయి ఒక్కర్తీ వెళ్ళి రాగలదంటారా? " శాంత బెంగగా భర్తను అడిగింది.

"నీ కూతురు లండనేం ఖర్మ? ప్రపంచమంతా చుట్టి రాగలదు" ఆయన ఆనందంగా అన్నారు. ఆయన మాటలలో తన బిడ్డ మీదగల నమ్మకం కన్పిస్తోంది.

"అది తిరిగి వచ్చాక అయినా దాన్ని మనం ఒక ఇంటిదాన్ని చెయ్యాలి. మీరు గట్టిగా పట్టుపడితే తప్ప అది ఒప్పుకోదు" ఆవిడ హెచ్చరించింది.

★ ★ ★

రమ తన విషయాలు హిమకి తెలియకుండా జాగ్రత్త పడింది. నెట్ లో కూడా ఎంతో ఉత్సాహంగా కనబడి మాట్లాడేది. తల్లి కాబోతున్న విషయం చెప్పింది.

"హిమా! మరొక ఏడు నెలలలో నీకు నా పాపనో, బాబునో తెచ్చి చూపిస్తాను" రమ విషయం చెప్పగానే హిమ ఆనందంతో గంతులు వేసింది.

"రమా! నేను ఏం చేస్తానో తెలుసా? బాబు పెద్దయ్యాక మన స్నేహం గురించి కథలు, కథలుగా చెప్తాను. మనం ఆడుకున్న ప్రదేశాలన్నీ వాడికి చూపిస్తాను. వాడు ఎంత మంచివాడో చూడు. పుట్టక

## కొత్తగాలి...

**సందేహమెందుకు**
**పేదవాడు అభివృద్ధి**
**చెందుతున్నాడుగా...**
**మరింత పేదవాడిగా**

– సుందరి, విశాఖపట్నం

మునుపే పిన్నిని అందలం ఎక్కిస్తున్నాడు. హిమబిందు గంగా ప్రవాహంలాగ మాట్లాడుతోంది.

మొదటిసారిగా, రమలో బాబు పెద్దయ్యాక ఎలా ఉండాలన్న ఆలోచనలు ఊపిరి పోసుకున్నాయి. హిమ చెయ్యి, తన చెయ్యి పట్టుకుని నడుస్తున్న బాబు ఆమె కళ్ళ ముందు ప్రత్యక్షమయ్యాడు.

"హిమా! బిడ్డకు సంబంధించిన ఆలోచనలకు ప్రాణమిచ్చావు. ఏమిస్తే నీ ఋణం తీరుతుంది? " రమ కంఠం వణికింది.

"మన బాబుకి ఇద్దరు తల్లులు. చిన్నికృష్ణుడులాగ వాడు మన ఇద్దరి ఒళ్ళల్లో పెరగవలసిందే" హిమ శాసిస్తున్నట్లు చెప్పింది.

"హిమా! పైన తథాస్తు దేవతలు ఉన్నారు సుమా! నువ్వన్నట్లే జరగగలదు" రమ కంఠం బరువుగా పలికింది.

"అవనీ, అలాగే అననీ. ఇంతకీ రమా! బావగారు ఏరి? ప్రభాత్‌గారు బాబు తండ్రినవుతున్నాడని బడాయి పోతున్నారా? మంచి పార్టీ అడగాలి. రమ్మను" హిమ సరదాగా అంది.

"ఆయన లేరు. బయటికి వెళ్ళిపోయారు. ఇంతకి నీ ప్రయాణం విషయాలు చెప్పు" రమ సాధారణంగా అంది.

ప్రభాత్ ఉలిక్కిపడ్డాడు. తాను ఇంట్లో ఉండగా లేడని చెపుతోంది. హిమతో తాను ఎక్కడ మాట్లాడతాడోనని రమ



భయం కాబోలు.

"రమా! నిన్ను చూడాలని ఉంది. వీలు చేసికొని వస్తాను" హిమ చెప్పింది. ఆమె మాటల్లో తనను చూడాలన్న తపనను రమ గుర్తించింది.

"హిమా! నువ్వు నీ ప్రయత్నాలు చేసుకో! నేను నీ దగ్గరకు వస్తాను. రెండు రోజులు ఉంటాను. ఫ్లైట్ ఎక్కిస్తాను, సరేనా? " రమ నిశ్చలంగా చెప్పింది.

"నువ్వు మా రమవేనా? ఇంత ఫాస్టుగా వస్తానని చెప్పావు. రమా! ఇంతలా మారి పోతున్నావనుకోలేదు సుమా! ఎదురుగా ఉంటే నన్ను గిల్లమనేదాన్ని" హిమ ఆనందం పట్టలేక అంది.

"ఊ.. మార్పు మానవ సహజం. నీలాంటి ఫ్రెండ్ ఉన్నప్పుడు తప్పక మార్పు వస్తుంది. సరే! వంశీ కృష్ణ ఏమం టున్నారు? " రమ సంభాషణ మరల్చింది.

"చంపేస్తున్నాడు తల్లీ! కనబడటం భయం, మాట్లాడటం భయం. సంభాష ణను 'పెళ్ళివైపే' తిప్పుతాడు. ఆ.. అన్నట్లు మరిచాను. వాళ్ళ ఫాదర్, మదర్ ఈ మధ్య వచ్చారు. కొడుకు దగ్గరకి వచ్చా మని అన్నారు. గెస్టులుగా మొదట వాళ్ళు నా వద్దకే వచ్చారు. ఆయన పని ఉండి బయటికి వెళ్ళారు. కాసేపు నేను వాళ్ళతో సంభాషించవలసి వచ్చింది. మొత్తానికి మంచివాళ్ళు, సంస్కారవంతులన్పించారు" హిమ చెప్పింది.

రమ నవ్వుతూ అంది "కావాలనే వంశీ గారు పని సృష్టించుకొని బయటకు వెళ్లా రేమో? నిన్ను, వాళ్లను రంగం మీదకి తెద్దామనుకొన్నారు కాబోలు"

"ఔనా రమా! నాకూ ఈ అనుమానం వచ్చిందనుకో! ఏమనగలం? మనకన్నా సీనియర్ కదా! ఏం చేస్తాం? ఆయన వచ్చేలోపు కాఫీ, టిఫిన్‌లు తెప్పించి, అతిథి మర్యాదలు జరిపాననుకో! వచ్చాక వాళ్ళను చూసి బోలెడు ఆనందం ప్రకటిం చారు. అది చూస్తే వాళ్ళ రాక నిజంగా ఆయనకు తెలియదేమో అన్పించింది" హిమ ఆనాటి సంఘటనను వివరించింది.

"అయితే సన్నివేశం బాగా రక్తి కట్టించా రన్నమాట. ఏమో! ఆయనకు తెలియకపో వచ్చును కూడా! అలాగే అనుకొందాం" రమ నిర్ధారణగా అంది.

తర్వాత కాసేపు హిమ ఈ విషయాలే మాట్లాడింది. రమ ఒక విషయం గుర్తిం చింది. పెళ్ళివైపు హిమ మనసు మొగ్గు చూపడం లేదు. అలాగని వంశీకృష్ణపై అయిష్టం లేదు.

"హిమా! ఎక్కువగా ఆలోచించకు. వంశీ కృష్ణ మంచిమనిషి, విద్యావంతులు. నీతో జీవితం పంచుకోవాలనుకొంటున్నారు. నీ భావాలు తెలిసినవారు. అలాంటి వారిని నువ్వు వదులుకోవడం మంచిది కాదు" రమ మాటలు అతడి విషయం ఆలోచిం చమన్నట్లు చెప్పాయి.

హిమ ఆలోచనలో పడింది. రమకి అతడు నచ్చాడు. అఫ్‌కోర్సు మనిషిని తను ఇంకా చూడలేదు. తన మాటలను బట్టి ఊహిస్తోంది. రేపు ఎయిర్‌పోర్టులో అందరూ కలుస్తారు కదా! హిమ ఆ సంగతి అంతటితో వదిలేసింది.

అయితే ఆమె వదిలేసినట్లు వంశీకృష్ణ వదలలేదు. హిమబిందును తన తల్లిదం డ్రులకు చూపించాడు. వాళ్ళకి హిమ బిందు నచ్చింది. వాళ్ళే హిమబిందు పెద్ద వాళ్ళకు విషయం వివరించారు. అందరూ త్వరలో కలుద్దామనుకొన్నారు.

ఆనందరావు భార్యను తొందరపడి హిమను వంశీ గురించి అడగవద్దన్నారు.

శాంత దెబ్బలాడింది.

"బావుంది. మీరు అడగరు, నన్ను అడ గనీయరు. ఎలా? అది దానంతట అది చెపుతుందా? అది మొండిది. అతడి

ప్రేమను అంగీకరిస్తుందో, లేదో? ”

ఆయన అనుభవజ్ఞుల్లా నవ్వారు.

“పిచ్చిదానా! విషయం ఇంతవరకూ వస్తుందని మనం ఊహించామా? అబ్బాయి ఓ పద్ధతి ప్రకారం మన ముందుకు వస్తున్నాడు. చూద్దాం! వాళ్లిద్దరికీ భగవంతుడు రాస్తే, ఎక్కడికి వెళ్లగలరు? ఎలా తప్పించుకొంటారు? ” అన్నారు.

ఆవిడకి భర్త మాటలు నిజమేనన్పించింది. హిమకు నచ్చిన వాడు వస్తే చాలు. దాన్ని బలవంతంచేసి తాము పెళ్ళి చేయలేరు. అది వ్యక్తిత్వం ఉన్న పిల్ల. అందరిలాంటి అమ్మాయి కాదు. దానికంటూ కొన్ని ప్రిన్సిపుల్స్ ఉన్నాయి.

“హిమను ఆకర్షించే బలమైన వ్యక్తిత్వం వంశీకృష్ణలో ఉంటే, తప్పక హిమ అతడి వైపు ఆలోచిస్తుంది” అంది శాంత.

ఆనందరావు అప్రతిభులయ్యారు. ఆయన మనసు ఆనంద తరంగితమైంది.

“శాంతా! ఎంత బాగా చెప్పావు? నీ బిడ్డ మనసు ఎంత బాగా అర్థం చేసుకొన్నావు? వ్యక్తిత్వం ఉన్న ఆడపిల్లల విషయంలో తల్లిదండ్రుల ప్రమేయం కొంత తగ్గాలి. అలాగని మనం మంచిచెడ్డలు చూడకుండా వదిలేస్తామనికాదు. చూద్దాం! ముందు ముందు ఏం జరుగుతుందో ఎవరు చెప్పగలరు? మొదట పిల్లలను ఎవరు అర్థం చేసుకొన్నా, చేసుకోకపోయినా తల్లిదండ్రులు అర్థం చేసుకోవాలి” ఆయన చెప్పిన మాటలకు ఆవిడ ఔనన్నట్లు తల ఊపింది.

ఎప్పుడు ఏం జరుగుతుందో అని ఆనందరావుగారు అన్నది అక్షరాలా నిజమైంది.

దశమినాడు వాళ్ల వాకిట్లో స్ఫురద్రూపుడైన యువకుడు ప్రత్యక్షమయ్యాడు. ఆనందరావు అతడు ఎవరా అన్నట్లు చూశారు. ఎవరైనా అతిథి మర్యాదలు చేసే విషయం ఒకటే కదా!

అతడు గొంతు సవరించుకుని చెప్పాడు.

> **కొత్తగాలి...**
>
> **జనవాహినిలో**
> **ఏడాదికోసారి**
> **విరిసే ‘పద్మాలు’**
> **భారత సౌరభాలు..**
>
> – కె.ఆర్.వి.వి.రత్నకుమారి, హైదరాబాద్

“నా పేరు వంశీకృష్ణ. మీ దగ్గరకు రావాలన్పించి వచ్చాను” ఆయన ఉబ్బి తబ్బిబ్బయ్యాడు. భార్యను పిలిచారు. ఆవిడ పరిస్థితీ అలాగే ఉంది.

ఆయనే తేరుకుని “అబ్బాయికి కాఫీ తీసుకొనిరా” అని చెప్పారు.

వారిద్దరూ మాట్లాడుకుంటుంటే సంజయ్ వచ్చాడు. “ఎందుకు నాన్నగారూ! రమ్మన్నారట? ” అని అడిగితే ఆనందరావు తెల్లబోయాడు.

“మీ నాన్నగారు రమ్మన్నారని నేనే చెప్పాను. నాకు మిమ్మల్నందరినీ చూడాలన్పించింది” వంశీ మాటలకు సంజయ్ నవ్వాడు.

“పెళ్లికూతురు లేని పెళ్లిచూపులన్న మాట” సంజయ్ నవ్వాడు. అతడికీ ఈ సన్నివేశం బావుంది.

ఔను మరి. ఈ కాలం అబ్బాయిలలో ఆ మాత్రం చొరవ ఉండాలి.

టిఫిన్ తినడం అయ్యాక వంశీ చెప్పాడు, “మీ అమ్మాయి హిమబిందు నాకు నచ్చారు. ఆవిడకి ఏవేవో అనుమానాలు, వైవాహిక జీవితంపై భయం. అభివృద్ధిపథంలోకి దూసుకొని వెళ్లాలని తపన. ఇద్దరు టీచర్లు, ఇద్దరు డాక్టర్లు పెళ్లి చేసుకోవడం లేదా? అలాగే ఇద్దరు సాఫ్ట్‌వేర్ ఇంజనీర్లు ఎందుకు చేసుకోకూడదు? వృత్తిపట్ల ఒకే అవగాహన, భవిష్యత్తు పట్ల ఒకే ఆశలు, కుటుంబం పట్ల ఒకే రక





మైన ప్రేమాభిమానాలు ఉన్న వ్యక్తులు కలిసి హాయిగా బతకలేరా? మీరు ఆమెకి చెప్పండి. మా ఇద్దరినీ కలపండి" వంశీ కృష్ణ సూటిగా చెప్పాడు. తన రాక హిమ బిందుకి తెలియదని, తను రావాలనుకొని వచ్చానని చెప్పాడు.

ఆనందరావు, శాంత సంతోషించారు. అతడిని రాఘవరావు ఇంటికి తీసికెళ్లారు. అతడిని చూసి వాళ్లు సంతృప్తిపడ్డారు.

సంజు సంతృప్తిగా అన్నాడు, "మా అక్కకి అన్నీ సస్పెన్స్ కబుర్లే ఇష్టం. అది అలాగే ఊరించి విషయాలు చెపుతుంది. దానికి సరిపోయే వారే వచ్చారు"

ఆనందరావు వంశీని పంపిస్తూ చెప్పాడు. "మా హిమ విషయంలో నిర్ణయం ఆమెదే. ఇంతవరకూ దాని నిర్ణ యాలు ఏవీ తప్పవలేదు. దానికి సలహా చెప్పే అవసరం నాకుందని నేను అనుకో వడం లేదు"

వంశీకృష్ణ ఆయన మాటలకు విస్మయప డ్డాడు. కూతురిపై ఎంత నమ్మకం? కూతురి వ్యక్తిత్వంపై ఎంత పరిపూర్ణ విశ్వాసం? పెళ్లి విషయంలో నిర్ణయాధి కారం ఆమెదే అని చెప్పకనే చెపుతున్నారు.

"భగవాన్! ఇటువంటి మంచి కుటుం బంతో నన్ను కలుపు" అంటూ అతడు దేవుడిని ప్రార్థించాడు.

★ ★ ★

"ఎక్కడికి వెళ్లారు మీరు? నాలుగు రోజుల నుండీ పత్తాలేరు. పని పూర్తయి నా ప్రాజెక్టు చూపిద్దామనుకొన్నాను" హిమ వంశీకృష్ణతో అంది.

అతడు ఆమెవైపు ఓరగా చూశాడు.

"ఓహో! ఉద్యోగ విషయాలలో నా కోసం ఎదురు చూశారా? నేను ఇంకా లేనని నా కోసం చూశారనుకొన్నాను" అన్నాడు, మెల్లగా తర్వాత-

"నాతో పనులేమైనా ఉన్నాయా?" అన్నాడు. హిమ తడబడింది. ఏమిటి తడు? సంభాషణ చిలిపిగా నడుపుతాడు.

ఆమె చిరుకోపంతో అంది "మధ్య నాకు మీతో ఏం పనులుంటాయి?"

"ఔనులేండి. మీ పనులు మీరు బాగా చేసుకుపోగలరు. పోనీ నాకే మీ సహాయం అవసరం. కాస్త చేస్తారా? మా ఫ్రెండ్‌కి ఫోన్‌చేసి అతను లైన్‌లోకి వచ్చాక నాకు ఇవ్వండి" అంటూ నెంబర్ ఆమె ముందుకు తోశాడు.

హిమ కాగితం చేతిలోకి తీసికొని చూసింది. నెంబర్ చూడగానే ఆమె గుండె గతుక్కుమంది.

"ఈ నెంబర్ మా సంజూది. మీకు ఎలా వచ్చింది?" నిలదీసింది వెంటనే.

అతడు కొంటెగా అన్నాడు "ఔనా? ఈ అబ్బాయి నెంబర్, ఎడ్రస్ ఒక మధ్యవర్తి ఇచ్చారు. అతడు వాళ్ళ అక్కకి సంబం ధాలు చూస్తున్నాడట. నాకు అభ్యంతరం లేదని చెపుదామనుకొంటున్నాను."

హిమ మొహం ఎర్రబడింది. అక్కడి నుండి లేచి ఆమె సంజయ్‌కి ఫోను చేసింది, 'హలో బావున్నారా? మీరు వెళ్ళాక మా అమ్మానాన్నగారు మీ గురించే మాట్లాడుకొన్నారు. మా హిమ బావుందా. దాన్ని అడిగానని చెప్పండి. తన సెండాఫ్‌కి మేమంతా వస్తాం" అవతల సంజయ్ వస పిట్టలాగ వాగుతున్నాడు.

అప్పుడు చూసింది హిమ. అది వంశీ కృష్ణ సెల్. తను తొందరలో దాన్ని తీసి కొని చేసింది. చప్పున మాట్లాడకుండా కట్ చేసింది. ఫోను పెట్టేసింది.

మళ్ళీ ఫోను రింగయింది. వంశీకృష్ణ నవ్వుతూ తీశాడు. సంజయ్‌తో అతడు కబుర్లలో పడ్డాడు.

హిమబిందుకి ఆశ్చర్యంగా ఉంది. సంజయ్ ఇతడికి ఎలా తెలుసు? అంత సన్నిహితంగా వాళ్ళు ఎలా మాట్లాడుకొం

## కొత్తగాలి...

**అన్నింటిని చూసే కళ్లు**
**తమను చూసుకోలేవు**
**ఉత్తములు సృష్టిలో**
**అంతేగా!**

– పెదుకరాజు, నర్సింగాపూర్, కరీంనగర్

టున్నారు?

ఫోను ఆఫ్ అయ్యాక వంశీకృష్ణ నవ్వుతూ అన్నాడు, "హిమబిందూ! మీ తమ్ముడితోనే ఇప్పుడు నేను మాట్లాడింది. వివరాలు కావాలంటే నాతో పార్కుకో, హోటల్‌కో రండి. సందేహాలు తీరుస్తాను" అంటూ తన సెక్షన్‌లోకి నడిచాడు.

హిమబిందు బయటకు వచ్చి తమ్ముడికి ఫోను చేసింది. అతడు నవ్వుతూ అన్ని విషయాలూ చెప్పాడు.

"ఈ విషయాలు నాకు ముందు ఎందుకు చెప్పలేదురా? " హిమబిందు గొంతులో ఆగ్రహం తొంగిచూసింది.

"ఆయన అన్నీ ఎక్స్‌ట్రాలు చేస్తాడు. మీకేమయింది? " ఆమె నిలదీసింది.

"బావుందే? నీకు చెప్పే మీ బాస్ వచ్చాడనుకొన్నాను. నేనేకాదు నాన్నగారూ మొదట అలాగే అనుకొన్నారు. తర్వాత ఆయన చెప్పారనుకో! భలే సరదా మనిషిలే" సంజు సర్టిఫికెట్ ఇచ్చాడు. హిమబిందు కసిగా ఫోను కట్ చేసింది.

సాయంత్రం ఎప్పుడవుతుందా అని చూసింది హిమబిందు. ఆమె తన కోసం ఆగడం చూసి అతడు అటు నడిచాడు. ఇద్దరూ హోటల్‌కు వెళ్ళారు.

ఆమె వద్దంటున్నా అతను టిఫిన్ ఆర్డర్ చేశాడు. తను చేసిన పని ఆమెకు కోపం కలిగిస్తుందని అతడికి తెలుసు. హాస్యంతో, అమాయకత్వంతో ఆ కోపాన్ని తొలగించాలనేది అతని ఉద్దేశం.

అతడు చేతిలోని నీళ్ళగ్లాసును చూస్తూ చెప్పాడు "హిమబిందూ! మీరు లండన్ వెళ్ళి వచ్చేలోపు, మనం ఒక నిర్ణయానికి రావాలని నాకు అన్పించింది. అందుకే మీ ఇంటికి వెళ్లాను."

ఆమె గయ్యిమని లేచింది, "మా ఇంటికి ఎవరు వెళ్లమన్నారు. నా తల్లిదండ్రులను ఎందుకు కలిశారు? మీరు ప్లాన్డ్‌గా నన్ను పెళ్ళివైపు నడిపిద్దామనుకొంటే, అది మీ తెలివి తక్కువతనం. సిగ్గులేదూ, బుద్ధి లేదూ, ఇతరుల ప్రమేయం లేకుండా, వాళ్ళ స్వంత విషయాలలో దూరి పోవడం"

వంశీకృష్ణ గంభీరత నటించాడు.

"ప్రేమికుడికి బుద్ధి, సిగ్గు ఉండకూడదు హిమబిందూ! మీకు తెలియదా? "

హిమబిందు హతాశురాలైంది. ఎన్ని తిట్టినా పట్టించుకోని వాళ్ళనేంచేయగలం?

హిమబిందు ఆలోచించింది. కొందరితో కయ్యం పనికి రాదు. నెయ్యంతోనే పని చక్కబెట్టుకోవాలి.

"చూడండి. మీరు మీవైపు నుండే ఆలోచించారు. మా ఫాదర్, మదర్ మీరు వెళ్ళడం వల్ల నా గురించి ఏమనుకొంటారు? వాళ్ళకి చెప్పకుండా మిమ్మల్ని పంపించానని అనుకోరా? నా గురించి వాళ్ళు మనసులో తేలికగా భావించినా భరించలేను. అది మీరు గ్రహించకుండా వెళ్లారు. నాకు ముందు తెలిస్తే వెళ్ళనిచ్చే దాన్నేకాదు"

ఆమె తల్లిదండ్రులకు ఇస్తున్న విలువ, వాళ్ళ మనసులో తన మీద దురభిప్రాయం ఏర్పడకూడదనే తపన అతడిని మరింత ఆకర్షించాయి.

కుటుంబానికి విలువనిచ్చే అమ్మాయిలు, భర్తకి కూడా జీవితంలో విలువ ఇస్తారు. అతడు హిమబిందు మనసు అర్థం చేసుకొన్నాడు. అందుకే అతడు ఆమెను క్షమించమని అడగగలిగాడు.

"చేసేవన్ని చేసెయ్యడం, క్షమించమనడం. ఛ...ఛ... అదే నాకు నచ్చని విషయం" హిమబిందు చీదరించుకుంది.

"ఏ విషయంలోనూ తొందరపాటు కూడదు. మనం చిన్న పిల్లలమా? మనకి తోచినట్ల మనం చేసెయ్యడమేనా? పెద్ద వాళ్ళ మనసులు సున్నితం. వాళ్ళని మనం బాధ పెట్టకూడదు. ఈ మాత్రం విషయాలు ఇంత పెద్ద ఉద్యోగస్థుడికి తెలియదని ఎలా అనుకొంటాను? మా సంజు లాంటి తొందరే మీకు కూడా!" హిమబిందు కోపంతో పెట్టిన చివాట్లను అతడు మౌనంగా భరించాడు.

"చూశావా రమా! ఆ పెద్ద మనిషి ఎలా నాకు తలవంపులు తెచ్చాడో" హిమ తన బాధను ఆ రాత్రి తన ఫ్రెండ్ రమకు ఫోన్‌లో చెప్పుకుంది.

రమ నవ్వింది. "నాకు అమ్మ, నాన్నగారు ఫోను చేసి చెప్పారు. పోనీలే హిమా! శివుడి ఆజ్ఞ లేనిదే చీమ కూడా కుట్టదంటారు. మరి ఈ పెళ్ళి విషయం ఇలా ముందుకు వెళుతోందంటే భగవంతుడి అంగీకారమయివుంటుంది"

హిమబిందుకీ అంతేనేమో అన్పించింది. "సరే! ఏం చేస్తున్నారు? బావగారు నీకు సేవలు చేస్తున్నారా? "

రమ నవ్వింది. "ఆ.. ఆయన చేసే పనులు ఎన్నో? చూస్తే నువ్వు ఆశ్యర్యపోతావు"

హిమబిందు మనస్ఫూర్తిగా ఆనందించింది. "నువ్వు కేసెట్లు పెట్టుకుని మంచి సినిమాలు చూడు. మంచి పుస్తకాలు చదువుకో. బాగా విశ్రాంతి తీసుకో. నువ్వు ఎంత ఆనందంగా ఉంటే బాబు అంత బాగా, ఆరోగ్యంగా పెరుగుతాడు" హిమ వివరించింది.

"బావుంది. నీ మాటలు వింటుంటే, నా వయసుదానివి, నా ఫ్రెండువి అన్పించడం లేదు. ఏ మామ్మగారివో అన్పిస్తున్నావు!"

రమ మాటలకు హిమ "నిజమా!" అని అడిగింది.

"నిజం. మామ్మగారూ! మీరు చెప్పినట్లే వింటాను" రమ అనడంతో ఇద్దరూ నవ్వుకొన్నారు.




ప్రభాత్ పట్టుదలగా, బింకంగా ఉంటున్నాడు. ఆడదానికి ఇంత పంతమా? తనతో మాట్లాడదు. వంట చేస్తుంది కాని వడ్డన చేయదు. రాగానే తలుపు తీస్తుంది కానీ తన గదిలోకి వెళ్ళిపోతుంది.

తనకేం లోటు? తనకు ఆనందం బయట హాయిగా దొరుకుతుంది. ఆమే గింజుకుని తన కాళ్ళ దగ్గరకి రావాలి.

"భర్త పనికిరాడు. భర్త ఇల్లు, సంపాదన పనికివస్తాయా? " అతడు ఎగతాళిగా అడిగాడు ఓరోజు.

భార్యను కవ్విస్తే మాట్లాడుతుందేమోనని అతడి ఆశ. అదేం ఖర్మోగానీ రమ ఇప్పుడు అతడిని మరీ ఆకర్షిస్తోంది.

నిజానికి రమ బాగా చిక్కింది. ఆమెకు ఏం చేద్దామన్నా తల్లిదండ్రులు, సమాజంలో వాళ్ళకి ఉన్న పేరు ప్రతిష్ఠలు గుర్తు వస్తున్నాయి. తనకు తల్లీ, తండ్రి కావాలి. వాళ్ళు సరిగ్గా ఉన్నప్పుడే తను ఏ విషయమైనా చెప్పగలదు. ఫోను ద్వారా విషయం చెపితే, వాళ్ళ పరిస్థితి ఎలా



ఉంటుందో!

తల్లిదండ్రుల దగ్గరికి వెళ్ళిపోవాలని మనసు హఠం చేస్తోంది. వెళ్ళడానికి శక్తి చాలడం లేదు. పెళ్ళైన రెండు సంవత్సరాలలో ఇన్ని చేదు అనుభవాలా?

రమ స్నానం పూర్తిచేసి వచ్చేసరికి ప్రభాత్‌తో ఆదెమ్మ మాట్లాడుతోంది. రమకు అది ఏ విషయమో అని ఆత్రుత కలగలేదు. అతడు మౌనంగా ఆమె చేతిలో ఐదువందలు డబ్బు పెట్టాడు.

ఆదెమ్మ డబ్బు తీసుకుని రమను చూస్తూ అంది. "మా యజమానికి ఒంట్లో బావుండలేదమ్మ. జీతంలో కోసుకొమ్మని అయ్యను డబ్బు ఇమ్మన్నాను"

రమ మాట్లాడలేదు. ఇదివరకు ఆదెమ్మ రమనే డబ్బు ఏ అవసరం వచ్చినా అడిగేది. ఇప్పుడు అతడిని అడుగుతోంది.

పక్కింటామె దాన్ని పనిలో నుండి తీసెయ్యమంది "రమా! ఇంకా ఎందుకు ఈ పాడుముండ? దీన్ని మాన్పించు. మరొకరిని పెడతాను" అని గట్టిగా చెప్పింది.

రమ పేలవంగా నవ్వింది.

"ఈ విషయంలో దాని తప్పు ఏముందాంటీ? మన బంగారం మంచిది కానప్పుడు ఎవరినని ఏం లాభం? మీరే చెప్పండి. ఆమె భర్త మంచంలో ఉన్నాడు. ఆమె సంపాదన తప్ప ఇంట్లో ఆధారం ఏం ఉంది. ఆమె ఎవరినీ తప్పు చెయ్యమన లేదు కదా!"

పక్కింటావిడ బుగ్గలు నొక్కుకుంది. ఆమె కంటికి రమ గొప్ప సత్తెకాలం దాని లాగ కన్పించింది. ఏమిటి ఈ పిల్ల, మరొకరు అయితే భర్తను అల్లరి పెట్టి, కట్టడి చేసేవారు. పనిమినిషిని చీల్చి చెండాడేవారు. కాపురంలో తగాదాలు పడేవారు.

రమ చేస్తున్న ఈ మౌన పోరాటం ఆమెకు అర్థమవడం లేదు.

అందుకు స్వరం తగ్గించి చెప్పింది.

"ఆయన నీకు తాళికట్టిన భర్త. చచ్చినట్లు నీతో కలిసి బతకవలసినవాడు. నువ్వు నీ అందంతో అతన్ని కొంగుకి కట్టుకో! లేదా సాధించి దారికి తెచ్చుకో! అంతేకాని ఇలా ఉంటే బావుండలేదు."

రమ అమాయకత్వం, ప్రేమ ఆవిడను కరిగించాయి. ఆ పిల్ల పెదవి విప్పకుండా పడుతున్న యాతన ఆమె దృష్టిని దాటిపోలేదు. ఒక పెద్ద తుపాను వెలిసిన తరువాత ఉండే బీభత్సానికి ఎలా తలవంచుతామో, రమ అలాగ తలవంచినట్లు ఆమెకు అన్పిస్తోంది.

రమ ఆవిడ మాటలకు నవ్వింది.

"మీకు నా మీదున్న ప్రేమను తట్టుకోలేకపోతున్నానాంటీ. పొరుగింటివారికేమైనా పట్టించుకోని ఈ రోజుల్లో నన్ను మీ అమ్మాయిగా భావించి, నా కోసం బాధపడుతున్నారు. "చిమిడిన అన్నాన్ని, చెదరిన కాపురాన్ని ఎవరూ చక్కచెయ్యలేరాంటీ! ఈ కాపురం ఇక ఇంతే" రమ నిర్లిప్తంగా చెప్పింది.

ఆవిడ రమను ఏమీ అనలేక గొణుక్కుంటూ అక్కడి నుంచి వెళ్ళిపోయింది. ప్రభాత్‌ను చూస్తే చాలు సూటిపోటి మాటలు మొదలు పెడుతుంది. అతడు తనను కాదన్నట్లు దులుపుకుని పోతున్నాడు. రమ ప్రోద్బలం లేకపోతే ఆవిడ అనగలదా అని కూడా అతడి ఆలోచన.

రమకి జీవితం అంటే విసుగు అన్పిస్తోంది. ఏ ఆశా, ఆకర్షణా లేకుండా బతకడం ఎంత దుర్భరం? ఈ మగవాళ్ళకి ఏం కావాలి? తనభార్య దగ్గరలేని శాంతి, సుఖం, సంతోషం బయటవాళ్ళ దగ్గర ఉంటాయా?

రోజులు ఎంత త్వరగా గడిచిపోయాయి. ఆ బాల్యం గడిచినట్లు, ఈ వైవాహిక జీవితం ఎందుకు గడవలేదు. ఇన్ని

అవరోధాలా?

తన వంశం, పరువు ప్రతిష్టలు, తన రూపం, లావణ్యం, తనతో ఏర్పడిన వివాహబంధం, ఇవేమీ అతడిని తనతో కట్టి పడెయ్యలేదు. అతడి చపల స్వభావం తను గుర్తించలేదు. పామును తాడుగా భ్రమించింది.

సోఫా మీద తలవాల్చి, ఆలోచనల సుడి గుండంలో కొట్టుకుని పోతున్న రమ ప్రభాత్ వచ్చి, సమీపంలో కూర్చోవడం గమనించలేదు.

అతడు తదేకంగా ఆమెను చూశాడు. ఆమె చూపులు పుల్లలతో గూడును కట్టు కుంటున్న కాకుల మీద ఉన్నాయి.

"పాపం, ఈ కాకులు ఎంత కష్టపడి ఒకటి, ఒకటిగా ఎండు పుల్లలు తెచ్చి ఈ చెట్టు మీద గూడు కట్టుకుంటున్నయో? ఏ పామో ఎక్కి వాటి గుడ్లను తింటే ఏం చెయ్యగలవు? తమ కుటుంబం కోసం అవి పడుతున్న శ్రమ ఏ గాలివానో వస్తే నాశనమే కదా!"

రమ ఆలోచనలు వాటి కష్టం చూసి దారిమళ్ళుతున్నాయి. సృష్టిలో ప్రతి ప్రాణీ 'తన' అన్నదాని మీద ఇంత మమకారం పడుతుందా?

"రమా!" అతడు పిలిచాడు.

"అయిందేదో అయింది. ఎన్నాళ్లు బాధ పడతావు? నువ్వు సుఖపడటం లేదు. నన్ను సుఖపెట్టడం లేదు. నిన్ను ఇలా చూడటం నాకు బాధగా ఉంది. నన్ను ఏం చెయ్యమంటావు? "

రమ విసుగ్గా చూసింది. బరువుగా ఊపిరి పీల్చుకుంది. "నన్ను ఈ మాత్రంగా కూడా బతకనీయరా? ఏం పాపం చేశానని ఈ శిక్ష! వెళ్ళండి. దయచేసి నన్ను ఒంటరిగా వదిలేయండి" ఆమె చేతులు జోడించింది.

ప్రభాత్ తెచ్చిపెట్టుకున్న ప్రశాంతత ఎగిరిపోయింది. "ఏమిటే! ఏమిటాలోచిస్తున్నావు? పరస్త్రీలతో గడిపితే అందరూ భర్తలను వదిలేస్తున్నారా? ఎందరు ఆడ వాళ్ళు భరించి, సజావుగా సంసారాలు చేయడం లేదు? పెద్ద ఘోరం జరిగినట్లు ఇల్లు నరకం చేస్తున్నావు. నాకు కోపం తెప్పించకు" అంటూ తలుపులు గట్టిగా కాలితో తన్ని వెళ్లిపోయాడు.

వెంటనే ఆ చప్పుడుకి, అతడి అరుపులకి పక్కింటామె పరుగున వచ్చింది.

విసురుగా స్కూటర్ మీద వెళుతూ ప్రభాత్ కన్పించాడు. ఎదురుగా కళ్ళ నీళ్ళతో రమ కన్పించింది.

"రమా! ఏమైంది తల్లీ? " ఆవిడ ఆర్తిగా అడిగింది.

రమ మాట్లాడలేదు. కన్నీళ్ళు ఎంత ఆపుకొందామన్నా ధారాపాతంగా కారిపోతున్నాయి. అవి చూసి ఆవిడ తల్లి మనసు తల్లడిల్లింది.

"తల్లీ! కొట్టాడా? పోట్లాట పెట్టుకున్నాడా? " రమ తలను తన పొట్టకి ఆనించుకుని అనునయంగా అడిగింది.

రమ లేదన్నట్లు తలూపింది. కొద్ది క్షణాలు ఏడుపుతో గడిచిపోయాయి. రమ వీపుమీద ఆవిడ అనునయంగా రాయసాగింది.

"ఈ లోకంలో దాంపత్య బంధం చాలా మందికి తెలియదు. వివాహబంధం అంటే ఎంత పవిత్రమైందో, దాన్ని ఎంత సౌశీల్యంతో కాపాడుకోవాలో తెలియదు. ఎవరి ఇష్టం వచ్చినట్లు తిరిగేకాడికి ఈ వివాహ వ్యవస్థ ఎందుకు? " రమ వెక్కిళ్ళ మధ్య ప్రశ్నించింది.

రమ ప్రశ్నలకు ఆవిడ దగ్గర సమాధానాలు లేవు. ఆ సమయంలో ఆవిడకి పోకిరి తిరుగుళ్లు అన్నీ తిరిగి, తనను కాల్చుకుని తిన్న భర్త గుర్తుకొచ్చాడు.

వయసంతా ఉడిగాక, బుద్ధిమంతుడి



లాగ బతుకుతున్నాడు. అటువంటివాడితో 'నా భర్త' అనుకుంటూ తను బతుకుతోంది. మరి ఆయన తిరుగుళ్ళు తనను అవమానం చేసినట్లే కదా! అయినా తల వంచి, సంసారచక్రంలో తనను తాను బిగించుకుంది. అందుకే బరువుగా నిట్టూర్చింది. ఆవిడ గంభీరంగా చెప్పింది.

"రమా! మేము, అదే మాలాంటి వాళ్ళం భర్త ఆగడాలు, అకృత్యాలు భరించి, జీవచ్ఛవాల్లా బతుకుతున్నాం. ఇంకా చెప్పాలంటే చావలేక, శవాల్లాగ బతుకుతున్నాం. 'నా భర్త మంచివాడు, నా సంసారం గొప్పది' అంటూ మమ్మల్ని మేము మోసం చేసుకొంటున్నాం. భార్యాభర్తల మధ్యనున్న సున్నితమైన రాగబంధం తెగిపోయిందనే వాస్తవం తెలిసినా తెలియనట్లు భ్రమలో బతుకుతున్నాం. మీరు చదువుకున్న అమ్మాయిలు. మీ కాళ్ళ మీద, మీరు నిలబడి బతకగలరు. మంచీచెడ్డ మా కన్నా బాగా తెలుసున్నవాళ్ళు. మాలాగా రాజీపడి, నిస్సారమైన బతుకు బతకమని నేను చెప్పలేను" అంటూ ఆవిడ కళ్లు తుడుచుకుంటూ వెళ్ళింది.

రమ మొహంలో ఒక వెలుగు. మెదడు పొరలు చిట్లిపోతాయా అన్న ఆలోచనల్లోంచి.. ఆ చీకటిలోంచి ఒక వెలుగు... ఒక కాంతికిరణం.

తనది అన్న సామ్రాజ్యం కూలిపోయిన నాడు కూడ, సరియైన పరిపాలన చేసిన ఘన సామ్రాజ్య విజేత మొహంలో కనిపించే ఒక పెద్ద సంతృప్తి.. యుద్ధంలో ఓటమి తప్పదని తెలిసినా, చివరివరకూ పోరాటం సాగించిన సైనికుని మనసులో, తన ప్రయత్నం పట్ల ఏర్పడిన తృప్తి.. అటువంటిదే రమకు కలిగింది.

జీవితంలో గెలిచామా, ఓడామా అన్నది ముఖ్యం కాదు. జీవన సమరం సాగించామా లేదా అన్నది ప్రశ్న.

గమ్యం చేరామా, లేదా అన్నది తర్వాత విషయం. మన నడక చివరి వరకూ సాగించామా, లేదా అన్నది ముఖ్యం.

కొందరికి జీవిత చరమాంకంలో ఏర్పడే తామరాకు మీది నీటిబొట్టులాంటి యోగ తత్వం, మరికొందరికి జీవిత ప్రారంభంలో కలగవచ్చు.

ఒక విరక్తికి, ఒక వైరాగ్యస్థితికి తేడా ఉంటుంది. ఎదుర్కొన్న పరిస్థితి మీద విరక్తి ఉంటే మిగిలిన పనుల మీద అనురక్తి. సమానంగా చూడగలిగిన అలౌకిక దృష్టి. అటువంటి స్థితి అందరికీ కలుగదు. కలిగినవారికి జీవితంలో ఎదురు ఉండదు. సామాన్యులు పొందే ఆరాటం, వారిలో కలుగదు.

ఆ రాత్రి ప్రభాత్ ఇంటికి రాలేదు. రమ తనలో తాను నవ్వుకొంది. "రమా నువ్వు నా ప్రాణం. నిన్ను విడిచి క్షణం కూడా ఉండాలన్పించదు. ఆఫీసు.. జీవితం ఇవన్నీ మనకి ఎడబాటు కలిగిస్తున్నాయి" తన కళ్ళల్లో కళ్ళు పెట్టి చూస్తూ, తన చెంపలు నిమురుతూ ప్రభాత్ పలికిన మాటలు గుర్తొచ్చాయి.

అవి విని తను నిలువెల్లా పులకించిన సందర్భం గుర్తు వచ్చింది.

"రమా! నిన్ను చూశాక నా కళ్ళకి నిద్ర లేదు. నా జీవితం, నా గమ్యం నువ్వే నన్పిస్తోంది. ఎప్పుడెప్పుడు మనం ఒకటవుతామా అని వెయ్యి కళ్ళతో ఎదురు చూశాను. ఈ క్షణాలు నా జీవితంలో మధురక్షణాలు" మొదటిరాత్రి అతడు తనను తనివితీరా కౌగలించుకుని పలికిన పలుకులు.

"రమా! నా జీవితం అంతా నీకు అంకితం" అతడు తన్మయంగా అంటే, తను నవ్వింది.

"జీవితం అంటే చాలు. మీరు అంతా

అంటున్నారు. అందుకని నవ్వాను" తను చెప్పింది.

అతడు క్రింద వెదుకుతూంటే "ఏమి టండీ!" తను అడిగింది.

"నువ్వు నవ్వితే రాలిపడిన ముత్యాలు ఏరుకొందామని వెదుకుతున్నాను"

రమ సిగ్గుతో చేతులలో మొహం దాచు కుంది. అతడు, తాను గడిపిన మధుర క్షణాలన్నీ ఇప్పుడు నిర్జీవంగా ఆమె కళ్ళకి కన్పిస్తున్నాయి.

మగవాడు చెప్పే ప్రతీ మాటా నమ్మడం ఆడదాని దౌర్బల్యం. ఆడదాన్ని పరవశింప చేసే మాటలు మాట్లాడటం మగవాడికి వెన్నతో పెట్టిన విద్య.

అసలు ఎక్కడ ఉంది లోపం? మగవాడిని అంతగా ఆరాధించి, తన బతు కును నైవేద్యం పెట్టే మగువ అంతరంగం లోదా?

అతడు తప్ప తనకు ఇహ పర సాధన లేదని నమ్మే భావనలోనా? తనని తాను తక్కువ చేసుకోవడంలోనా? అవతలివారిని ఉన్నత శిఖరం మీద కూర్చోబెట్టి, లేని ఆధి క్యతను అంటగట్టటంలోనా?

ఆమె తననుతాను శోధించుకోవడం లేదు. తరతరాల స్త్రీ జాతిని శోధిస్తోంది. ఈ పరిశీలనలో 'ప్రక్షాళన' ఉంది. ఈ శోధనలో సత్యం ఉంది. సత్యాన్ని కాదనే ధైర్యం వ్యవస్థకు ఉందా?

అందుకే ప్రభాత్ ఇంటికి రాకపోయినా, కళ్ళు తెరుచుకొని మింటినున్న తారలను చూస్తూ, అనాసక్తంగా గడిపింది.

తెల్లవారుఝామున కాలింగ్‌బెల్ మోగితే బరువుగా లేచి వెళ్ళింది. ఇంకె వరు? అతడే వచ్చి ఉంటాడు అనుకొని ముందుకి వెళ్ళి తలుపు తీసింది.

ఎదురుగా ఉన్న వ్యక్తిని చూసి, ఆనం దంగా ఆహ్వానించింది. "నాన్నగారూ! మీరు.. మీరు ఎలా వచ్చారు? నాకు వస్తున్నానని చెప్పలేదేం? "

ఆయన తన బ్యాగ్ లోపల పెట్టి నవ్వారు. "నేనూ అనుకోలేదమ్మా వస్తా నని. హిమ వెళ్ళమంది. నిన్ను, అల్లుడిని తీసుకొని రమ్మంది" ఆయన చెప్పారు.

"ప్రభాత్ ఏడమ్మా!" ఆయన అడిగారు.

"పనుండి వెళ్ళారు నాన్నగారూ! మీరు రండి" అంటూ ఆయనను లోపలికి తీసు కొని వెళ్ళింది.

పగలంతా తండ్రి, కూతురు ఏవో కబుర్లు చెప్పుకుంటూ గడిపారు. పక్కింటా విడ పనిలో ఉండి, ఇటు చూడకుండా, బంధువుల ఇంటికి వెళ్ళింది. సాయంత్రం వస్తాను అని రమకు చెప్పమని పనిమని షికి చెప్పింది.

రమ ఒకటే అనుకుంది. ఎవరి జీవి తంలో అయినా 'కష్టసుఖాలు' అనేవి సహజం. రెండింటిలో ఏ ఒక్కదానికి ప్రత్యేక ప్రాముఖ్యత ఇవ్వకుండా సమంగా చూడాలి. అంతే!

తండ్రికి తనకు నచ్చినవి వండి పెట్టింది. ఆయన ఉదయం భోజనం చేసే సమయంలో, రాత్రి భోజన సమయంలో అల్లుడి కోసం ఆగుదామన్నారు. రమ వద్దంది. "ఆయన ఎప్పుడు వస్తారో? పని ఎక్కువగా ఉంటే రారు. మనం చేద్దాం పదండి..." అంది.

"అమ్మాయి ఇంతగా చిక్కిపోయిందే మిటి? " ఆయనను వేధిస్తున్న ప్రశ్న అది.

"అమ్మా ఇంతగా చిక్కావేమిటి తల్లీ!" ఆయన బాధగా అడిగారు.

రమ తేలికగా నవ్వింది.

"మీకు దూరంగా ఉన్నాను. మనసులో బెంగ ఉందేమో? అయినా నాకు అలా అన్పించలేదు. ఒంట్లో బాగానే ఉంది"

రాత్రి రమ తండ్రికి పక్క గదిలో పక్క ఏర్పాటు చేసింది. ప్రభాత్ ఈ రాత్రి రాక పోతే ఫర్వాలేదు. వస్తే.. రమ మనసు ఆ







ఆలోచనకే వణికింది.

ప్రభాత్ ఉదయమే ఇంటికి వద్దామనుకొన్నాడు. జలజ కూతురిని తన తల్లి వచ్చి తీసికెళ్ళిందని, తను ఆఫీసుకు సెలవు పెట్టానని ఫోను చేసింది. అతడూ సెలవు పెట్టి అటు వెళ్ళిపోయాడు.

అతడు తననితాను సంస్కరించుకోకుండా రమను నిందిస్తున్నాడు. దాని రోగం కుదర్చాలి. డబ్బు దగ్గర పేచీ. తన సరదాల దగ్గర పేచీ. ఇంకా ఆమెను బతిమాలి, మామూలుగా సంస్కారం తెచ్చుకుని ప్రవర్తిద్దామనుకొన్నాడు.

అది తనను నమ్మలేదు. దానికి ఎలా బుద్ధి చెప్పాలి? అతడి శరీరం అక్కడే ఉంది కానీ మనసు ఇంటి చుట్టూ తిరుగుతోంది.

జలజ ఇంట్లో ఇంక ఉండలేక ఇంటికి బయలుదేరాడు. ఈలోపే ఫ్రెండ్ ఒకరు ఇంటికి ఫోనుచేసి, అతడు ఆఫీసుకు రాలేదని, మర్నాడైనా వస్తాడా అని అడిగాడు. రమ ఏం సమాధానం చెపుతుంది?

పదకొండు గంటలప్పుడు కాలింగ్ బెల్ మోగడంతో రమ వెళ్ళి వెంటనే తలుపు తీసింది. తండ్రి గది తలుపులు దగ్గరగా వేసింది. ఆయన నిద్రలో ఉండటం వలన తలుపు తీయడం తెలియలేదు.

ప్రభాత్‌కు మావగారు వచ్చారని తెలియదు. రమను చూసి వంకరగా నవ్వుతూ బాత్‌రూంలో దూరాడు. ఫ్రిజ్‌లోని మజ్జిగ తాగి, పక్కమీద వాలాడు.

రమ మనసు అయోమయంగా ఉంది. తండ్రి వచ్చినట్లు అతడికి ఎలా చెప్పడం? అతడు తాగి వచ్చాడని మనిషిని చూస్తేనే తెలుస్తోంది. ఏం తగాదా పెడతాడో? ఎలా.. ఎలా తండ్రిని మర్యాదగా ఇంట్లో నుంచి వెళ్ళేలాగ చూడాలి?

అతడికి తన గదిలో రమ ఇంకా కూర్చోవడం ఆశ్చర్యం కలిగించింది.

"రానీ! దారికి రానీ! తను తొందరపడి, దగ్గరికి పిలిస్తే బెట్టుచేస్తుంది" అతడు పంతంగా పక్కపై నిద్ర నటించాడు.

రమ అమ్మయ్య అనుకుని లైటు ఆర్పి, సోఫా మీదే పడుకుంది. మనసుపడిన ఆవేదన, శరీర శ్రమ ఆమెకు నిద్రను ప్రసాదించాయి.

తెల్లవారుఝామున మంచి నీళ్ళకని ప్రభాత్ లేచాడు. ఫ్రిజ్‌లోని బాటిల్ తీసికొని, మంచి నీళ్ళు గడగడ తాగాడు. అతడికి నిద్రమత్తు, మందు మత్తు వదిలాయి.

తిరిగి వస్తోంటే.. అప్పుడు... ఆదమరిచి, అలిసిపోయి నిద్రపోతున్నా రమపై అతడి దృష్టి పడింది.

రమ పలుచటి పొట్టపైనున్న పమిట, పక్కకి చేరింది. పచ్చటి పట్టుచీర మడత లాగ ఉంది ఆమె ఉదరభాగం.

ఈ అందాల భరిణ కడుపులో తన బాబు.. బిడ్డ గురించి ఏం కలలు కంటోందో?

అతడికి మనసు పులకరించింది. రమ నిద్రలో పక్కకి ఒరిగి పడుకుంది.

నెలవంక పక్కకి ఒరిగినట్లు అతడి కళ్ళకు అన్పించింది. తన భార్య.. తన ఇష్టం. తను తండ్రి కాబోతున్నాడని చెప్పిన తర్వాత.. ఒక్కసారి.. ఒక్కసారి... రమను కలిశాడు. ఎన్నాళ్ళయింది?

అతడిలో కోరిక పడగ విప్పింది. అతడు ఆమెను ఆక్రమించుకోవడం మొదలుపెట్టాడు.

తనపైన పెద్ద బరువు పడ్డట్లు అయి, రమకి మెలకువ వచ్చింది.

మొహం దగ్గరగా ప్రభాత్ మొహం, మందు వాసన.. రమ నిద్రమత్తు వదిలిపోయింది.

"ఏయ్.. ఏమిటిది? మీరు ముందు లేవండి. నన్ను వదలండి" రమ గింజుకుంటోంది.







"వదిలే ప్రసక్తిలేదు. నేను భర్తను. నువ్వు భార్యవు. నేను చెప్పినట్లు వినవలసిందే" అతడు అరిచాడు.

రమ అతడిని వదిలించుకోవాలని ఎంత చూసినా కుదరడం లేదు. అతడు పైశాచికంగా ప్రవర్తిస్తున్నాడు.

"వాళ్ళ దారి వేరు.. నీ దారి వేరు.. నువ్వు నా ముద్దుల పెళ్ళానివి. ఎప్పుడూ వాళ్ళ గురించి ఆలోచన ఎందుకు? అందు బాటులోకి వచ్చారని అనుభవించాను. అది తప్పా? " అతడు అరుస్తున్నాడు.

రాఘవరావుకు మెలకువ వచ్చింది. మాటలన్నీ వినబడుతున్నాయి. మొదట అది కల అనుకొన్నారు. ఎంత చెడ్డ కల... తన అల్లుడు... తన రమ భర్త... అలా మాట్లాడటమా .. నిజం కాదు కదా!

"రమా! ఇది కల అనుకొంటున్నావా? కాదు.. నిజం. నీ ఇష్టం లేకుండా నిన్ను ముట్టరాదన్నావు. ఇదిగో! చూడు. ముట్టుకున్నాను. ముద్దు పెట్టుకున్నాను. ఇంకా నీ బుగ్గను.. కలకత్తా జామపండు లాంటి నీ బుగ్గను కొరుకుతున్నాను..."

అతడి మాటలకు అంతులేదు. చేతలు బాధాకరంగా ఉన్నాయి. రమలో అతడిని ప్రతిఘటించే శక్తి నశిస్తోంది.

"ఈ ప్రభాత్ చెప్పింది చేస్తాడు. వీడు మగవాడు. ఎవరు ఇష్టమైతే వాళ్ళతో ఉంటాడు. నాకు వయసు ఉంది. అందం ఉంది. ఉద్యోగం ఉంది. నాకు అడ్డూ, ఆపు లేదు. నువ్వు నేను చెప్పినట్లు వినాలి. అర్థమైందా.. ఊ.. నన్ను. నన్ను..."

రమలో అంతశక్తి ఎలా వచ్చిందో? అసలు ఆ ఆలోచన ఎలా వచ్చిందో? ఒక్కసారి కుడికాలి మోకాలు మడిచి అతడి డొక్కలో తన్నింది.

"అబ్బ.. రాక్షసి.. దెయ్యం..." అంటూ అతడు డొక్కలో చెయ్యి పెట్టుకుని పైకి లేచాడు. ఎలాగో జారిపోయిన లుంగీ కట్టుకున్నాడు.

రమ వెంటనే సోఫాలోనుంచి లేచింది. తన దగ్గరకు రాబోతున్న అతడి వైపు తర్జని చూపిస్తూ అంది, "నన్ను రాక్షసిని చేసింది నువ్వు తాకవద్దంటే పెడచెవిని పెట్టి, సాధిస్తున్నావు"

రమ ఊపిరి తీసుకోవడానికి ఆగింది. ఈలోపు రాఘవరావు బయటకు వచ్చారు.

"అమ్మా! రమా!" అంటూ మంచి నీళ్ళు తెచ్చి అందించారు.

ప్రభాత్ మావగారిని చూసి అవాక్కయ్యాడు. పలకరించడానికి అతడికి మాటలు రాలేదు.

రమ తండ్రి ఇచ్చిన మంచినీళ్ళు తాగింది. ఆయన బాధతో అడిగాడు. "ఏమిటమ్మా! ఇదంతా? "

"అంతా నాఖర్మ నాన్నగారూ! మనం మోసపోయాం. ఈయన ఒక మేకవన్నె పులి"

ప్రభాత్ ఆమె మాటలకు అడ్డువచ్చాడు. "మావయ్యగారూ! మీరు ఎప్పుడు వచ్చారు? ఇలా రండి. ముందు కూర్చోండి. రమా! అవన్నీ ఎందుకు? "

రమ అతడిని తీక్షణంగా చూసింది. "అవన్నీ ఎందుకా? మీరు ఏం చేశారు? నా బతుకుని బయట పడేశారు. ఆయన వచ్చారని ఆగారా? నన్ను చెప్పనిచ్చారా? "

ప్రభాత్ తల దించుకొన్నాడు.

"మావయ్యగారూ! ఏదో ఫ్రెండ్స్ బలవంతం వలన.." రమ అతడివైపు ఏహ్యంగా చూసింది.

"మీకై మీరు ఏ తప్పులూ చేయలేదు. ఫ్రెండ్స్ బలవంతం వలన తాగి వస్తారు. పనిమనిషి కూతురిని చూసి, మనసు ఆగక దానితో సంబంధం పెట్టుకొన్నారు. కామదృష్టితో చిన్న పిల్లను చూడటం తప్పు కాదూ? దానికి ఆ దృష్టి కలిగించడంలో మీరు గెలుపు పొందారు! అది అయ్యా

## జూన్-09
# చతుర ప్రవేశిక విజేతలు వీరే!

డ్రాలో ఎంపికైన ఈ అయిదుగురికీ త్వరలో బహుమతులు అందుతాయి.



1. **పి.ఓంప్రకాశ్** - సద్దలగుండు, మహబూబ్‌నగర్ జిల్లా
2. **బి.సుధాకర్‌రావు** - సరూర్‌నగర్, హైదరాబాద్
3. **జయశ్రీ** - ట్రూప్‌బజార్, హైదరాబాద్
4. **యస్. శ్రీనివాస్** - వెలిచాల, కరీంనగర్ జిల్లా
5. **వై.జయప్రద** - స్టేషన్‌రోడ్, తెనాలి



### సరైన జవాబులు

1. లారెన్స్ స్టెర్న్ 2. మాలతి 3. తొమ్మిదో తరగతి 4. సీతారామయ్య 5. ప్రసాద్ 6. గాలిబ్ 7. జార్జి వాషింగ్టన్ 8. రాజారత్నం పిళ్లే 9. చిదంబరం 10. రాజారామ్‌కు

గారూ, అయ్యగారూ అంటూ మీ పొందు కోసం తిరిగేలా చేసిన ఘనులు మీరు..."

రాఘవరావు కదిలిపోయాడు.

"అమ్మా! ఇదంతా నిజమా? "

"మావయ్యగారూ? రమ లేకపోవడం వలన అలా ఏదో జరిగింది. నా పద్ధతి నేను మార్చుకొంటాను" అవన్నీ నమ్మవద్ద న్నట్లు చెప్పాడతను.

రాఘవరావుకు నిజంగా ఏమీ అర్థమ వడం లేదు. తన చిన్నారి బిడ్డ ఇన్ని బాధలు అనుభవించిందా? తమకు ఏమీ తెలియలేదు. తెలుసుకోకుండా ఎలాగ బతి కారు.

తమ పాప మనశ్శాంతి కరువై అల్లాడు తోంటే తమకు తెలియలేదు.

"మావయ్యగారూ! నన్ను క్షమించండి. ఏహో నావలన చిన్న పొరపాట్లు దొర్లిన మాట నిజమే. కానీ రమ గర్భవతి. తను మీకు ఈ విషయం తెలియజేసిందనుకొం టాను" ప్రభాత్ మరొక బాణం విసిరాడు.

రమ గర్భవతి అంటే మావగారు సరదా పడతాడు. కూతురు తల్లి అయిందన్న ఆనందంలో అల్లుడి పనులు పట్టించు కోరు. ఇప్పటికి ఈ గండం గడిస్తే తర్వాత చూసుకోవచ్చు.

అయితే అతడి పాచిక రమ ముందు పారలేదు. "నాన్నగారూ! మీకు ఆ వార్తను చెప్పలేకపోయాను. కారణం ఈయనే! మొదటిసారి తల్లి కాబోతున్నానన్న ఆనందం నాలో తుడిచిపెట్టేశాడు. బయట ఎవరెవరితోనో సంబంధాలు. ఒకటా, రెండా.. ఏమో.. ఎన్నో..."

"రమా.. అంత మాట అనకు" ప్రభాత్ చిన్నగా అన్నాడు.

రమ విరక్తిగా అంది. "భార్యను దాటి వెళ్ళినపుడు ఎందరైతే ఏమిటి? ఎవరైతే ఏమిటి? "

"విన్నారాండీ! మీ అల్లుడు అందగాడట. వయసులో ఉన్నాడట. అందుకని లక్ష్మి, జలజ.. ఇలా మోజుతో ఈయన పొందు కోరారట. ఇదే ఈయన నిర్వాకం. ఈ



గర్భం ఉంచుకోవాలో, తీయించుకోవాలో నాకు అర్థమవక దిగులుతో, బెంగతో ఆయోమయంలో గడిపాను"

రాఘవరావు సోఫాలో కూలబడ్డారు. రెండు చేతులతో తల పట్టుకొన్నాడు.

రమ తండ్రిని చూసి అంది.

"నాన్నగారూ! బాధపడవద్దు. మీ అమ్మాయికి పట్టిన గ్రహణం ఈనాడు తొలిగిపోయింది. ఆనందించండి."

"రమా! మావయ్యగారికి మన సంప్రదాయం అంటే ప్రాణం. ఆయన మనసు అర్థం చేసుకో! నువ్వు ఆవేశంలో ఉన్నావు. ఆవేశంలో తీసుకొన్న ఏ నిర్ణయం సరైనది కాదు. మనం నెమ్మదిగా రేపు మాట్లాడుకొందాం" ప్రభాత్ రాఘవరావుని సమీపించబోయాడు.

"మీరు మమ్మల్ని మాయ చేయవద్దు. 'సంప్రదాయం' మాకేనా? మీకు వద్దా? మన బతుకులను అల్లరిపాలు చేసుకోవాలని మీకు అన్పించినపుడు ఈ సంప్రదాయం అడ్డురాలేదా? మిమ్మల్ని నమ్ముకున్న భార్యను వదిలి, బయట స్త్రీలతో తిరగమని ఏ సంప్రదాయం మీకు చెప్పింది? "

"మీకు ఒక సిద్ధాంతం, నాకు ఒక సిద్ధాంతం. అలాంటి వాటికి కాలం చెల్లింది. మీరు నా మనసు విరిచేశారు. డబ్బు మీద కాంక్షతో నన్ను పెళ్ళాడారు. నా అందం జుర్రుకోవాలని 'పెళ్ళి' నాటకమాడారు. మీరు ఊసరవెల్లిలా రంగులు మారుస్తారు. మీతో జీవితం నాకు వద్దు" రమ తేల్చి చెప్పింది.

అంతకన్న మగవాడికి అవమానం ఏం ఉంటుంది? భార్య నీతో బతుకు వద్దంటే అది చాలదా? ఎన్నో మధురమైన ఊహలతో, కలసి బతకాలనే కోటి కోరికలతో పెళ్ళి చేసుకొని తనవారు అనుకొన్నవారినందరిని విడిచి ఎంతో త్యాగంతో, పురుషుని జీవితంలో అడుగు పెట్టిన స్త్రీ, తనంతట తానుగా ఆ స్థానం నుంచి తొలగి పోవాలనుకుందంటే... ఎంత సంఘర్షణ, ఎంత బాధ అనుభవించి ఉంటుంది? ఈ ఆలోచనలతోనే రాఘవరావు మనసు క్షోభిస్తోంది.

'తాత'నవుతానని ఆనందిస్తాడా? కూతురి కాపురం ఇలా అయిందని బాధపడతాడా?

మావగారు తనవైపు నిలబడాలని ప్రభాత్ ఆశించాడు. కూతురి కాపురం ఏ తండ్రి పాడుచేసుకొంటాడు? రమ మాటలు అతడిలోని అహాన్ని నిద్రలేపాయి. భార్యగా పడుండవలసినది తిరుగుబాటా?

"ఇందాకటినుండి చూస్తున్నాను. వెళ్ళిపోతానని భయపెడుతున్నావా? మూడోనాటికి పెళ్ళి చేసుకోగలను? నీ బతుకే ఏమవుతుందో ఆలోచించు. ఆడదానివని మరిచిపోకు" అతడు హెచ్చరించాడు.

"ఆడదానినని మీరు నన్ను భయపెడుతున్నారా? నేను ఎందుకు భయపడాలి? నాకు చదువు ఉంది. అందం ఉంది. 'నా' అనుకొనే తల్లి, తండ్రి ఉన్నారు. నా కష్టం, సుఖం తనవిగా భావించే స్నేహితురాలు హిమ ఉంది. వీళ్ళ సహకారం చాలదా.. మళ్ళీ నేను నిలబడి నా జీవితాన్ని నిర్మించుకోవడానికి? నేను సమాజానికి వెరవను. ఏ 'స్త్రీ' అయినా ఇష్టం లేని పరిస్థితులలో క్షణక్షణం చస్తూ బతికే కంటే, 'చైతన్యమైన' జీవితాన్ని మరొక మార్గంలో గడపడం మంచిదనే సిద్ధాంతానికి నేను 'శ్రీకారం' చుడతాను" రమ ఆత్మవిశ్వాసంతో చెప్పింది.

ప్రభాత్‌కి ఈ రమ కొత్తగా ఉంది. అయినా అతడు విషపు నవ్వు నవ్వుతూ అన్నాడు, "నీకు విడాకులు ఇవ్వను. నిన్ను ఏడిపించి, వెంటాడి వేధిస్తాను. నేనే గతి





## అనృతం నిజం

# సంగీత రంగంలో స్త్రీలు?

19వ శతాబ్దం ఉత్తరార్థం(1864)లో పశ్చిమ గోదావరి జిల్లాలో దాసు శ్రీరాములు జన్మించాడు. ప్లీడరీ చదివి ఏలూరులో ఆయన లాయరు ప్రాక్టీసు పెట్టి రెండు చేతులా సంపాదించారు. ఆయన సంగీతమూ, సాహిత్యమూ నేర్చుకొన్నారు. జావళీలు, కృతులూ, స్వరజతులూ రాశారు.



ఆనాటి సంగీత ప్రపంచంలో అందరూ మగవాళ్ళే. ఈ పరిస్థితిని మార్చదలిచాడు. బాలికల కోసమని ఏలూరులో సంగీత పాఠశాలనొకదాన్ని తెరిచాడు. ఎందరు విరోధించినా, సంఘ బహిష్కరణకు గురిచేస్తామని బెదరించినా శారదాంబ (తన కూతురు) అనే ఏకైక విద్యార్థినితో పాఠశాలను నడిపించాడు. రెండో సంవత్సరం నుంచి స్త్రీలు సంగీతాభ్యాసానికి ముందుకు రావడంతో పాఠశాల ప్రవర్ధమానమయింది.

అనుకొనేలాగ చేయకపోతే చూడు"

"మీరు నన్ను ఏమీ చేయలేరు. నేను తలుచుకుంటే మిమ్మల్ని ఈ క్షణమే చేయగలను. ఎలాగంటారా? మీకు చట్టం గురించి అవగాహన లేదు. మా తమ్ముడిని అడిగి తెలుసుకోండి"

వివాహేతర సంబంధాలు కలిగిన వ్యక్తులకు ఐదు సంవత్సరాలు జైలు శిక్ష, జరిమానా సెక్షన్ 497 ఐ.పి.సి ప్రకారం పడుతుంది. పంపమంటారా మిమ్మల్ని జైలుకి.

అత్యాచారానికి పాల్పడిన వ్యక్తికి సెక్షన్ ఐ.పి.సి 354 ప్రకారం రెండేళ్ళు జైలుశిక్ష, జరిమానా ఉంటాయి. మీరు నన్ను ఎలా బాధ పెట్టింది మీకే తెలుసుకదా?

ఇప్పుడు చెప్పండి. ఎవరు ఎవరిని బాధించగలరో? శిక్షించగలరో? మీ నీడలో పడుండటం కంటే మరొక శిక్ష ఏముంటుంది?

బిడ్డ పుట్టబోతున్నాడని భయపెడతారా? ఫర్వాలేదు. వాడిని ధైర్యంగా పెంచుతాను. భగవంతుడు నాకు ప్రసాదించిన మాతృత్వాన్ని ఆనందంగా స్వీకరిస్తాను. సరేనా! ఇంక మీ జీవితాన్ని మీ ఇష్టం వచ్చినట్లు నడుపుకోండి" అని, తండ్రిని చూస్తూ "ఇంక పదండి నాన్నా!" అంది.

రాఘవరావు కూతురివైపు చూశాడు. ఆమె కళ్ళల్లో ఆత్మవిశ్వాసం తొణికిసలాడుతోంది. తాను గడపబోయే జీవితం పట్ల అవగాహన ఉంది.

తన బిడ్డ ఏవేవో అనవసరపు ఆలోచనలు చేయడం లేదు. తన గురించి తను ఆలోచించుకొంటోంది. ఎప్పుడైనా సరే నియమనిబంధనలు ఉత్తమ జీవితానికి మార్గదర్శకంగా ఉంటాయి. తన చిన్నారి రమ ఈనాటి కష్టనష్టాన్ని, నిన్నటి బాధలను మరిచి, రేపటి మీద ఆశతో బతుకుతానంటోంది. అంతకంటే తనకు ఏం కావాలి?

ఆమెకు కొరత లేదు. తాను కొండంత అండగా ఉంటాడు. రాఘవరావు కూతురి చెయ్యి పట్టుకుని మనోనిబ్బరంతో "పదమ్మా" అన్నాడు.

తూర్పు దిక్కున వెలుగు రేకలు విప్పుకొంటున్నాయి. ఆ వెలుగు బాటలో వారిద్దరూ పయనమయ్యారు.

©





అపార్ట్‌మెంటాలజీ -18

# సీరియల్ పెళ్లిచూపులు

యర్రంశెట్టి శాయి



(గత సంచిక తరువాయి...)

"ఇది మా అమ్మగారు టీవీ సీరియల్ చూసే టైమ్‌సార్! ఇంకో పదినిమిషాలగ్గానీ ఆ సీరియల్ పూర్తవదు"

"అదేంటి ఈ టైమ్‌లో ఆమె ఏ సీరియల్ చూడకుండా ఖాళీగా ఉంటుందని ఆమేగా చెప్పింది?" చిరాగ్గా అడిగింది పద్మారావ్ భార్య కీర్తి.

"ఆ మాట నిజమే గానమ్మా- ఇవాళ క్రికెట్ మాచ్ ఏదో తగలడిందని సీరియల్ లేటుగా మొదలుపెట్టారు-"

"పోనీ మీ అయ్యగారిని రమ్మను- ఆయనొచ్చి మాట్లాడ్డానికేమయింది?" చిరాగ్గా అన్నాడు పద్మారావ్.

అప్పుడే అక్కడికొచ్చిన హనుమంతు అసలు సంగతి చెప్పాడు.

"కోటేశ్వర్రావ్ మేడమీద తన ఆఫీస్ రూమ్‌లో కూర్చుని టీవీలో ఎలక్షన్ ఎనాలిసిస్ చూస్తున్నాడండీ! ఇంకో అరగంటలో ఆ ప్రోగ్రాం అయిపోతుందట. అవగానే వచ్చేస్తానన్నాడు".

ఈలోగా మీకేం కావాలన్నా అన్నీ అరేంజ్ చేయమని ఆ పనిపిల్లకి చెప్పాడంట-"

ఆ మాటతో పద్మారావ్ భార్య కీర్తికి వళ్ళు మండిపోయింది.

"అంతసేపూ మేమిక్కడ ఏం చేయాలి? ఆ సంగతిముందే చెప్తే మేమూ ఇంకాసేపు టీవీ ప్రోగ్రామ్స్ చూసుకుని బయల్దేరే వాళ్ళం కదా" అంది నిష్ఠూరంగా.

"ఆ టీవీ ప్రోగ్రామ్స్ ఇక్కడే చూసుకోవచ్చుకదమ్మా! మీకే ఛానెల్ కావాలో అడిగి ఆన్ చేయమని అమ్మగారు చెప్పారు. ఏ సీరియల్ చూస్తారమ్మా?" అడిగింది పనమ్మాయ్ మల్లిక.

"రెండు కాపురాలు సీరియల్ పెట్టు" అంది కీర్తి. వెంటనే మల్లిక ఆ సీరియల్ వచ్చే ఛానెల్‌ను మాకెదురుగా ఎల్‌సీడీ టీవీలో ఆన్ చేసింది.

దాంతో పెళ్ళికొడుక్కి వళ్ళు మండిపోయింది

"మా అమ్మగారికి ఒక టీవీ పెడితే సరిపోయిందా? ఇంటికి గెస్టులొచ్చినప్పుడు కనీసం రెండు టీవీలయినా హాల్లో ఉంచా

లన్న కర్టెసీ కూడా తెలీదా మీ యజమానులకు? ఇప్పుడు నేను ఐపిఎల్ మాచ్ చూడాలంటే ఎలా? " అన్నాడతను విసుగ్గా.

"ఇవాళ పెళ్ళిచూపులు కదండీ! ఈ రోజు ఐపిఎల్ మర్చిపోండి" అన్నాడు హనుమంతు పెళ్ళికొడుక్కి నచ్చజెప్తూ.

"సరేనండీ మీ మాటమీద ఐపిఎల్ వది లేస్తా! కానీ ఇండియన్ ఐడల్ సంగతేంటి. ఆ ప్రోగ్రాం కంపల్సరీగా నేను చూసి నా ఓటు ఎస్.ఎమ్.ఎస్. చేయాలి కదా! దాని కయినా టీవీ ఉండాలికదా? "

ఈలోగా కోటేశ్వర్రావ్ వచ్చాడు హడావుడిగా.

"సారీ సార్! కొంచెం లేటుగా స్టార్టయింది మా ప్రోగ్రాం - అదేంటి టీవీ ఆన్ చేసుకోలేదు? " అన్నాడు ఆశ్చర్యంగా.

"పాపం ఒకటే టీవీ ఉందికద్సార్! వాళ్ళకి కనీసం రెండు టీవీలయినా అవసరం. నేను మీ ఇంట్లోపనిలో చేరినప్పటి నుంచీ చెప్తూనే ఉన్నా. హాల్లో గెస్టులకోసం కనీసం రెండు టీవీ లుండాలని! పాపం పెళ్ళికొడుకుగారు ఇండియన్ ఐడల్ ప్రోగ్రాం చూడాలంటున్నారు - వాళ్ళమ్మగారేమో వేరే సీరియల్ చూడాలి.. ఎలా ఇప్పుడు? " అంది పనిపిల్ల.

"నిజమే - వెంటనే ఒకటి కొందాం!

ఈ సర్వెంట్ మెయిడ్‌కి కూడా ఇండియన్ ఐడల్ ప్రోగ్రామంటే చాలా ఇష్టం! ఎస్.ఎం.ఎస్ చేయటం రాక మమ్మల్ని చంపుకు తింటోంటుంది" అన్నాడు కోటేశ్వర్రావ్.

పెళ్ళికొడుకు షాకయ్యాడు.

"ఏమిటి? సర్వెంట్ మెయిడ్ అయ్యుండి ఆ ప్రోగ్రాం లైక్ చేస్తోందా? షిఈజ్ గ్రేట్" అన్నాడు అభినందిస్తూ.

"ఇంతకూ మీ మిసెస్, మీ అమ్మాయి రారేం? కార్యక్రమం త్వరగా ముగిస్తే బాగుంటుంది కదా!" అన్నాడు పెళ్ళికొడుకు



తండ్రి పద్మారావ్.

"మా మిసెస్ చూస్తున్న సీరియల్ ఇంకా అవలేదులెండి- మధ్యలో మనం అరచి గీపెట్టినా రాదు - ఎందుకంటే ఆ సీరియల్ తన ఎనిమిదో ఏట నుంచే చూస్తోంది"

పెళ్ళికొడుకు తల్లి అర్థం చేసుకుంది "అవున్లెండి! నా కిష్టమయిన సీరియల్ మధ్యలో నన్ను రమ్మంటే నేనూ రాను కదా" అంది సానుభూతితో.

"అయితే ఓ పనిచేద్దాం. తల్లి తర్వాత వచ్చి మాట్లాడుతుందిగానీ ఈలోగా అమ్మాయిని పిలిపించండి- అబ్బాయి చూసేస్తాడు" అన్నాడు పద్మారావ్.

"అమ్మాయి ఈ టైమ్‌లో తన రూమ్‌లో స్టార్ చానెల్లో తనకిష్టమయిన సీరియల్ చూస్తుంటుందండీ! ఎవరు పిలిచినా రాదు- అందుకని మనమే ఆమె గదికి వెళ్తే అక్కడే మాట్లాడుతూ పెళ్లిచూపుల తతంగం ముగించేయవచ్చు" అన్నాడు కోటేశ్వర్రావ్.

ఆ అయిడియా అందరికీ నచ్చింది.

అందరూ కలసి మేడమీదున్న గదిలోకె



ళ్ళారు.

పెళ్ళికూతురు హాపీగా బెడ్‌మీద పడుకుని ప్రోగ్రాం చూస్తోంది. అందరూ వచ్చి బెడ్‌పక్కనే ఉన్న సోఫాల్లో కూర్చున్నా ఆమె టీవీ నుంచి కళ్ళు తిప్పలేదు

"సంజితా- పెళ్ళివారొచ్చారమ్మా" అన్నాడు తండ్రి

"యా-వెల్‌కమ్" అంటూ తల తిప్పకుండానే మాట్లాడింది

"మీరేం చదివారు? " అడిగాడు పెళ్ళికొడుకు




"డబ్లూడబ్లూడబ్లూ సంజితా డాట్ కామ్‌లో నా వివరాలన్నీ ఉన్నాయ్.. చూడండి"

"నీకు వంటపని వచ్చామ్మా? "

"వచ్చు కానీ చేయను - జాబ్ తర్వాత టీవీ ముఖ్యం నాకు. వంట మనిషిని పెట్టుకోవాల్సి ఉంటుంది" అంది సంజిత తల తిప్పకుండానే.

"మీరు టీవీ సీరియల్ చూస్తున్నప్పుడు డిస్టర్బ్ చేయటం మంచి మేనర్స్ కాదని నాకు తెలుసుగానీ ఆల్టర్‌నేటివ్ లేదు. మనం కాసేపు కొన్ని విషయాలు మాట్లాడుకుంటే బావుంటుంది" అన్నాడు పెళ్ళికొడుకు.

"మా ఆఫీస్‌లో వెబ్‌కెమెరా ఉంది. ఇద్దరం ఒకర్నొకరు చూసుకుంటూ మాట్లాడుకోవచ్చు" అందామె.

"యాయా- దటీస్ ఫైన్" అన్నాడు పెళ్ళికొడుకు.

"అన్నట్లు మీరే సీరియల్ లైక్ చేస్తారు? " అడిగాడు తను.

"ఇదే స్టార్‌లో వస్తోంది కదా! 'సబ్ పాగల్ హై' అనే సీరియల్. ఆ సీరియల్ 24 గంటలూ చూపించేట్లయితే నాకసలు పెళ్ళీ పెటాకులూ కూడా అక్కర్లేదు- అదంత ఇష్టం" అంది సంజిత.

పెళ్ళికొడుకు మొఖంలో రంగులు మారాయ్.

"ఇండియన్ ఐడల్‌ని మీరు లైక్‌చేయరూ? "

"అదంతా ఒక బుల్‌షిట్" అందామె.

దాంతో పెళ్ళికొడుక్కి కోపం వచ్చింది.

"వ్వాట్! అది బుల్‌షిట్టా! దాన్నిబట్టే తెలుస్తోంది- నీ టేస్టేంటో. ఇదిగో ఇప్పుడు నువ్ చూస్తున్న సీరియల్ ఉంది చూడు. దీన్ని మా ఆఫీస్‌లో అందరూ 'నట్స్' అంటారు తెలుసా? "

"డోంటాక్ రాట్- అలా అన్నవాళ్ళే నట్స్" అందామె మండిపడుతూ.

మేమంతా మధ్యలో ఇంటర్‌ఫియర్ అవక తప్పలేదు.

"సీరియల్స్ అన్నాక అభిప్రాయ భేదలుంటాయ్ బాబూ. వాటిని సీరియస్‌గా తీసుకోకూడదు"

"అమ్మాయిని మీరేమయినా అడగాలంటే అడగండమ్మా? " పెళ్ళికూతురు తల్లితో అన్నాడు.

"అడిగేదేముంది? మధ్యాహ్నం రెండు నుంచీ రాత్రి పదిన్నర వరకూ నేను నా రూమ్‌లో టీవీ చూస్తుంటాను. ఆ టైమ్‌లో

ఇంటిపనంతా అమ్మాయే చూసుకోవాలి- అందుకు ఒప్పుకుంటావామ్మా?" అడిగిం దామె.

"అలా నాక్కుదరదండీ! ఈవెనింగ్ ఎయిట్ టు టెన్ నేను నా రూమ్‌లోనే టీవీ చూస్తుంటాను. నన్నెవరూ డిస్టర్బ్ చేయకూడదు. నాకు పని చెప్పకూడదు" అంది ఆ అమ్మాయ్.

"మరి నాకు డిన్నర్ ఎప్పుడు సర్వ్ చేస్తావ్? రాత్రి పదకొండింటికా?" కోపంగా అడిగాడు పెళ్ళికొడుకు.

"అందుకే వంటమనిషిని పెట్టుకోమన్నాను"

మధ్యలో పని మనిషి కల్పించుకుంది.

"అమ్మగారూ- రోజుకొక్కసారయినా మీరిద్దరూ కలిసి భోజనం చేస్తే బాగుంటుంది కదా? పోనీ డైనింగ్ రూమ్‌లో కూడా రెండు టీవీలు పెట్టుకుని ఎవరి ప్రోగ్రాం వాళ్ళు చూస్తే సరిపోతుంది కదండీ. ఎలాగూ ఏ పార్టీ అయినా టీవీలు పంచిపెట్టే స్కీమ్‌లు మొదలుపెట్టారు కదా!" అంటూ సజెషన్ ఇచ్చింది.

మా అందరికి కూడా ఆ సజెషన్ నచ్చింది.

"ఇంతకూ నీ అభిప్రాయం ఏంటమ్మా? అబ్బాయి నచ్చాడా?" అడిగాడు హనుమంతు.

"లేదు" అందామె ఖండితంగా.

"ఎందుకని"

"నా సీరియల్ని అవమానపరచాడు"

"నాకూ ఆ అమ్మాయి నచ్చలేదు. నా సీరియల్ని ఇన్సల్ట్ చేసింది" అన్నాడు పెళ్ళికొడుకు.

"అయితే ఇంకా మనందరం ఎందుకిక్కడ- ఎవరి ఇంటికి వాళ్లెళ్లి సీరియల్స్ చూసుకుందాం" అన్నాడు హనుమంతు. అందరూ బయల్దేరారు.

"ఒక చిన్న రిక్వెస్ట్ సార్" అన్నాడు పెళ్ళికొడుకు. అందరూ ఆగిపోయారు.



"ఏమిటది?" అడిగాడు శంకరమూర్తి.

"ఆ పనమ్మాయ్ పేరేంటో నాకు తెలీదు. నాకా అమ్మాయి నచ్చింది. మీకూ- ఆమెకీ, ఎవరికీ అభ్యంతరం లేకపోతే ఆ అమ్మాయిని పెళ్ళి చేసుకోవాలనుకుంటున్నాను-"

అందరం షాకయ్యాం. పనమ్మాయి మొఖం ఆనందంతో వెలిగిపోయింది.

"మా ఇద్దరికీ ఇండియన్ ఐడల్ ప్రోగ్రాం ఇష్టం గనుక ఇద్దరం కలిసి ప్రోగ్రామ్ చూస్తూ ఒకటే రూమ్‌లో గడపొచ్చు. కలసి డైనింగ్ రూమ్‌లో భోజనం చేయవచ్చు" అంది పనమ్మాయ్.

"శుభం" అన్నాడు హనుమంతు.

సరిగ్గా అప్పుడే మా బిల్డింగ్ బయట పెద్దగా కోలాహలం, కేకలు వినిపించేసరికి అందరం బయటకు పరుగెత్తాం.

## "లవ్ జంప్"

**చా**లా పెద్దకేక అది.

ఆ కేక ఎక్కడి నుంచి వచ్చిందో మాకర్థం కాలేదు. ఆ కేక వెనుక మా అపార్ట్‌మెంట్స్‌లోని జనం గుమిగూడిన ధ్వనులు!

కోటేశ్వర్రావ్ కూతురు పెళ్లిచూపులు, టీ



వీ సీరియల్స్ పుణ్యమా అని ఫెయిల్ అయిపోయాక ఇంక మా అవసరం అక్కరలేదని- కిందకు దిగి పరుగెత్తాం.

మా అపార్ట్‌మెంట్స్ మెయిన్‌గేట్ దగ్గర కనిపించారు మా వాళ్ళంతా. ముఖ్యంగా లేడీస్, పిల్లలూ అందరూ అక్కడ కిక్కిరిసిపోయి 'ఎ'బ్లాక్ పైవైపునకు చూస్తున్నారు.

మేము కూడా వాళ్ళమధ్యకు చేరుకుని అపార్ట్‌మెంట్స్ టెర్రేస్ వైపు చూశాం. అక్కడి దృశ్యం చూసేసరికి- ఒక్కసారిగా మా గుండె ఆగినంత పనయింది.

ఎనిమిదో అంతస్తు పైనున్న వాటర్ టాంక్ పైనెక్కి- కిందకు దూకటానికి సిద్ధంగా కనిపించాడు ఓ యువకుడు.



"ఏంటి? వాడెందుకు వాటర్ టాంక్ ఎక్కినయ్?" అడిగాడు హమీద్‌మియా.

"ఏమో సార్, ఎవరికీ తెలీదిక్కడ!" చెప్పింది షైనీ.

"అసలు అతనెవరు ఉన్నయ్?" మళ్ళీ అడిగాడు.

"అది కూడా తెలీదుసార్- అసలతను మన అపార్ట్‌మెంట్స్‌కి చెందినవాడు కాదని మన యూత్ అంటున్నారు"

వాటర్‌టాంక్ మీదున్న వ్యక్తి సడెన్‌గా ఓ స్పీకర్ పట్టుకుని మాట్లాడటం మొదలుపెట్టాడు.

"సార్ నా పేరు దినేశ్! నేను సుధి అనే అమ్మాయిని ప్రేమించాను సార్. కానీ సుధి వాళ్ళ తల్లిదండ్రులు మా పవిత్రప్రేమను వ్యతిరేకిస్తున్నారు. మా పవిత్రప్రేమను అర్థం చేసుకోక సుధికి ఇంకో సంబంధం చూసి పెళ్ళిచేయడానికి ప్రయత్నిస్తున్నారు. ఇది అన్యాయం, అక్రమం, అమానుషం. ఇలా ఇష్టంలేని పెళ్ళిచేయటం ఇల్లీగల్ కూడా! అందుకే వాళ్ళను ఒప్పించి, నాకూ సుధికి వివాహం జరిపించకపోతే- నేను ఇక్కడి నుంచి కిందకు దూకి ఆత్మహత్య చేసుకోవాలని నిర్ణయించుకున్నా. ఒకవేళ వాళ్లు నా డిమాండ్‌కు ఒప్పుకుంటే నేను కిందకు దిగివస్తా! లేదంటే దూకటం గ్యారంటీ!"

ఇప్పటికే మేము ఇలాంటి దూకటాల గురించి ప్రతిరోజూ న్యూస్‌పేపర్లలో టీవీ ఛానెల్స్‌లో లైవ్‌గానూ చూసి ఉండటం వల్ల మాకేం ఆసక్తి కలిగించలేదా దృశ్యం. మనదేశంలో వీధికొకడు ఏదొక ఎత్తు ఎక్కి దూకుతానని బెదిరిస్తూనే ఉంటాడెప్పుడూ.

"ఆ సుధి అనే అమ్మాయి మా రామ్‌భరోసా అపార్ట్‌మెంట్స్‌లో ఉంటోందా?" అడిగాడు విజయ్‌యాదవ్ బిగ్గరగా.

"లేదు- నా సుధి హౌసింగ్‌బోర్డు కాలనీలో ఉంటోంది"

"అయితే నువ్ ఆడకేపోయి ఎందుకు దూకతయ్‌లేవ్- ఇక్కడికొచ్చి ఏమిటికి దూకుతున్నయ్?" అడిగాడు హమీద్ మియా.

"అదసలే కాంట్రాక్టర్లు కట్టిన ఇళ్ళుసార్! మెట్లెక్కుతుంటేనే బిల్డింగ్ ఊగుతోంది! టెర్రేస్ మీదకెక్కకముందే కూలిపోతే నా ప్రేమ ఎటూ కాకుండా ఫెయిలయిపోతుంది"

"పోనీ ఇంకో అపార్ట్‌మెంట్ ఎవర్దయినా చూసుకో లేదా దూకే ప్రోగ్రాం ఇంకో రోజు పెట్టుకో- ఇవాళ మా అందరికి చాలా ఎంగేజ్‌మెంట్స్ ఉన్నాయ్- నీ గొడవ సాల్వ్ చేసేంత టైమ్ లేదు" అన్నాడు శంకరమూర్తి.

ఆ దినేశ్ అనేవాడి మొఖంలో కోపం, షాక్ కనిపించినయ్.

"నేను డిసైడ్ చేసుకునివచ్చా! ఇవాళ నా ప్రేమ సక్సెస్ అవటమో- నేను చావ టమో తేలిపోవాలి-"

రాజేశ్వరి పరుగుతో వచ్చిందదక్కడికి.

"ఇదిగో బాబూ! అప్పుడే దూకకు! ఇంకో అరగంటాగి దూకు-" అంటూ అరచింది ఆత్రుతగా.

దినేశ్ ముఖంలో ఆనందం కనిపిం చింది.

"ఎందుకు? ఈ అరగంటలో సుధి పేరెంట్స్‌ని పిలిపిస్తారా? " అడిగాడతను.

"అబ్బే అందుక్కాదు. మా పిల్లలు ట్యూషన్ కెళ్లారు- ఇంకో అరగంటలో వచ్చేస్తారు- ఇలా దూకేవాళ్ళను 'లైవ్'గా చూడాలని వాళ్ళెప్పటినుంచో సరదా పడు తున్నారు-"

దినేశ్ ముఖంలో చిరాకు, కోపం కని పించినయ్.

సరిగ్గా అప్పుడే అరడజను టీవీ న్యూస్ ఛానెల్ వాన్స్ వచ్చేసినయ్. తుగ్లక్ ఛానెల్ రాజు వాన్ దిగుతూనే కెమెరాని అపార్ట్‌మెంట్స్ పైవేపు ఫిక్స్ చేయించి మా దగ్గర కొచ్చాడు.

"నమస్తే సార్- మీ అపార్ట్‌మెంట్స్‌లో మా ఛానెల్ కవరేజ్‌కొచ్చి చాలా రోజుల యిపోయింది. ఈ మధ్యన మర్డర్స్, కిడ్నా ప్‌లు, గృహదహనాలు, రేప్‌లు, లూటీలు లాంటివి ఏం జరగలేదా సార్? " నిరాశగా అడిగాడు.

ఆ కొశ్చన్‌తో మా హమీద్‌మియాకి కోపం వచ్చింది.

"అంటే? హమారే అపార్ట్‌మెంట్స్‌లో ఉండేటోళ్ళ గురించి క్యా సోంచ్ రహహై తుమ్? మేమంతా చంచల్‌గూడా జైల్లో గడిపి వచ్చిన చోర్, గూండే, లుటేరా లోగ్ అనుకున్నయ్? మాకు ఇజ్జత్ లేవనుకు న్నయ్? మేము పెళ్ళాం బిడ్డల్తో సంసారం చేసే టైప్ కాదనుకున్నయ్? " అంటూ గట్టిగా బెదిరించేసరికి రాజు కొంచెం తగ్గాడు.

"అలా అఫెండవకండి సార్! కిడ్నాప్‌లు, మర్డర్లు, రేప్‌లు, యాసిడ్ కొట్టడాలు ఇవన్నీ మన దేశంలో చాలా నార్మల్ కద్సార్- అపార్ట్‌మెంట్స్ కొంచెం ఎబ్‌నా ర్మల్‌గా ఉందని అడిగాను- అంతేగానీ అవన్నీ చేస్తారనీ, చేయాలనీ కాదు"

"అసలు మా అపార్ట్‌మెంట్స్ పైన ఒకడు ఎక్కి దూకి ఛస్తానంటున్నాడన్న విషయం మీకెలా తెలిసింది? " కోపంగా అడిగాడు విజయ్‌యాదవ్.

"ఆ దూకేవాడే సెల్‌ఫోన్లో చెప్పాడు - ఛానెల్ లైవ్ కవరేజ్ లేకుండా ఎవడూ దూకడు కదా- నిజం చెప్తున్నాసార్- ఇలా దూకి చచ్చేవాడి లైవ్ కవరేజ్ కోసం నెల రోజుల్నుంచీ ఎదురు చూస్తున్నాం- క్రైమ్ ఎలిమెంట్‌కి ఎప్పుడూ వ్యూయర్‌షిప్ బ్రహ్మాండంగా ఉంటుంది సార్! యాడ్ రెవిన్యూ అదిరిపోద్ది"

అతనూ మాట్లాడుతుండగానే ఆ ఛానెల్ న్యూస్ రీడర్ లైన్లోకొచ్చేసింది పైనీ తెచ్చిన పోర్టబుల్ టీవీ చుట్టూ మూగాం అందరం.

"రాజూ! రామ్ భరోసా అపార్ట్‌మెంట్స్ పైన నిలబడి తన ప్రియురాలితో పెళ్ళికొప్పుకోకపోతే దూకుతానని బెదిరి స్తున్న ఆ యువకుడి పరిస్థితి ప్రస్తుతం ఎలా ఉంది? "

(మిగతా వచ్చేనెల )







# అందానికి పునాది ఆరోగ్యం

– అనుష్క

**ఆరోగ్యం.. ఆనందం.. అందం..! ఈ మూడు పదాలకు పరస్పరం ఎంతో సంబంధం ఉంది అని వివరిస్తోంది ముద్దుగుమ్మ అనుష్క. నాజూగ్గా ఉంటూ యువతకు చక్కిలిగింతలు పెట్టేస్తున్న ఈ చిన్నది పూర్వాశ్రమంలో యోగా పాఠాలు నేర్పింది. అందుకే తన ప్రియ పాఠకుల కోసం మరోసారి పంతులమ్మగా మారి తనకు తెలిసిన, తను పాటిస్తున్న ఆరోగ్య విషయాల న్నింటినీ వెల్లడిస్తోంది.**

★ సూర్యోదయానికి ముందే లేవడం అల వాటు చేసుకోవాలి. వాతావరణం ఆహ్లాదకరంగా ఉంటుంది. మనసు కూడా ప్రశాంతంగా ఉంటుంది.

★ లేవగానే నిమ్మరసం, తేనె కలిపిన గోరు వెచ్చటి నీటిని తీసుకుంటాను.

★ యోగా.. నా నిత్య జీవితంలో ప్రతి ఉదయం కనీసం అరగంట సేపైనా యోగా చేస్తాను. ప్రతిరోజూ దీనికి అరగంట కేటాయిస్తే మనం బతికినన్నాళ్లు ఆరోగ్యంగా ఉంటామన్న విషయాన్ని గుర్తెరిగితే చాలు... ఇట్టే సమ యాన్ని కేటాయించేస్తాం.

★ ఉదయాన్నే అల్పాహారాన్నే ఎంచుకుం టాను. కొంతమంది తినడానికే పుట్టినట్టు తినే స్తుంటారు. పొద్దుపొద్దునే నూనె పదార్థాలను తీసుకోవడం అంతగా మంచిది కాదు. పండ్ల ముక్కలు, మొలకెత్తిన గింజలు, పాలు వంటివి శ్రేయస్కరం. ఇడ్లీ, ఊతప్పం, ఇడియాప్పం వంటివి తీసుకోవచ్చు. దోసెలు, గారెలు మాత్రం మితంగానే తినడం మంచిది.

★ పని ఒత్తిడిలో ఉన్నా తరచూ మంచి నీటిని తాగుతూ ఉండాలి. అందానికి, ఆరోగ్యానికి అసలు రహస్యం నీళ్లే. ఎన్ని నీళ్లు తాగితే అంత మంచిదన్న విషయాన్ని గుర్తెరగాలి.

★ నేనైతే ఎక్కువ ఘన పదార్థాలకన్నా ద్రవ పదార్థాలను తీసుకోవడానికే ఇష్టపడతాను. మరీ ముఖ్యంగా పళ్ల రసాలంటే బాగా ఇష్టం. వీలుంటే సన్నివేశాల చిత్రీకరణ విరామంలో రక రకాల పండ్లను తింటుంటాను.

★ ప్రతి చిన్న విషయానికీ ఇతరుల మీద ఆధారపడకుండా చేతనైనంత మనమే చేసుకో వడం వల్ల చురుగ్గా ఉండగలుగుతాం.

★ కూర్చున్న చోటు నుంచి లేవకుండా రిమోట్ మీట నొక్కి అన్ని పనులను కానిచ్చేస్తుంటాం. అందుకే ఉదయాన్నే అరగంట సేపు నడవడం ఆరోగ్యానికి ఎంతైనా మంచిది. నడవడానికి నాదెప్పుడూ ముందడుగే.

★ మధ్యాహ్నం భోజనం కూడా పుష్టిగా లాగించేయడం నాకు అలవాటు లేదు. రోటీలతో పాటు అన్నం మంచి కూరలను ఇష్టపడతాను. ముఖ్యంగా అన్నం పరిమాణం కన్నా కూరలను ఎక్కువగా తీసుకుంటాను.

★ నా వరకు నేనైతే మసాలా వంటకాలను, నూనె ఎక్కువున్న వంటకాలను పెద్దగా ఇష్టప డను. ఇవి ఆరోగ్యానికి మంచిది కాదని నమ్ము తాను.

★ సాయంత్రం గ్రీన్‌టీతో పాటు పచ్చి కూర గాయల ముక్కలు, బిస్కెట్లు తీసుకుంటా. వీలుంటే కాసేపు అటూ ఇటూ నడుస్తాను.

★ రాత్రి భోజనం కూడా చాలా త్వరగానే

ముగించేస్తాను. దాదాపు 7 లోపు నా భోజనం పూర్తవుతుంది. రాత్రి భోజనానికి, నిద్రకు మధ్య ఎక్కువ సమయం ఉంటే మంచిది. తిన్నది జీర్ణమవుతుంది. పైగా బరువు పెరిగే సమస్యలు పెద్దగా ఉండవు.

★ ముఖం కాంతిమంతంగా కనిపించడానికి నిద్ర గొప్ప దోహదం చేస్తుంది. నేనైతే ఎట్టి పరిస్థితుల్లోనూ రాత్రి 9 గంటలకు బెడ్ మీదకు చేరుకుంటాను. మరీ అవసరమనిపిస్తే తప్ప నిద్ర మేలుకోను. రాత్రి వేళల్లో పబ్‌లు, పార్టీలకు కూడా పెద్దగా హాజరుకాను.

★ పనుకోవడానికి ముందు గోరువెచ్చని పాలు తాగుతాను. దానివల్ల శరీరం నునుపుదేలడంతో పాటు నిద్ర త్వరగా వస్తుందని నమ్ముతాను.

★ అన్నిటికన్నా ముఖ్యమైనది మానసిక సౌందర్యం. మనసు ఆరోగ్యంగా ఉంటే ఆనందంగా కనిపిస్తాం. అది అందానికి దారి తీస్తుంది. మనసులో బోలెడన్ని విషయాలతో సతమతమవుతూ పైకి అందంగా కనిపించాలని పనిగట్టుకుని ప్రయత్నించినా ఫలితం ఉండదు. పైగా ఆరోగ్యం కూడా దెబ్బతింటుంది.



★ ఎక్కడి విషయాలను అక్కడే వదిలేయడం నాకు బాగా అలవాటు. సమస్యలొచ్చినా కూర్చుని ఆలోచిస్తాను. తీర్చగలిగినవైతే సరే. లేకపోతే ఎలాగూ జరిగేది జరగకమానదు. మధ్యలో అనవసరంగా బాధపడటమెందుకు ? అని సరిపెట్టుకుంటాను.

★ ఆత్మవిశ్వాసం, చిరునవ్వు... ఆడవాళ్లకు అదనపు ఆభరణాలు. ఇవి లేకుండా ఎన్ని ఉన్నా శోభించదు. ఎదుటివారిని చిరునవ్వుతో పలకరిస్తే ఉండే హాయి వేరు.

★ నవ్వడం కోసం, ప్రత్యేకంగా కార్టూన్లు చూస్తుంటాను. నవ్వు ఆరోగ్యానికి పరమౌషధం. నాకు కోపం, చిరాకుగా అనిపించినప్పుడల్లా నాకున్న ప్రత్యామ్నాయం నా సీడీలే.

★ అందరూ అన్ని విషయాలమీద దృష్టి పెడుతుంటారు కానీ పాదాలను పెద్దగా పట్టించుకోరు. వేడి నీళ్లలో కొంచెం ఉప్పు, షాంపూ కలిపి పాదాలను నాననిచ్చి కాస్త రుద్దుతూ కడిగితే మంచి ప్రయోజనముంటుంది.

★ నేనెప్పుడూ నాణ్యమైన మేకప్ సామాగ్రినే వాడుతుంటాను. ఖరీదైనా ఫర్వాలేదు. నాణ్యత ముఖ్యమన్నది నేను వ్యక్తిగతంగా పాటించే అంశం. నా వస్త్రధారణకు వేసుకున్న మేకప్‌కు పొంతన ఉండేలా జాగ్రత్తలు తీసుకుంటాను.

★ సర్వేంద్రియాణామ్ నయనమ్ ప్రధానం అంటారు. బయటి నుంచి వచ్చాక తప్పక చన్నీటితో ముఖాన్ని కడగాలి. మరీ ముఖ్యంగా కళ్లను. ఎండలో వెళ్లేటప్పుడు చలువటద్దాలను వాడడం ఉత్తమం. కళ్లు అలసిపోయినట్లు అనిపిస్తే నేను కీరదోస ముక్కలను గుండ్రంగా తరిగి కళ్లమీద పెట్టుకుని పడుకుంటాను. మంచి ఫలితం ఉంటుంది.

★ ప్రత్యేకంగా ఎన్నెన్ని పనులు చేస్తున్నా ప్రతి ఒక్కరూ మూకుమ్మడిగా ఆచరించాల్సిన విషయం ఒక్కటే. అదే శుభ్రత. మన ఆరోగ్యం, పరిసరాలు, ఇల్లూ అన్నింటినీ పరిశుభ్రంగా ఉంచుకోవాలి. చెడు ఆలోచనలను పక్కనబెట్టడం వల్ల మానసికంగా కూడా శుభ్రతను పాటించిన వాళ్లమవుతాం.

★ పొరుగువాళ్ల ఎదుగుదలను చూసి అసూయపడటం మాని.. ఆ స్థానాన్ని పొందడానికి కృషి చేస్తే విజయం మనదేనని నేను గట్టిగా నమ్ముతాను.

సేకరణ : **చల్లా భాగ్యలక్ష్మి**



# ఉర్దూ చిలుక ఫిరాఖ్ గోరఖ్‌పూరీ

**1896 - 1982**

**భారతీయ జన్యమైన ఉర్దూ ఈనాడు నలభైకి పైగా దేశాల్లో వ్యాప్తిగావడం భారత జాతికి గర్వకారణం. దీనికి వ్యవస్థిత రూపం కలిగించిన అమీర్‌ఖుస్రూ 'చుఁమన్ తోతియే హిందమ్' (నేను భారతదేశ శుకాన్ని) అని గర్వంగా చెప్పుకున్నాడు. వివిధ ప్రక్రియల్లో విస్తారంగా రచనలు వెలువడుతున్నా ఉర్దూ సాహిత్యంలో కవితకే అగ్ర తాంబూలం. అందులో 'గజల్' శిరోమణి వంటిది. హాలీ, వలీ, సౌదా, దర్ద్, మీర్, మోమిన్, గాలిబ్, చక్బస్త్, ఎక్బాల్, అక్బర్, సాహిర్, ఫైజ్ మొదలైన కవులు ఉర్దూ సాహితీ క్షేత్రాన్ని సంపద్విలసితం చేశారు. ఫిరాఖ్ గోరఖ్ పూరీ గజల్‌కు కొత్త నడకలు నేర్పి తనదైన విలక్షణ శైలిని ఏర్పరచుకున్న మహాకవి. ఆయన రచించిన 'గులె-ఇ- నగ్మా'కు 1969 సంవత్సరానికి భారతీయ జ్ఞానపీఠ పురస్కారం లభించింది. ఉర్దూలో ప్రప్రథమంగా ఈ పురస్కృతి స్వీకరించింది ఫిరాఖే.**

**ఫి**రాఖ్ గోరఖ్‌పూరీ 1896 ఆగస్టు 28న ఉత్తరప్రదేశ్‌లోని గోరఖ్‌పూర్‌లో జన్మించారు. తల్లిదండ్రులు పెట్టిన పేరు రఘుపతి సహాయ్. తండ్రి మున్షీ గోరఖ్‌ప్రసాద్ ఇబ్రత్. తల్లి మున్షీకి మూడో భార్య. వీరిది సంపన్న కుటుంబం. మున్షీ సుప్రసిద్ధకవి. బాల్యంలో ఫిరాఖ్ చదువు స్వస్థలంలోనే. సంస్కృతం, హిందీ, అరబిక్, పర్షియన్, ఉర్దూ, ఆంగ్ల భాషల్లో ప్రవేశం సంపాదించాడు. అలహాబాదులో ఇంటర్మీడియట్ చదివాడు. అప్పుడే తనకు ఇష్టంలేకపోయినా పెద్దల బలవంతంతో పెళ్లయింది. అనారోగ్యంవల్ల చదువు ఓ సంవత్సరం ఆపవలసి వచ్చింది. బి.ఎ.లో చేరి రాష్ట్రంలో నాలుగో స్థానంలో ఉత్తీర్ణుడయ్యాడు. ఉర్దూ, ఆంగ్ల సాహిత్యం విస్తారంగా అధ్యయనం చేశాడు. మున్షీ 1918 జూన్ 18న కాలధర్మం చెందారు. పైచదువులు ఆపి ఫిరాఖ్ కుటుంబ బాధ్యతలు నిర్వహించాడు. అప్పుడు డిప్యూటీ కలెక్టరుగా నియమితుడయ్యాడు. అంతే కాదు ఐ.సి.ఎస్.కు ఎంపిక య్యాడు. సోదరి వివాహానికి, కుటుంబ నిర్వహణకు చేసిన అప్పులు పెరగడంతో పిత్రార్జితమైన ఆస్తి అమ్మవలసి వచ్చింది. సరిపడని వైవాహిక బంధం, ఇంటి పరిస్థితులవల్ల మనోవేదనకు గురయ్యాడు. గాంధీజీ పిలుపుతో స్వరాజ్యోద్యమంలోకి దూకాడు. సమయం చిక్కినప్పుడు కవితలు రాయసాగాడు. ప్రేమ్‌చంద్ వంటి వారి సాహచర్యంవల్ల రచన వ్యాసంగం పెరిగింది. ఫిరాఖ్ ఆగ్రా జైలులో కిటికీ నుంచి తాజ్‌మహల్‌ను




చూసి పరవశించేవాడు. ఎన్నో గజళ్ళు రాశాడు. ఖైదీలతో ముషాయిరాలు జరిపాడు. ఒక గజల్‌లో ఇలా అంటాడు 'చూడు ఫిరాఖ్ ఈ కవి సమ్మేళన విచిత్రం/ ఖైదీలు విడిపోయినా వారి మనసులు మాత్రం ఏకత్రం'. ఒక సంవత్సరం

తర్వాత ఫిరాఖ్‌ను లక్నో జైలుకు మార్చారు. రెండు నెలల తర్వాత విడుదల చేశారు. గోరఖ్‌పూర్ తిరిగి వచ్చాడు. గాంధీ, నెహ్రూ ఆయన కవితల్ని మెచ్చుకునేవారు. ఒకసారి నెహ్రూ గోరఖ్‌పూర్‌లో ఫిరాఖ్ ఇంట్లో అతిథిగా వున్నారు. తర్వాత నెహ్రూ ఆయన్ని అలహాబాదులో కాంగ్రెసు కార్యాలయంలో ఉపకార్యదర్శిగా నియమించారు. గోరఖ్‌పూర్‌లో కుటుంబ వ్యయం భరించాలంటే వేతనానికి అదనంగా కొంత రాబడి అవసరం. హిందీ పత్రికల్లో ఉర్దూ కవిత్వ విమర్శ వ్యాసాల ద్వారా పారితోషికం లభించేది. కాన్పూరులోని 'జమానా' అనే ఉర్దూ పత్రికలో ఫిరాఖ్ రచనలు ఎంతోమందిని ఆకర్షించాయి. 1923 నుంచి 27 వరకు కాంగ్రెసు కార్యాలయంలో పనిచేశాడు. లక్నో, కాన్పూరుల్లోని కళాశాలల్లో అధ్యాపకుడిగా వుంటూ ఆగ్రా విశ్వ విద్యాలయం నుంచి సర్వ ప్రథముడుగా ఎం.ఎ. పట్టా పొందాడు. అలహాబాదు విశ్వ విద్యాలయంలో ఆంగ్లోపన్యాసకుడిగా చేరి శాఖాధ్యక్షుడిగా పనిచేశారు. 1958 డిసెంబరు 31న పదవీ విరమణ చేశారు. 1959 నుంచి 65 వరకు యు.జి.సి. రీసెర్చి ప్రొఫెసరుగా వున్నారు.

మీర్, ఇక్బాల్, జిగర్ వంటి మహాకవుల పంక్తిలో చేరిన కవి శేఖరుడు ఫిరాఖ్ గోరఖ్‌పూరీ. బహు భాషావేత్త, నిగర్వి, సౌజన్యశీలి, మానవతావాది. వివాహంవల్ల సోదరుల అకాల మరణం వల్ల తీవ్ర మానసిక వేదనను భరిస్తూనే అద్భుత కవితలు సృజించారు. 'కాల ప్రభావాన్ని ఎవరు తప్పించుకోజాలరు. ఎందుకంటే కాలం నీదీ నాదీ కాదు' అంటారో కవి లతలో. ఆయన వివిధ ప్రక్రియల్లో కవితలల్లినా 'గజళ్లు' అత్యంత జనాదరణ పొందాయి. ఆయన రుబాయిల్లో కూడా ప్రాచుర్యం పొందారు. ఫిరాఖ్ కవితల్లో పర్షియన్, సంస్కృత పదాల రమణీయ మిశ్రమం కనిపిస్తుంది. రుబాయిలో 4 పాదాలుంటాయి. వాచవిగా ఒక రుబాయి. "ఇన్సాన్‌కె పైకర్‌మె ఉతర్ ఆయాహై మాహె/ ఖద్ హై యాచడ్తీ అమృత్‌కి నదీహై ఆతాహ్/ లర్‌జా తెహువే జిసమ్ పెజల్ పడ్తీహై ఆంఖ్/ రస్‌కె సాగర్‌మే డూబ్ జాతీహై నిగాహ్". దీనికి డా. ఎస్. సదాశివ తెనిగింపు-"మానవాకృతి దిగియెనో మహికి శశియె!/ తనువా ఉప్పొంగు అమృత వాహినియె తలప/ సంచలద్దేహమక్షి గోచరము గాగ/ మునిగిపోవు రసార్ణవముననె చూపు" ఫిరాఖ్ హృదయం కోమలమైంది. అందుకే ఆయన గజళ్ళు అంత లాలిత్యాన్ని నింపుకుంటాయి. ఒక గజల్‌లో 'గాయనిని పాడమనండి ఎదలనేదో తాకినట్టు/ శ్రోతలందరి కనులు అశ్రుభరితమైనట్టు!' అంటారాయన. ఆయన కవితలు గాన యోగ్యాలు. ప్రణయ కవిత్వాన్ని గొప్పగా అభివ్యక్తీకరించడం ఆయన ప్రత్యేకత. 'మిష్ అల్', 'షబ్నమిస్తాన్', 'రమ్జొనాయత్' ఇత్యాది కృతులు ఇందుకు ఉదాహరణలు. సామాజిక రాజకీయ చైతన్యం ఆధారంగా ఆయన కొన్ని కవితలు రచించారు. స్వేచ్ఛకోసం సాగే ఉద్యమాలను బలపరిచారు. 'ధర్తీకి కర్వత్', 'ఇకాబె బీన్ రోటియాం' ఇందుకు తార్కాణాలు. 'మేరీ జిందగీకీ ధూల్ ఛాంప్' ఆయన ఆత్మకథ. 'ఉర్దూకి ఇష్కియా శాయిరీ' విమర్శన గ్రంథం. 'సాధుకి కుటియా' నవల. రూప్, మహల్, గుల్‌సాజ్, రూహె కాయనత్, గజల్‌స్తాన్, గులె-ఇ-నగ్మా, షాహిరస్తాన్, షబ్‌నమిస్తాన్, నగ్మేసాజ్, చిరాగాం, బజ్మే జిందగీ రంగేషాయిరే, రమ్జొ కనాయత్, హజార్‌దాస్తాన్, షౌలోసాజ్, గుల్బాంగ్, ధర్తీకి కర్వత్, మన్ ఆనం, హోషియె మొదలైన కృతులు ఉర్దూ సాహిత్యానికి ఆయన కూర్చిన పెన్నిధులు. ఫిరాఖ్ 'గీతాంజలి'ని ఉర్దూలోకి అనువదించారు.

జ్ఞానపీఠం లభించిన 'గులెనగ్మా' (సుమగీతం)ను 1959లో వెలువరించారు. ఇందులో 70 గజళ్లు, 20 నగ్మాలు, చాలా షేర్‌లు పొందుపరిచారు. వైవిధ్యంగాను, రసస్రవంతులుగాను సాగే ఈ కవితలు ఫిరాఖ్ భావుకతకు, కవితానిర్మాణ ప్రతిభకు నిలువుటద్దాలు. ఇందులో ఓ గజల్‌లోని పంక్తులు- "పత్రాల మాటున ఎన్నో స్వర్గవసంతాలు దాగివున్నాయి/ ముకుళాలు విచ్చుకున్నప్పుడు నాకద్వారాలు తెరచుకుంటాయి". ఎన్నో మధురోహలు నింపుకున్న కవిత ఇది.

ఫిరాఖ్ పద్మభూషణ్, కేంద్ర సాహిత్య అకాడమీ పురస్కారం, సోవియట్ ల్యాండ్ నెహ్రూ అవార్డు, గాలిబ్ అవార్డు అందుకున్నారు. ఆయన 1982 మార్చి 3న నిర్యాణం చెందారు. "అబ్ తుమ్ సెరుక్సత్ హోతాహూం, ఆవోసంభాలో సాజెగజల్/ నయె తరానె ఛేరొ, మెరే నగ్మోంకో నీంద్ ఆతిహై"- "ఇక మీనుంచి సెలవు తీసుకుంటాను. ఈ గజల్ అందుకోండి/ నా గీతాలకు నిద్ర ముంచుకొస్తోంది. కొత్త పాటలు ఆలపించండి"- అని వీడ్కోలు చెప్పిన కవికులశేఖరుడు ఫిరాఖ్. ఉర్దూ సాహిత్యాకాశంలో ఆయన ఉజ్జ్వల కాంతులు విరజిమ్మే భాస్వంతుడు.

—గోవిందరాజు రామకృష్ణారావు




'అబ్బ! జగపతిబాబు బలే హ్యాండ్సమ్‌గా ఉన్నాడే.. అలాంటి సీరియస్ రోల్స్‌లో అతనికి తిరుగులేదు..' తను రాత్రి చూసిన సినిమా గురించి హుషారుగా చెబుతున్న ప్రమీల బ్రేకు వేసినట్టు ఠక్కున ఆగిపోయింది.

చాకోబార్‌లు కొద్దిగా కొద్దిగా కొరికి చప్పరిస్తున్న స్వప్న, మాధవి.. ప్రమీల సడెన్‌గా మాటలు ఎందుకాపేసిందో అర్థం కాక తలెత్తి చూశారు. ప్రమీల కళ్లలో భయం! ఆమె చూస్తున్న వైపుచూసి వాళ్లూ ఉలిక్కిపడ్డారు..

ముగ్గురూ చటుక్కున లేచి నిలబడ్డారు. అక్కడి నుంచి వెళ్లిపోదామని బయలుదేరారు.

కానీ అప్పటికే ఆలస్యమైంది..

వాళ్లు రానే వచ్చేశారు..

నిన్న కూడా ఇంతే! సరిగ్గా ఇదేవేళ...

తాము ముగ్గురూ ఇలాగే సరదాగ మాట్లాడుకుంటున్నప్పుడు వచ్చారు. వె లిగా నవ్వుతూ ముగ్గురు స్నేహితురాళ్లను చుట్టుముట్టారు.

'అక్కో అక్కో అక్కా!
నీ బందుగులమొచ్చినమక్కా!
పరాకు సేయకె అక్కో...
నువ్ పైసల్దీయవె అక్కా
చిరాకు పడకే అక్కో..
నువ్ సిల్లర దీయవె అక్కా'

పైటల్లా వేసుకున్న తువ్వాళ్లను సరిచే కుంటూ ఆటపాటలు సాగిస్తూనే వా

ట్యాంక్‌బండ్ 21 కథలు

చేతుల్లోని హ్యాండ్ బ్యాగులు గుంజుకోబోయారు..

'అమ్మాయ్.. ఏంటీ దౌర్జన్యం?' గట్టిగా అరిచింది ప్రమీల.

'నేనమ్మాయినా? అయితే ఓకే పాపా' అన్నాడో హిజ్రా ఆమెకు ఫ్లయింగ్ కిస్సిస్తూ. మిగిలినవాళ్లంతా కిసుక్కున నవ్వారు..

ఒంటిపై ఎక్కడబడితే అక్కడ తడుముతూ వాళ్లు వెకిలిగా ప్రవర్తిస్తుంటే నిస్సహాయంగా మిగిలిపోయారా ముగ్గురు స్నేహితురాళ్లూ.

ట్యాంక్ బండ్‌పై వెళ్తున్న వాళ్లంతా వినోదంలా చూశారేతప్ప ఎవ్వరూ వచ్చి వాళ్లను ఆదుకోలేదు.. పైగా వెళ్తూనే ముసిముసి నవ్వులు.

'ఛీఛీ ఏం మనుషులు? తోటివాళ్లు అందునా ఆడపిల్లలు యాతన పడుతుంటే ఒక్కళ్లకీ జాలి, దయ లేదేం? అయినా ఈ జాతేంటి? ఆడా కాకుండా... మగా కాకుండా? దేవుడు ఇలాంటి వాళ్లను పుట్టించడం ఎందుకు?' అనుకుంది ప్రమీల మనసులో చిరాకుగా.

మిగిలిన ఇద్దరి ఆలోచనలూ ఇలాగే కొనసాగుతున్నాయి.

పావుగంట తర్వాత-

ముగ్గురి స్నేహితురాళ్ల వద్దా బలవంతంగా మూడు పాతికలు వసూలు చేసుకుని నిష్క్రమించింది హిజ్రాల గుంపు.

'నా పర్సులో డబ్బంతా లాక్కున్నారే







పాడుముండలు.. ఇప్పుడు బస్సెక్కడానికి ఛార్జీలు కూడా లేవు' ఏడుపుముఖం పెట్టింది మాధవి.

'సర్లే కుళ్లాయి కట్టేయ్.. మేమిస్తాంలే' అన్నారు స్నేహితురాళ్లిద్దరూ ఓదార్చుతూ.

ప్రమీల, మాధవి, స్వప్న పదోతరగతి చదువుతున్నారు. ముగ్గురుండేదీ రామ్‌నగరే! ఇందిరాపార్కు సమీపంలోని రామకృష్ణ మఠంలో ముగ్గురూ స్పోకెన్ ఇంగ్లీష్ క్లాసులకు వస్తున్నారు. క్లాస్ తర్వాత సాయంకాలం కాసేపు ట్యాంక్‌బండ్‌పై సేదతీరడం అలవాటైపోయింది.

వీరి ప్రశాంతతను చెదరగొట్టడానికా అన్నట్టు నిన్న, ఇవ్వాళ ముగ్గురికీ ఈ హిజ్రాల గుంపు శనిలా దాపురించింది.

★ ★ ★

హిజ్రాలు ఏదో చెబుతున్నా వినకుండా ముగ్గురూ విల్లునుంచి వెలువడిన బాణాల్లా మూడు దిక్కులకు పరుగుతీశారు..

తనను తరుముకుంటూ వస్తున్న హిజ్రాను తప్పించుకోవడానికి ప్రమీల ట్రాఫిక్‌ను లెక్కచేయకుండా వాహనాల మధ్య మెరుపులా పరుగుతీసింది..

అంతలో 'అమ్మా' అన్న కేక!

సడెన్ బ్రేకులతో కీసుమంటూ ఎక్కడి వాహనాలు అక్కడ ఆగిపోయాయి!

తలతిప్పి చూసిన ప్రమీల ఎవరో తనను పిలవడం చూసి ఆగిపోయింది.

పిలిచిన పెద్దమనిషి రక్తం మడుగులో పడున్న హిజ్రావద్దకు ఆమెను చేయిపట్టుకుని తీసుకెళ్లాడు.. ఆ దృశ్యం చూసి ప్రమీలకు తలతిరిగింది. మెల్లిగా అక్కడే కూలబడింది..

అంతలో-

కొనప్రాణంతో కొట్టుకుంటున్న హిజ్రా తనపక్కనే కూలబడ్డ ప్రమీల చేతిలో ఏదో పెట్టాడు.

అది ఆమె వజ్రపు ఉంగరం..

ఎక్కడో పారేసిందని ఇంటిల్లిపాదితో తనను నిన్న తిట్టించిన ఉంగరం! అంత ఖరీదైన ఉంగరం అతని చేతికి ఎలా వచ్చిందో అర్థంకాక అయోమయంగా చూసింది ప్రమీల.

అప్పటికే అక్కడ మూగిన జనం అంబులెన్స్ కోసం ఫోన్‌లు చేస్తున్నారు.

'నిన్న.. నీ.. బ్యాగ్‌లో చిల్లర తీసుకునేటప్పుడు వాటితో పాటు ఈ ఉంగరమూ వచ్చింది.. నేనూ నిన్న గమనించలేదు.. అబ్బ! అది నీకు ఇవ్వాలనే ఇవ్వాళ వచ్చాం.. కానీ నువ్వు..' అంటూ ప్రమీల కళ్లలోకి చూస్తూనే తలవాల్చేశాడతను.

అతనిచుట్టూ ఉన్న హిజ్రాలు ఘొల్లుమన్నారు.

ప్రమీల కళ్లూ తనకు తెలియకుండానే వర్షిస్తున్నాయి.

తన భుజం మీద ఎవరిదో చేయిపడడంతో తలెత్తిచూసిన ప్రమీలకు విషణ్ణవదనాలతో కన్పించారు మాధవి, స్వప్న.

మిత్రురాళ్ల ఆసరాతో లేచి గుంపుకు దూరంగా నడుస్తున్న ప్రమీల చెవికి హిజ్రాల ఏడుపుతోపాటు విన్పిస్తున్నాయేవో మాటలు లీలగా..

'ఏజెల్మలో ఏపాపం సేసినామో దేవుడిలా పుట్టించిండు.. దేవుడి పిలుపు వచ్చిందాకా ఎట్నో బతకాల మరి! కూలో నాలో సేద్దామంటే నవ్వేటోళ్లు, వెక్కిరించేటోళ్లే తప్ప పనులిచ్చేదెవల్లు? బతకడానికే తప్ప మేం సెడ్డోళ్లం కాదు మారాజా.. దరమపెబువులే మమ్మల్ని దయసూడాల..'

నెత్తురు కక్కుతూనే ఉంగరం తనచేతిలో పెట్టిన హిజ్రా మోహం కళ్ల ముందు ప్రత్యక్షమవడంతో ప్రమీల మనసు కకావికలం అయింది.

-చంద్రప్రతాప్

# మనసున ఉన్నదీ...



★ 'మోహినీ భస్మాసుర' నవలలో పురాణ కథకు, ఇప్పుడున్న పరిస్థితులకు అద్భుతంగా రచయిత ముడిపెట్టారు. మహాకవి దాశరథి అనువదించిన గాలిబ్ గీతాలను సందర్భోచితంగా, అర్థయుక్తంగా నవలలో ఇమిడేలా పొందుపరిచారు. స్నేహంలో ప్రేమ, ఆప్యాయతలనే చూసినవారికి ద్వేషం కూడా ఉంటుందని ఈ నవల ద్వారా తెలిసింది. సీతారామయ్య మూడో కొడుకు విషయం అసంపూర్తిగా పాఠకుల ఊహలకే వదిలేశారు.

నేటి టీవీ ప్రేక్షకులమీద హాస్యంతో అయినా యర్రంశెట్టి శాయి ఘాటుగానే చురకలు అంటించారు. టాంక్‌బండ్ కథ 'దోపిడి' ముగింపు హృద్యంగా ఉంది. అద్దంకి శ్రీనివాస్ కొత్తగాలి వర్ణన అందంగా ఉంది.

–మంచాళ శ్రీలక్ష్మి, సాగర్‌నగర్, విశాఖ

★ 'కలర్స్' స్వాతి ముఖచిత్రంతో చతుర రంగుల హరివిల్లుగా అలరించింది. వారెవ్వా!, చతుర ప్రపంచం అంశాలంటే మాకెంతో ఇష్టం. 'ఆరుద్ర చతురోక్తులు' ఆకట్టుకున్నాయి. నవలకు తగ్గట్టుగా భాస్కర్ చిత్రాలు సజీవంగా ఉంటున్నాయి.

–నేమాన సుభాష్ చంద్రబోస్, శ్రీకాకుళం

★ మోహినీ భస్మాసుర నవల ఎంతో ఆసక్తికరంగా ఉంది. పాత్రలను మలచిన తీరు బాగుంది. స్నేహితుడు సీతారామయ్యని ఎదగనీయని భూపతి మనస్తత్వమే అతని ప్రాణాలు తీసింది. ఎన్ని కష్టాలు ఎదురైనా చిరునవ్వుతో ముందు సాగినవాడు సీతారామయ్య. నాకు ఈ పాత్ర నచ్చింది. మాలతి అటు తన సమస్యను పరిష్కరించుకోవడంతో పాటు, ఇటు సీతారామయ్యకు మేలు చేసినట్లయింది. పరిమిత పాత్రలతో ఆసక్తి రేకెత్తిస్తూ మనస్తత్వాలు ఎలా ఉంటాయో విశ్లేషించిన ఈ నవల నచ్చింది.

–తుళ్లూరు ప్రసన్నలక్ష్మి,
పాతగుంటూరు, గుంటూరు

★ మమ్మల్ని విశేషంగా ఆకర్షించింది చతురకథ 'రెండు ముఖాలు'. మాజీ అమెరికా అధ్యక్షుడు బుష్ గురించి చాలా చక్కగా వివరించింది. అలాగే హిందీ కవితకు సొబగులు అద్దిన సుమిత్రానందన్ పంత్ గురించి మంచి విషయాలు జ్ఞానపీఠాలులో చెప్పారు. కాలాతీతంలో లారెన్స్ స్టెర్న్ నవల ట్రిస్ట్రాం షాండీ పరిచయం మాకు చాలా నచ్చింది. ప్రతినెలా ఆద్యంతం విడవకుండా చదివించే నవలలు వేస్తున్నందుకు ధన్యవాదాలు. చతుర నవల మోహినీ భస్మాసురలో సందర్భోచితంగా ఉన్న గాలిబ్ కవితలు చదివిన తర్వాత గాలిబ్ గురించి తెలుసుకోవాలనే ఆసక్తి కలిగింది.

– రాజేశ్వరి, కమలానగర్, అనంతపురం

★ 'మోహినీ భస్మాసుర'లో ప్రేమ, కక్ష సాధింపులను రేకెత్తించే సంభాషణలతో, ఎక్కడా నేరానికి తావివ్వకుండా కథను ఆద్యంతం వసుంధర నడిపిన తీరు రచయిత(ల) నైపుణ్యాన్ని ప్రదర్శించింది. నవల చివరలో మాలతి సాధించిన తీరు బదులు భూపతి తన పాపభారంతో తానే తన చావుకు కారణమైనట్లు ముగిస్తే ఇంకా బాగుండేదేమో. అపార్ట్‌మెంటాలజీ వాస్తవికతకు అద్దంపడుతుంది.

– ముమ్మిళ్ల వందన, కిషన్‌పుర, హన్మకొండ

★ జూన్ చతుర నవలలో మాలతి పాత్ర చాలా బాగుంది. ఆమె ఒకరిని ప్రేమిస్తే అతడికి విరోధిని పెళ్లి చేసుకోవాల్సివస్తుంది. ఆమె భర్త భూపతి చెడ్డవాడు కాబట్టి చివరికి ఎంతో భయపడుతూనే చనిపోయాడు. మాలతివల్ల ఒకప్పుడు ఆమెను ప్రేమించిన సీతారామయ్య కుటుంబం బాగుపడింది. అలాగే నవలలో పురాణ పాత్రల ఉపమానాలను పేర్కొంటూ కథను చక్కగా నడిపించారు.

– వాడవల్లి రమాదేవి,
ఆరుగొలను, కృష్ణా జిల్లా

---


చిరునామా: మనసున ఉన్నదీ... సంపాదకుడు, చతుర, ఈనాడు కాంపౌండ్, సోమాజిగూడ, హైదరాబాద్ –500 082

ఈ మెయిల్ చిరునామా: chatura@eenadu.net



# చతుర ప్రవేశిక



జులై - 09

జులై 'చతుర' చదివారా? అయితే ఈ ప్రశ్నలకు ఒకేఒక్క మాటలో జవాబు రాయగలరేమో ప్రయత్నించండి. ఎక్కువమంది సరైన సమాధానాలు రాస్తే డ్రాతీసి విజేతలను ఎంపికచేస్తాం. ఇందులో ఉత్తర ప్రత్యుత్తరాలకు తావులేదు.

1. ఆత్మహత్య చేసుకున్న రమ, హిమల స్నేహితురాలు?
2. హిమ తమ్ముడు ఏ కోర్సు చదువుతున్నాడు?
3. రమ తల్లిపేరు?
4. హిమను ప్రేమించిన సహోద్యోగి?
5. ప్రభాత్ తండ్రి పేరు?
6. ఖైదీలతో ముషాయిరాలు జరిపిన కవి?
7. 'అపహృత స్త్రీ' ఎవరికి అంకితం ఇవ్వబడింది?
8. సుధిని ప్రేమించిన అబ్బాయి ఎవరు?
9. పూర్వాశ్రమంలో యోగా పాఠాలు నేర్పిన నటి?
10. బాలికలకు ఏలూరులో సంగీత పాఠశాలను ప్రారంభించింది?

పంపినవారి పేరు: ------------------------------ వయసు (   )

చిరునామా: ------------------------------------------

------------------------------------------------------

పిన్‌కోడ్: ఫోన్ నెం:

ప్రవేశికలు పంపాల్సిన చిరునామా : సంపాదకుడు, చతుర, ఈనాడు కాంపౌండ్, సోమాజిగూడ, హైదరాబాద్-500 082

ప్రవేశికలకు చివరి తేదీ 16

ఈ కూపన్‌లోనే సమాధానాలు రాసి పంపాలి.

నోట్ : చతుర ప్రవేశిక, విపుల వినోదిని ఒకే కవరులో పంపవచ్చు.

Owned, Printed, Published and Edited by Ramoji Rao for Vasundhara Publications, D.No 6-3-569/3, Eenadu Complex, Somajiguda, Hyderabad-500 082 and Printed at Eenadu Press, D.No.7-134/1&2, Moosapet Village, Balanagar Mandal, Kukatpally-500 072, Ranga Reddy District. Office Address: CHATURA, Telugu Monthly, D.No. 6-3-569/3, Eenadu Complex, Somajiguda, Hyderabad-500 082, Tel: 23318181, Visakhapatnam: 2552211; Vijayawada: 2494900; Tirupati: 2275757; Anantapur: 273444; Karimnagar: 2223216; Rajahmundry: 2468991; Suryapet: 221146; Guntur: 2512142; Nellore: 2338734; Srikakulam: 240101; Kurnool: 252813; Cuddapah: 270011; Tadepalligudem: 228881; Warangal: 2559901; Khammam: 255661; Nizamabad: 245661; Mahabubnagar: 276376; Ongole: 256777; New Delhi: 23753440; Mumbai: 24982498; Chennai: 28232390; Bangalore:25583804. & www.eenadu.net.

# విపుల

# కార్డు కథలకు ఆహ్వానం



విశ్వకథా వేదిక 'విపుల' సరికొత్త పుటకు శ్రీకారం..
నిన్నటి మహాకావ్యం పద్దెనిమిది పర్వాలు...
నేటి మహాకావ్యం పద్దెనిమిది పేజీలు...
రేపటి కావ్యం పద్దెనిమిది పంక్తులు కావచ్చు..
ఆధునిక కాలంలో పెరిగిన వేగం,
మారుతున్న పాఠకుల అభిరుచులు
సంక్షిప్తత కోసం చేతులు చాస్తున్నాయి..
ప్రపంచ సాహిత్యమూ క్లుప్తత చుట్టే తిరుగుతోంది.
గొప్ప గొప్ప క్లాసిక్స్‌కు ఎబ్రిడ్జిడ్ వెర్షన్స్ వస్తున్నాయి.



గుప్పెడు మాటలు రాసినా
గుండెను తడిమితే చాలు..
కథల్ని పిండి బతకడం కాక,
బతుకుల్ని పిండి కథలు రాస్తే
కలకాలం గుర్తుండిపోతాయి..
ఆలస్యమెందుకు?
అందుకోండి కలాలు...

- ★ పోస్టుకార్డుపైనే రాయాలి.
- ★ అక్షరాలు స్పష్టంగా అర్థం కావాలి.
- ★ కొట్టివేతలు దిద్దుబాట్లు ఉండరాదు.
- ★ నలకల్లాంటి అక్షరాలు, ఇరుకిరుకు రాతలువద్దు.
- ★ ప్రచురితమైన ప్రతికథకూ పారితోషికం.
- ★ అసభ్యతకు తావులేకుండా కథనం ఆసక్తికరంగా సాగాలి. 'అల్పాక్షరంబుల అనల్పార్థరచన' అన్నట్టుండాలి.
- ★ తుదినిర్ణయం సంపాదకులదే.
- ★ ప్రచురణకు స్వీకరిస్తే తెలియజేస్తాం. ఉత్తర ప్రత్యుత్తరాలకు తావులేదు. కథలు తిప్పి పంపబడవు.
- ★ రచయిత చిరునామా, ఫోన్‌నెంబరు మరచిపోవద్దు.

కథలు పంపాల్సిన చిరునామా ☛

R.g./SPP/HYD - 2008 पोस्ट कार्ड POST CARD







కార్డు కథలు
విపుల,
ఈనాడు కాంపౌండ్,
సోమాజిగూడ,
హైదరాబాద్

पिन PIN 5 0 0 0 8 2

(इस लाइन के नीचे न तो लिखें और न ही मुद्रित करें Do not write or print below this line)

